# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## రాధ సాహసం
రచన: టెంపోరావ్

## లవర్స్ సెంట్
రచన: వసుంధర

## మిస్ జూలీ కథ
రచన: మిస్ కె. మధుబాల

## నల్లత్రాచు
రచన: చంద్రశేఖర అజాద్

అగ్నికిరీటం - ఏడవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 135
మార్చి, 1985
వెల: రు. 6-00
ఏడాది చందా: 72 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. పీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
కాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# రాధ సాహసం

## టెంపోరావ్

క్యాంపౌండులో షామియానా వేస్తున్నారు. కోటీశ్వరుడు రామోజీరావు సమీపంలో నిలబడి అంతా చూస్తున్నాడు.

యాజ్డీ మోటర్ బైక్ మీద ఒక యువకుడు అక్కడకొచ్చాడు. మెల్లిగా అడుగులు వేస్తూ అతడు రామోజీరావు ముందుకు వచ్చాడు.

"ఎవరు నువ్వు?" అడిగాడు రామోజీరావు.

అతడు మాట్లాడలేదు. ఒక ఫోటోను అతడికి ఇచ్చాడు.

"ఆ ఫోటో చూడండి. అందులో నేనూ వున్నాను" అన్నాడతను.

రామోజీరావు ఫోటో వంక చూసి వులిక్కిపడ్డాడు. అతడి కూతురు మరెవరితోనే నగ్నంగా వుంది!

ఇద్దరూ పక్క పక్కనే పడుకొని వున్నారు.

"ఈ ఫోటో నీకెలా వచ్చింది?"

"మీ కూతురు అలా వున్న సమయంలో ఫోటో

తీశాను" అన్నాడతను.

"నీకేం కావాలి?" అడిగాడు రామోజీరావు.

"మీరు నాకు లక్ష రూపాయిలు యివ్వాలి. అది యివ్వకపోతే యీ ఫోటో పెళ్ళికొడుక్కి వెళ్తుంది" అన్నాడతను.

రామోజీరావు అతడివైపు సూటిగా చూశాడు.

"ఈ ఫోటో వాళ్ళకు పంపొద్దు. నేను నీకు కావల్సిన డబ్బు యిస్తాను" అన్నాడతను.

ఆ యువకుడు మాట్లాడలేదు. రామోజీరావు అతడివైపు చూశాడు.

"నీకు ఎలా యివ్వాలి?"

"రేపు ఐదింటికి బీచ్ కి రండి. గాంధీ విగ్రహం వుందిగా, అక్కడ నిలబడండి. నేను అక్కడికొస్తాను. లక్ష రూపాయిలు నాకివ్వండి. నెగటీవ్ లతోసహా యీ ఫోటోలు మీకు నేను యిచ్చేస్తాను" అన్నాడతను.

"లక్షా నీకిస్తాను" అన్నాడు రామోజీరావు.

అతడు మోటర్ బైక్ మీద వెళ్ళిపోయాడు. రామోజీరావు అక్కడ పచార్లు చేస్తున్నాడు.

తన కూతురు మోహిని గురించి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. ఆమెతో మాట్లాడి అతనెవరో కనుక్కోవచ్చు. కాని అదతనికి యిష్టంలేదు.

తన కూతురు ఏదో తప్పుచేసి వుండొచ్చు. ఆమె చేసింది తనకు తెలుసని ఆమెకు తెలియకూడదు!

కోటీశ్వరుడైన రామానందరావు కొడుకు మోహన్ ఆమెను పెళ్ళాడబోతున్నాడు. ఆ పెళ్ళికి మంత్రులు, వున్నత ఉద్యోగులు, ప్రముఖులు యెందరో వస్తారు. ఈ సమయంలో తన కూతురి భవిష్యత్తుకు యెవ్వరూ అడ్డు

పడకూడదు. తండ్రిగా అతడామెను కాపాడాలి!

రామోజీరావు సమీపంలో వున్న తన సెక్రెటరీని పిల్చాడు. నలభై ఏళ్ళ మహేష్ అతని దగ్గర కొచ్చాడు.

"ఏమిటి సార్?" అడిగాడతను.

పరధ్యానంగా వున్న రామోజీరావు మాట్లాడలేదు. సిగరెట్ వెలిగించాడు.

"మీరు నన్ను పిల్చారా, సార్!"

"అవును, పిల్చాను. మిస్టర్ బులెట్‌కు ఫోన్ చేసి వెంటనే వచ్చి నన్ను కల్సుకోమను" అన్నాడు రామోజీ రావు.

"అతడింకా శ్రీలంక నుంచి రాలేదేమో!"

"వచ్చాడో లేదో కనుక్కో.. రాకపోతే శ్రీలంకలో వున్న అతడిని కాంటాక్టు చెయ్యి. వెంటనే యిక్కడకు రమ్మను. ఎంత ఖర్చయినా ఫరవాలేదు. అతడిక్కడకు రావాలి. నన్ను కల్సుకోవాలి. తెలిసిందా?"

"తెలిసింది, సార్."

సెక్రటరీ మహేష్ ముందు హాల్లోకి పరుగెత్తాడు.

రామోజీరావు మరో సిగరెట్ వెలిగించాడు. అతడి మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి. తనని మోసం చేసి డబ్బు గుంజుకున్న వాళ్ళు ఎక్కువకాలం బతికుండరు. ఆ ఫోటోను తనకిచ్చిన వ్యక్తికి తను బుద్ధి చెప్పాలి!

## 2

ఒంటి గంట దాటింది. రామోజీరావుకి యెదురుగా సూటులో వున్న వ్యక్తి కూర్చుని వున్నాడు.

పొడుగ్గా, బలంగా వున్నాడతను. అమెరికన్ క్రాపు. చురుకైన మనిషి.

అతడి వంక రామోజీరావు నవ్వుతూ చూశాడు.

## 6

"నన్నో వ్యక్తి బ్లాక్ మెయిల్ చేస్తున్నాడు. ఇవాళ సాయంత్రం ఐదింటికి నేను అతడికి లక్ష రూపాయిలు యివ్వబోతున్నాను."

"ఇవ్వకండి. ఆ రాస్కెల్ని నేను పట్టుకుంటాను. బ్లాక్ మెయిలర్ కి మనం లొంగకూడదు!" అన్నాడతను.

రామోజీరావు వ్యంగ్యంగా నవ్వాడు.

"మిస్టర్ బులెట్, అతడికి లొంగే మనిషిని కాను నేను. డబ్బిచ్చి తాత్కాలికంగా అతడి నోరు మూసేస్తున్నాను. నేను డబ్బిచ్చే సమయంలో నువ్వు అక్కడ వుండాలి!"

"ఎక్కడ?"

"గాంధీ విగ్రహం దగ్గర, బీచ్ లో!"

"వుంటాను."

"అతడిని గురించి అంతా కనుక్కో. అంతా తెలిశాక అతడిని ఏం చేయాలో నేను చెప్తాను" అన్నాడు రామోజీరావు.

బులెట్ అతడివైపు సూటిగా చూశాడు.

"ఏ విషయంలో అతడు మిమ్మల్ని బ్లాక్ మెయిల్ చేస్తున్నాడు?"

"అది నేను యెవరికీ చెప్పదల్చుకోలేదు."

"మీరు చెప్పవలసిన అవసరం లేదు లెండి" అన్నాడు బులెట్,

"గుడ్, సరిగ్గా ఐదింటికి నువ్వు అక్కడ వుండాలి."

"వుంటాను."

"ఎల్లుండి మా అమ్మాయి మోహిని పెళ్ళి. ఆ పెళ్ళికి నువ్వు తప్పక రావాలి."

"మీ యిన్విటేషన్ అందింది. తప్పకుండా వస్తాను"

అన్నాడతను.

రామోజీరావు తన సెక్రెటరీని పిల్చాడు. మహేష్ గదిలోకి వచ్చి వినయంగా అతడి ముందుకు నడిచాడు.

"రెండు గ్లాసుల్లో షాంపేన్ పట్రామని బార్ట్రూమ్ లింగూతో చెప్పు!"

"యస్సార్."

మహేష్ వెళ్ళిపోయాడు. తన జేబులోంచి నోట్ల కట్టలుతీసి అతడు బులెట్ కి యిచ్చాడు.

"యాభై వేలు, ఖర్చులకు వుంచుకో!"

మౌనంగా ఆ కట్టలను బులెట్ తన పాంటు జేబులో పడేసుకున్నాడు.

యూనిఫామ్‌లో వున్న లింగూ ట్రేలో రెండు పెద్ద గ్లాసులు పెట్టి తెచ్చాడు. ఇద్దరూ గ్లాసులను అందుకున్నారు. లింగూ వెళ్ళిపోయాడు.

"మిస్టర్ బులెట్, లెటస్ డ్రింక్ షాంపేన్ ఫర్ సక్సెస్! నా రక్తాన్ని పీల్చే దోమలను నలిపి చంపడమంటే నాకెంతో సరదా" అన్నాడు రామోజీరావు.

బులెట్ విచిత్రంగా నవ్వాడు. గ్లాసులోని షాంపాన్ని గడగడ తాగేసి సోఫాలోంచి లేచాడు.

రామోజీరావుతో కరచాలనంచేసి బులెట్ బయటకు వేగంగా అడుగులు వేశాడు.

తన జేబులో వున్న ఫోటోను రామోజీరావు మెల్లిగా బయటకు లాగాడు. మరోసారి పరీక్షగా ఫోటోవైపు చూశాడు.

మంచం పక్కనే వున్న కుర్చీమీద ఆమె చీర, పావడా, బ్రాసియర్, జాకెట్ వగైరా పడున్నాయి.

మోహిని యిలా ఒక దుర్మార్గుడికి లొంగిపోతుందని

తను ఎన్నడూ అనుకోలేదు. ఈ ఫోటోవైపు మోహన్ ఒక్కసారి చూస్తే చాలు తను చేసిన పెళ్ళి యత్నాలన్నీ వృధా అయిపోతాయి.

అతడు సిగరెట్ లైటర్ని నొక్కాడు. పైన మండుతోంది. ఫోటోను ఆ మంటలో కాల్చేశాడు. ఫోటో కాలి నల్లటి మసయింది. దాన్ని యాష్ట్రేలో పడేశాడు.

"సార్!" అన్నారెవరో వెనుకనుంచి.

రామోజీరావు తృళ్ళిపడ్డాడు. పక్కకు తిరిగి చూశాడు. సెక్రెటరీ!

"మీకోసం పోలీసు కమీషనర్ కెంట్ వచ్చారు" అన్నాడతను.

"బాత్రూమ్‌లో కూర్చోమను. వస్తున్నా" అని అతడు లేచాడు.

# 3

నాలుగు నోట్లకట్టలను అతడు గ్రాఫ్ పేపరులో పాక్ చేసి టేప్ కట్టాడు. టైమ్ చూశాడు. నాలుగూ నలభై ఐదు అయింది.

అతడు కిందకు దిగి హాల్లో నుంచి బయటకు నడిచాడు. ముందు వరండామీద నిలబడి వున్న కోమల అతడివైపు నవ్వుతూ చూసింది.

కోమల అతడి భార్య. మోహిని తల్లి!

"ఎక్కడికిప్పుడు? పురోహితుడు వస్తారు" అందామె.

"నేను కాస్సేపట్లో వచ్చేస్తాను. నేను వచ్చేదాకా అయన్ని కూర్చోమను" అన్నాడతను.

డ్రయివర్ డాడ్జికారు తలుపును తెర్చి పట్టుకున్నాడు.

"నేను ఫియట్‌లో వెళ్తాను. నువ్వు రానక్కరలేదు" అన్నాడతను.

ఫియట్‌లో కూర్చుని, తలుపు మూసి అతడు కారును పోనిచ్చాడు. మెయిన్ గేటు దగ్గర కాపలా వున్న ఇద్దరు గూర్ఖాలు అతడికి శల్యూట్ యిచ్చారు.

మెయిన్ రోడ్డమ్మట కారు దూసుకుపోయింది.

బీచ్ రోడ్డు వారగా అతడు కారు ఆపాడు. టైమ్ చూసి అతడు సిగరెట్ వెలిగించాడు. పొగ పీలుస్తూ ఆలోచిస్తున్నాడు.

కొంచెం దూరంలో స్కూటర్ పక్కనే నిలబడి వున్న బులెట్ ఆకారం అతడికి అగుపించింది.

బులెట్ సూటులో లేడు. మారు వేషంలో వున్నాడు. మెకానిక్‌లా వున్నాడు. అతడు ధరించిన పాంట్, షాక్ మీద గ్రీస్ మరకలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. అతడు ముందున్న స్కూటర్ని పరీక్షిస్తున్నాడు.

రామోజీరావు టైమ్ చూశాడు. సరిగ్గా ఐదు అయింది. పాకెట్ తీసుకుని అతడు కిందకు దిగాడు. సమీపంలో వున్న గాంధీ విగ్రహం ముందుకు నడిచాడు. విగ్రహం వైపు చూస్తూ నిలబడ్డాడు.

ప్రఖ్యాత శిల్పి దేవీప్రసాద్ రాయచౌదరి సృష్టించిన శిల్పమది! దూరం నుంచి సముద్రపు హోరు వినపడ్తోంది. ఆకాశంలో గాలిపటాలు ఎగురుతున్నాయి.

"తెచ్చారా?" అన్నారెవరో.

తను వచ్చిన పని గురించి తాత్కాలికంగా మర్చిపోయిన రామోజీరావు వెనక్కు తిరిగాడు. తనకు ఫోటో యిచ్చిన మనిషి వైపు చూశాడు.

తన చేతిలోని పాకెట్‌ను అతడికి యిచ్చాడు.

"అందులో లక్ష రూపాయిలు వున్నాయి. కావలిస్తే లెక్క పెట్టుకో!"

"మీలాంటి పెద్దల్ని నమ్ముతున్నాను" అని అతడు ఒక కవర్ను రామోజీరావుకి యిచ్చాడు.

"అందులో ప్రింట్లు, నెగటివ్స్ వున్నాయి. నా దగ్గర యింకేమీ లేవు. అన్నీ మీకిచ్చేశాను" అన్నాడతను.

రామోజీరావు వ్యంగ్యంగా నవ్వాడు.

"నీ మాటలు నేను నమ్మను. అన్నీ నాకిచ్చేస్తే, నేనిచ్చిన పాకెట్‌లో డబ్బు లేకపోతే ఏం చేస్తావు?"

"మీది పెద్ద బుర్ర. ఒక సెట్ ప్రింట్లు నా దగ్గర వుంచుకున్నాను."

"వుంచుకొని వుండాలని నాకు తెలుసు."

"ఈ పాకెట్‌లో అంతా సవ్యంగా వుంటే ఆ ప్రింట్లను నేను కాల్చి పారేస్తాను" అన్నాడతను.

"మిస్టర్, వెంటనే వాటిని కాల్చి పారేయి! మరో సారి నా దగ్గరకు యీ విషయమై రాకు!"

"రాను" అన్నాడతను.

క్షణకాలం అతడు రామోజీరావువైపు చూశాడు.

"మళ్లా మనం కల్సుకోం. మీ అమ్మాయి నాకు చాలా ఆనందాన్ని యిచ్చింది. నానుంచి చాలా ఆనందాన్ని పొందింది."

"అదంతా నాకు అనవసరం."

"అంత చలాకీ అయిన కూతుర్ని కన్నందుకు తండ్రిగా మీరు గర్విస్తారని చెప్తున్నాను" అని అతడు వెళ్ళిపోయాడు.

"ఎంత పొగరు రాస్కెల్‌కి!" అని లోలోపల అనుకుంటూ రామోజీరావు తన కారు వైపు నడిచాడు.

తను పాకెట్ యిచ్చిన యువకుడు పద్మినీ కారులో వెళ్ళిపోవడం అతడు గమనించాడు.

ఆ కారు వెనకనే వెళ్ళింది బులెట్ స్కూటర్. పద్మినీ కారు వేగంగా పోతోంది. వెనకనే వెళ్తోన్న పాత మోరిస్ కారు వెనక పోనిచ్చాడు బులెట్ తన స్కూటర్ని.

అరగంట పైగా పద్మినీ కారు కదుల్తూనే వుంది. వెస్టు అన్నా నగర్‌లో ఒక కాంపౌండులోకి ఆ కారు ప్రవేశించింది.

చిన్న మేడ. ముందు గేటు తెరిచే వుంది. మేడ ముందు కారు ఆగింది. కారులోని వ్యక్తి పాకెట్ తీసుకుని లోపలకు వెళ్ళాడు.

గేటు కెదురుగా రోడ్డువారగా స్కూటర్ ఆపి ఇంజన్ని పరీక్షిస్తూ వుండిపోయాడు బులెట్. ఆ రోడ్డు పేరును, ఇంటి నంబర్ని అతడు గుర్తుంచుకున్నాడు. టెలిఫోన్ తీగలు ఆ మేడవైపు వెళ్ళాయి. ఆ యింట్లో టెలిఫోన్ వుండి తీరాలి!

గంటపైగా యింజన్ని రిపేర్ చేస్తున్నట్లు నటిస్తూ బులెట్ అక్కడే వున్నాడు. పై కిటికీలోంచి కారులోంచి దిగిన వ్యక్తి ఓసారి అతడివైపు చూసి వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు. స్కూటర్ మెకానిక్‌లు అలా అనేకచోట్ల పట్నంలో కనిపిస్తూ వుంటారు.

బులెట్ సిగరెట్ వెలిగించాడు. రోడ్డు లైట్లు వెల్గుతున్నాయి. పాంటు జేబులో వున్న బుడ్డీలోంచి కొంత రమ్ తాగేశాడు. పొగ వదుల్తూ మేడవైపు చూశాడు.

పై గదుల్లో కింద భాగంలో లైట్లు వెల్గుతున్నాయి. కాని యెవ్వరూ కనబడ్డంలేదు.

స్కూటర్ని అక్కడ వదిలేసి సమీపంలో వున్న సిగరెట్ షాపుకు నడిచాడతను.

కొట్టతనివైపు నవ్వుతూ చూశాడు. ఒక చార్మినార్

పాకెట్ లోని డబ్బు యిచ్చాడు.

"చిల్లర లేదు" అన్నాడు కొట్టతను.

"వుంచుకో. ఈ పక్కకు వచ్చినపుడు నాకు తర్వాత యివ్వొచ్చు" అన్నాడు బులెట్.

ఆ మాటలు విని కొట్టతను సంతోషించాడు.

"ఆ మేడలో ఎవరుంటున్నారు?"

"వాడెవడో నాకు తెలియదు. కారులో వెళ్ళి వస్తూ వుంటాడు. చక్కటి ఆడపిల్లలు అతడితో వస్తూంటారు. సినిమా నిర్మాతేమో!" అన్నాడు కొట్టతను.

"సినిమా స్టారేమో!" అన్నాడు బులెట్.

మరెవరో వచ్చారు. బులెట్ తన స్కూటర్ వైపు నడిచాడు. టైమ్ చూశాడు. ఎనిమిది కావస్తోంది.

అతడు యింట్లోంచి మళ్లా బయటకు వస్తాడా, రాడా? పద్దాకా చూసి వెళ్ళిపోవాలని బులెట్ నిశ్చయించుకున్నాడు.

స్కూటర్ యింజన్ని రిపేరు చేస్తున్నట్లు నటిస్తూ బులెట్ ఆ మేడ కెదురుగా రోడ్డుమీద పడిగాపులు కాస్తూ వుండిపోయాడు.

## 4

తొమ్మిది దాటింది. సమీపంలో వున్న మందుల షాపులోకి నడిచాడు. రిసీవర్ ఎత్తి ఒక నంబరు తిప్పాడు.

"హలో, మహేష్!" అందో కంఠం.

"బులెట్ హియర్! రామోజీరావుగారితో మాట్లాడాలి."

"వుండండి, ప్లీజ్."

కాస్సేపట్లో రామోజీరావు కంఠం అటువైపునుంచి వినబడింది.

"మిస్టర్ బులెట్, వాట్ న్యూస్?"

"అతడి యిల్లు కనుక్కొన్నాను. అతడి యింటిముందు యింతవరకూ వున్నాను. అతడు యింకా యింట్లోనే వున్నాడు."

"ఏడు తర్వాత అతడు నాకు ఫోన్ చేశాడు."

"ఏం చెప్పాడు?"

"అది నేను చెప్పలేను" అన్నాడు రామోజీరావు.

ఏడు తర్వాత తనకు ఫోన్ చేసి అతడు మాట్లాడాడు.

"మీరిచ్చిన డబ్బు సరిగ్గా వుంది. నా దగ్గరున్న ప్రింట్లను యిప్పుడే కాల్చేశాను" అన్నాడతను.

"గుడ్! నా దగ్గరకు డబ్బుకోసం మళ్ళా రాకు!"

"రావలసిన అవసరం వుండదనే నా నమ్మకం" అని అతడు రిసీవర్ పెట్టేశాడు.

"మీరక్కడ వున్నారా?" అడిగాడు బులెట్.

"వున్నాను" అన్నాడతను.

"అతడి నివాసం తెలుసుకున్నానుగా, యిటుపైన అన్నీ కనుక్కొంటాను" అన్నాడు బులెట్.

"విష్ యు సక్సెస్!"

బులెట్ రిసీవర్ పెట్టేసి, డబ్బు చెల్లించి బయటకు నడిచాడు. తన స్కూటర్ వైపు వేగంగా నడిచాడు.

మేడమీది లైట్లు ఆరిపోయాయి. అతడు నిద్ర పోతున్నాడా? కాస్సేపట్లో కారు గేటుదాటి బయట కొచ్చి ఆగింది.

"యూ మెకానిక్?" పిల్చాడు కారులో కూర్చున్న వ్యక్తి.

బులెట్ భుజాలు ఎగరేస్తూ కారు దగ్గరకు వెళ్ళాడు. కారులోకి చూశాడు. ఆ వ్యక్తి పక్కనే ఒక యువతి

కార్లో కూర్చుని వుంది.

"ఆ గేటు మూసేయి" అన్నాడతను.

ఇంటి మెయిన్ గేటును బులెట్ మూసేశాడు.

"గుడ్ ఫెలో, ఈ రూపాయి వుంచుకో! టీ తాగు" అన్నాడా వ్యక్తి.

బులెట్ అతడిచ్చిన రూపాయిని తీసుకున్నాడు. కారు రోడ్డుమ్మట దూసుకుపోయింది. వెనకనే యేదో లారీ వెళ్ళింది. లారీ వెనక బులెట్ తన స్కూటర్ని పోనిచ్చాడు.

ఒకచోట పద్మినీ కారు ఆగింది. అతడి పక్క కూర్చున్న యువతి కిందకు దిగింది. కారు వెళ్ళిపోయింది. స్కూటర్ ఆమె పక్కనే ఆగింది.

ఆమె భయపడూ అతడివైపు చూసింది.

"మిస్ ఎక్కడికి కెళ్ళాలి?" అడిగాడతను.

ఆమె ఒక యింటివైపు చెయ్యి చూపించింది.

"అదే నా యిల్లు" అందామె.

"ఆ కారులో వెళ్ళినాయన మంచివాడు. గేటుమూసేనాకు రూపాయి యిచ్చారు. ఒంటరిగా వెళ్తూన్న నీకు ప్రమాదం రాకూడదని పక్కనే స్కూటర్ ఆపాను" అన్నాడతను.

"థాంక్స్. నేను మా యింటికి వెళ్ళగలను. భయం లేదు" అందామె.

ఆమె యిల్లును అతడు గుర్తుంచుకున్నాడు.

"పోతానమ్మా" అని అతడు స్కూటర్ని పోనిచ్చాడు.

ఆ వ్యక్తి కారు మాయమైంది. టైమ్ పది దాటింది. ఇప్పుడు తను చేయగల్గింది యేమీ లేదు.

బులెట్ స్కూటర్ని తన యింటివైపు పోనిచ్చాడు.

కాంపౌండులో స్కూటర్ని ఆపాడు. మిస్ రూప అతడి వైపు పరుగెత్తుకొచ్చింది.

"మీరు లేరని బాబా చెప్పాడు. తప్పక వస్తారనే నమ్మకంతో వున్నాను" అందామె.

"గుడ్, పద" అన్నాడతను.

ఇద్దరూ కిందనున్న హాల్లోకి వెళ్ళారు.

"నువ్వు కూర్చో! నేను స్నానం చేసి వస్తాను" అన్నాడు బులెట్.

"ఈ మారు వేషంలో మీరు చాలా బాగున్నారు" అందామె.

అతడు నవ్వాడు.

"నా అసలు దుస్తుల్లో యింకా బాగుంటాను" అన్నాడతను, లోపలకు వెళ్తూ.

వంటతను బాబా హాల్లో కొచ్చాడు.

"అయ్యగారొచ్చారా?" అడిగాడతను.

"వచ్చారు. స్నానానికి వెళ్ళారు" అందామె.

బాబా నిక్కరులో వున్నాడు. పైన దుస్తులు లేవు. ఛాతీ నిండా బొచ్చు!

"మిస్ రూపా, యివాళ మీరు కూడా యిక్కడ భోజనం చేయండి. మంచి పదార్థాలు!" అన్నాడతను.

"ఆయన వుండమంటే వుంటాను" అందామె.

అరగంట తర్వాత పైజామా, జుబ్బా ధరించి బులెట్ హాల్లో కొచ్చాడు.

"ఇవాళ జేమ్స్‌బాండ్ థండర్‌బాల్ చూశాను. గొప్ప ఫిలిం. అది చూసి వెంటనే ఇక్కడకు వచ్చేశాను" అందామె.

ఆమెవైపు అతడు నవ్వుతూ చూశాడు.

మిస్ రూపా పదహారేళ్ళ యువతి. పదో స్టేండర్డు చదువుతోంది.

"మిస్ రూపా, యిప్పుడు టైమెంతయిందో తెలుసా?"

"పది దాటింది."

"ఈ పాటికి నీలాటి అమాయకపు పిల్లలు సుఖంగా నిద్రపోతూ వుండాలి" అన్నాడతను.

"నాకు నిద్ర రావడంలేదు. మీతో ఎంతసేపైనా వుండగలను" అందామె.

"అలా వుండడం నీ ఆరోగ్యానికి మంచిది కాదు. నువ్వు భోజనం చేసి, పడుకోవాలి."

"మీతో తింటాను" అందామె.

తనంటే ఆమె కెంతో ఇష్టం. తనొక జేమ్స్‌బాండ్ అని ఆమె భావిస్తుంది. తనకోసం రోజూ వస్తూవుంటుంది. కాని తను ఆమెను మార్చాలి! నేరస్తులను పట్టుకునే తను నేరస్తుడవకూడదు!

"మనం భోజనం చేశాక నిన్ను నీ యింట్లో వదిలేస్తాను" అన్నాడతను.

ఆమె తలాడించింది. బులెట్ పిలవగానే బాబా పరుగెత్తుకొచ్చాడు.

"డైనింగ్ రూమ్‌లో యిద్దర్కీ వడ్డించు" అన్నాడు బులెట్.

బులెట్, మిస్ రూప ఆకలితో తిన్నారు. డిన్నర్ అయ్యాక హాల్లోకి వచ్చారు.

"పదకొండు అవుతోంది. నిన్ను దింపుతాను, పద" అన్నాడతను.

ఆమె సోఫాలోంచి లేవలేదు.

"నేను మిమ్మల్ని వదల్లేను!" అందామె.

ఆమెవైపు సూటిగా చూశాడతను.

"రూపా, నేను ఒంటరివాడిని. ప్రమాదాలతో కూడు కున్న పనినాది. నేను ఏ క్షణంలోనైనా పోవచ్చు. నాకు ఎవ్వరితోటీ బంధా లుండకూడదు" అన్నాడతను.

"అలా అనకండి. మిమ్మల్ని ఎవ్వరూ ఏమీ చెయ్య లేరు. జేమ్స్‌బాండ్‌లా మీరు అందర్నీ ఓడించగలరు" అందామె.

"అదంతా కథల్లో. జీవితం వేరుగా వుంటుంది" అన్నాడతను.

మిస్ రూపాను తీసుకెళ్ళి అతడు కారు ముందుసీటులో కూర్చోబెట్టాడు. పక్కనే కూర్చుని కారును పోనిచ్చాడు.

ఆమె యింటిముందు అతడు కారు ఆపాడు. ఆమెను తీసుకెళ్ళి తల్లికి అప్పగించాడు.

"ఎక్కడకు వెళ్ళావమ్మా? నీ కోసం గాభరాతో ఎదురుచూస్తున్నాను" అంది తల్లి.

"జేమ్స్‌బాండ్ సినిమా చూసి బులెట్ గారి యింటికి వెళ్ళి, భోజనం చేసి వస్తున్నాను. ఆయన పక్కనుంటే నాకు భయం లేదు" అందామె.

"సుందరమ్మగారూ. మీ అమ్మాయి రూప చాలా వుషారయినది. అందుకే తీసుకొచ్చి యిక్కడ వదులు తున్నాను" అన్నాడతను.

"మీకు చాలా థాంక్స్!" అందామె.

వాళ్ళిద్దరికీ గుడ్‌నైట్ చెప్పి బులెట్ తన కారు వైపు నడిచాడు. కారును స్టార్టు చేశాడు. అమాంతంగా రూప కారు పక్కకు పరుగెత్తుకొచ్చింది.

"ఇంటికేనా?"

"అవును" అన్నాడు బులెట్.

"స్వీట్ డ్రీమ్స్" అందామె.

# 5

కారును రోడ్డువారగా ఆపి, అతడు కూర్చున్నాడు. ఆమె చూపించిన యింటివైపే చూస్తున్నాడు.

అతడు సిగరెట్ పీలుస్తూ టైమ్ చూశాడు. తొమ్మిది దాటింది.

ఆ యింట్లోంచి బ్యూక్ కారు బయటకు వచ్చింది. కారు వెనుకసీటులో నలభైఐదేళ్ళ పెద్దమనిషి కూర్చుని వున్నాడు. అతడామె తండ్రి కావచ్చు! ఆమె ధనవంతుల బిడ్డయి వుండాలి! సందేహంలేదు!

కాస్సేపట్లో ఒక యువతి వయ్యారంగా నడుస్తూ రోడ్డుమీదకు వచ్చింది. అతడి కారు పక్కనుంచి ఆమె వెళ్తోంది.

"మిస్!" పిల్చాడతను.

ఆమె చేతిలో పుస్తకాలున్నాయి. ఆగి ఆమె అతడి వంక చూసింది.

ఆమె వయస్సు పదెనిమిదేళ్ళు వుండొచ్చు.

"నన్ను పిల్చారా?" అందామె అతడి వంక చూస్తూ.

"నేనే పిల్చాను. కారులో కూర్చో! నిన్ను నీ కాలేజి దగ్గర దింపుతాను" అన్నాడతను.

అతడివైపు ఆమె పరీక్షగా చూసింది. చాలా ఆకర్షణీయంగా వున్నాడతను. ఆమె తలుపు తెర్చి ముందుసీటు మీద కూర్చుంది.

అతడు కారును పోనిచ్చాడు. ఆమెవైపు ఓరగా చూశాడు.

"నీ ఫ్రెండు రాలేదా?" అడిగాడతను.

"ఎవరు?" అందామె.

"నిన్న రాత్రి పది తర్వాత నిన్నిక్కడ దింపినతను" అన్నాడు బులెట్.

"అతడు దింపినట్లు మీకెలా తెలుసు?" అందామె.

"నేను నా స్కూటర్ని నీ పక్కనే ఆపాను" అన్నాడతను.

"ఎవడో మెకానిక్ నా పక్కనే స్కూటర్ ఆపాడు" అందామె.

"ఆ స్కూటర్ నాదే. ఆ మెకానిక్ నీ గురించి నాతో చెప్పాడు. అందుకే యిక్కడ వేచివున్నాను."

ఆమె జవాబివ్వలేదు. బయటకు చూస్తోంది. అతడు కారును మెల్లిగా పోనిస్తున్నాడు.

"మా స్నేహం చెడింది" అందామె.

"ఎందువలన?"

"అతడు నన్ను పెళ్ళాడడు. నా లాంటి యువతులతో అతడు ఆటాడుతూ వుంటాడు."

"అతడు ఆడే ఆట ఏమిటి?"

ఆమె తల వంచుకొంది. బులెట్ ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

"మిస్, నువ్వు చాలా మంచిదానవు. నిన్ను అతడు మోసం చేస్తే నేను భరించను!"

"అతడు మంచివాడు కాడు. నా కన్యత్వాన్ని దోచుకున్నాడు. నగ్నంగా వుండగా నా ఫోటోలు తీశాడు!"

"ఎందుకు?"

"అతడికది ఆనందంగా వుంటుందన్నాడు. సరే

అన్నాను."

"మీ స్నేహం ఎందుకు చెడింది?"

"మళ్లీ మనం కల్సుకోకపోవచ్చు అన్నాడతను, నన్ను దింపాక. ఎందువలనని నే నడిగాను. మరో పిల్లతో అతడి తలిదండ్రులు పెళ్ళి నిశ్చయం చేసేశారట" అందామె.

"అతడి మాటల్ని నువ్వు నమ్ముతున్నావా?"

"నేను నమ్మకపోతే వచ్చే లాభం యేమిటి?" అందామె.

"నీతో అతడికి యెలా పరిచయమైంది?" ప్రశ్నించాడతను.

"అతడు నా క్లాస్ మేటు మోహినితో తిరిగేవాడు. ఆమె అతడికి నచ్చలేదట. నాతో స్నేహం చేశాడు. చివరకి నన్నూ మోహినిలాగే వదిలేశాడు" అందామె.

కాలేజి ముందు అతడు కారు ఆపాడు. ఆమె దిగింది.

"నీ పేరు?"

"మాలతి" అందామె.

అతడామెకు ఒక కార్డు యిచ్చాడు. ఆ కార్డువైపు ఆశ్చర్యంగా చూసింది.

"మిస్ మాలతీ, నీ ఫ్రెండ్ మూలంగా నువ్వు ఏదేనా కష్టంలో యిరుక్కుంటే నాకు వెంటనే ఆ నంబర్ కి ఫోన్ చేయి!" అన్నాడతను.

"తప్పక ఫోన్ చేస్తాను" అని ఆమె కాలేజివైపు వెళ్ళిపోయింది.

బులెట్ తన కారును వేగంగా ముందుకు పోనిచ్చాడు.

# 6

మాధవరావు అతడివైపు సూటిగా చూశాడు.
"ఎవరు నువ్వు?" అడిగాడతను.

"ఈ ఫోటో చూస్తే నేనెవరో తెలుస్తుంది. ఈ ఫోటోలో వున్నాను నేను" అన్నాడతను.

మాధవరావు అతడిచ్చిన ఫోటోవైపు చూశాడు. ఉలిక్కిపడ్డాడు.

తన కూతురు మాలతి అతడితో నగ్నంగా పరుపుమీద పడుకుని వుంది!

"ఏదో జరిగిపోయింది. నన్ను యిప్పుడు యేం చేయమంటావు?"

"నాకు లక్ష రూపాయలిస్తే యీ ఫోటోలు నెగటివ్లతో సహా మీ కిచ్చేస్తాను" అన్నాడతను.

"నీకేం కావాలో నువ్వు చెప్పావు. నేను చెయ్యాలి సింది చేస్తాను" అన్నాడు మాధవరావు.

అతడు వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు. అతడి స్కూటర్ సాగుతూ బయటకు వెళ్ళిపోయింది.

మాధవరావు కోపంగా కూతురి గదిలోకి వెళ్ళాడు. ఆమె చదువుకుంటోంది.

"మాలతీ!" పిల్చాడతను.

మాలతి అతడి మొదటి పెళ్ళాం కూతురు. మొదటి భార్య పోయాక అతడు మళ్ళీ పెళ్ళాడాడు. రెండో భార్యకు ఒక కొడుకు. అతడింకా చిన్నవాడు.

"నువ్వు కాలేజికి యెందుకెళ్తున్నావు? చదువుకో డానికా లేక యిందుకా?" అని ఆ ఫోటోను ఆమెవైపు విసిరాడు, ఆ ఫోటోను తీసుకుని దానివైపు చూసి వణక సాగింది.

"యూ డర్టీ బిచ్!" అర్చాడు తండ్రి.

ఏడుస్తూ ఆమె తండ్రివైపు చూసింది.

"అతడు నన్ను మోసం చేశాడు, నాన్నా. ప్రేమించా నన్నాడు. పెళ్ళాడ్తా నన్నాడు" అంది మాలతి.

మాధవరావు దగ్గరకు అతడి రెండో భార్య ప్రమీల వచ్చింది. జరిగినదంతా ఆమెతో చెప్పాడతను. ఆమె మౌనంగా విన్నది. భర్తవైపు అదోలా చూసింది.

"మీరు మీ గదికి వెళ్ళండి. ఈమె విషయం నేను చూస్తాను" అంది ప్రమీల.

భర్త వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు.

కోపంగా ఆమె సవతి కూతురువైపు చూసింది. "ఇటువంటి వెధవపని యేదో చేసి మా యింటికి అపకీర్తి తెస్తావని నేను భయపడేదాన్ని. ఇప్పుడలాగే అయింది" అందామె.

నేలమీద కూర్చుని మాలతి ఏడుస్తోంది.

"వాడికివ్వడానికి మీ నాన్న దగ్గర డబ్బు లేదు. వ్యాపారంలో యీ మధ్య ఆయన కంపెనీలు బాగా నష్టపోతున్నాయి. వాడి దగ్గరకు వెళ్ళి ఆ ఫోటోలు వెనక్కు పట్రా. ఏం చేస్తావో నాకు తెలియదు. ఆ ఫోటోలను నువ్వే తెచ్చుకోవాలి. అవి వాడి చేతిలో వుంటే నీ మొహం ఎవ్వరూ చూడరు" అంది ప్రమీల.

"అలాగే నమ్మా. నేను వెళ్ళి అతడితో మాట్లాడి చూస్తాను" అంది మాలతి.

ప్రమీల భర్త గదికి నడిచింది. అతని పక్కనే సోఫాలో కూర్చుంది. మాధవరావు ఆమె నడుం చుట్టూ చెయ్యిని పోనిచ్చాడు.

"ఏం చేద్దాం?" అన్నాడతను.

"మీరు బెంగట్టుకోకండి. ఆమె అతడిని కలుసుకుని మాట్లాడి ఆ ఫోటోలన్నీ తెస్తుంది."

"వా డివ్వడు."

"మీ కూతురూ, వాడూ కలిసి యీ విధంగా మిమ్మల్ని బ్లాక్ మెయిల్ చేసి డబ్బు గుంజాలని చూస్తున్నారు" అందామె.

"అది నువ్వెలా కని పెట్టావు?" అడిగాడతను.

"మాలతి చదువుకున్న పిల్ల, స్టుపిడ్ కాదు. ఎవ్వరూ అలా ఫోటోలు తీయించుకోడానికి అంగీకరించరు. తను చేసిన చెడ్డ పనికి శాశ్వతంగా రుజువు లుండేటట్లు ఫోటోలు తీయించుకుంది. ఆమె అమాయకురాలు కాదు. తెలివైనది. ఇద్దరూ కలిసి మిమ్మల్ని మోసం చెయ్యడానికి ప్రయత్నిస్తున్నారు" అంది ప్రమీల.

టెలిఫోన్ మ్రోగింది. మాధవరావు రిసీవర్ని యెత్తి, "హలో!" అన్నాడు.

"మీకు ఫోటోలు యిచ్చి వెళ్లాను. ఏం చెయ్యడానికి నిశ్చయించుకున్నారు?" అడిగిందో కంఠం అటువైపు నుంచి.

"నాకు మూడు రోజులు వ్యవధి కావాలి. వెంటనే చెప్పలేను" అన్నాడతను.

"మూడు రోజులు దాటాక ఫోన్ చేస్తాను," అని అతను రిసీవర్ పెట్టేశాడు.

మాధవరావు తన భార్య పక్కకు వెళ్ళి కూర్చున్నాడు.

"ఎవరు?" అడిగిందామె.

"వాడే" అన్నాడతను.

అంతా ఆమెకు వివరంగా చెప్పాడు.

"నా అనుమానం నిజమనిపిస్తోంది. మీకు కెలరోజులు లైఫ్ కావలసినా వాడు యిస్తాడు. ఆ మధ్య ఢిల్లీలో ఒక సంఘటన జరిగింది. అది గుర్తుందా?"

"ఏమిటది?"

"భార్యకు చాలా ఆస్తుంది. భర్తకు డబ్బు కావాలి. కాని భర్త అడిగితే ఆమె యివ్వదు. ఆ పరిస్థితుల్లో ఎవరో వాళ్ళ కొడుకును ఎత్తుకుపోయారు, మూడేళ్ళ కుర్రాడిని. చివరకి యేం తేలిందో తెలుసా? భర్తే కొడుకును ఎత్తుకు పోయి ఎక్కడో దాచాడు. మరొకడి సహాయంతో బ్లాక్ మెయిల్ చేసి డబ్బు సంపాదించడానికి ప్రయత్నించాడని డిటెక్టివ్‌లు కనుక్కున్నారు" అంది ప్రమీల.

"గుడ్ గాడ్!" అన్నాడతను.

"ఈ రోజుల్లో పిల్లల నుంచి పెద్దలదాకా కోరికలు పెరిగిపోయాయి. అందరికీ డబ్బు కావాలి. డబ్బు కోసం అడ్డదారులు తొక్కవలసి వస్తుంది" అంది ప్రమీల.

మాధవరావు తన భార్య వంక ఆప్యాయంగా చూశాడు.

"వాడిచ్చిన ఫోటో చూసి, ఏం చెయ్యాలో తోచక, సాలిగూడులో యిరుక్కున్న పురుగులా నేను గిజ గిజ కొట్టుకున్నాను. నువ్వే నన్ను రక్షించావు," అన్నాడతను.

# 7

కాలేజికి వెళ్తూ మాలతి ఒక షాపు ముందు ఆగింది. మెల్లిగా లోపలకు నడిచింది.

పుస్తకంలో వున్న ఒక కార్డు తీసి ఆ నంబరుకు ఫోన్

చేసింది.

"హలో, బులెట్ హియర్!" అన్నాడతను.

"సార్, నేను మాలతిని. మీ సహాయం నాకు కావాలి" అందామె.

"నువ్వు ఎక్కడున్నావు?"

ఆమె చెప్పింది.

"నువ్వు అక్కడే వుండు. నేను పది నిమిషాల్లోపల వస్తాను. మాట్లాడుదాం" అన్నాడు బులెట్.

"తొందరగా రండి ..." అని ఆమె రిసీవర్ పెట్టేసింది.

రోడ్డు వారగా నిలబడి వుందామె. రోడ్డమ్మట కార్లు, లారీలు, ఆటోలు దూసుకుపోతున్నాయి. విచార వదనంతో ఆమె వాటివైపు చూస్తోంది.

తటాలున ఆమె పక్కనే అంబాసిడర్ కారు ఆగింది. ముందు తలుపు తెరిచాడతను.

"మిస్ మాలతీ, కూర్చో!" అన్నాడతను.

ఆమె కారులో కూర్చుని తలుపు మూసింది.

"నీ ఫ్రెండు మూలంగా నువ్వు కష్టాలపాలవుతావని నాకు తెలుసు. అందుకే నా కార్డు నీకిచ్చాను" అన్నాడతను.

మెల్లిగా కారు వెళ్తోంది.

"ఏమైందో చెప్పు!"

"నా ఫోటోలు తీశాడని మీకు చెప్పాను, గుర్తుందా?"

"నగ్నంగా వుండగా తీశాడన్నావు."

"ఆ ఫోటోలో అతడూ, నేనూ వున్నాం. ఆ ఫోటో నాన్నకు చూపించి లక్ష రూపాయలు ఇమ్మని అతడు

బెదిరిస్తున్నాడు."

"నీ తండ్రి యిస్తానన్నాడా?"

"నా తల్లి బతికుంటే యిచ్చేవాడేమో! అమ్మ పోయాక నాన్న మళ్లా పెళ్లాడాడు. నా సవతితల్లి ప్రమీలకు నేనంటే అంతగా యిష్టంలేదు. ఆమె యివ్వనివ్వదు."

"అయితే యిప్పుడు ఏం చెయ్యాలి?"

"నా సవతి తల్లి నాతో మాట్లాడింది. వెళ్ళి ఆ ఫోటోలను తెమ్మంది. కాని అతడు యిస్తాడనే నమ్మకం నాకు లేదు. మీరు నాతో వస్తే అతడిని బెదిరించి మనం ఆ ఫోటోలు తీసుకోవచ్చు" అందామె.

"ఇప్పుడు కాలేజికి వెళ్లాలా?"

"వెళ్ళను. నాకు మెంటల్ పీస్ లేదు. ఏదీ చెయ్యబుద్ధి కావడం లేదు."

అతడు కారును వెనక్కి తిప్పి పోనిచ్చాడు.

"మా యింటికి వెళ్దాం. అతడితో నువ్వు చేసినదంతా వివరంగా నాకు చెప్పాలి. ఆ తర్వాత నీకేవిధంగా సహాయపడగలనో నేను చూస్తాను" అన్నాడతను.

ఆమె అతడి చెయ్యి పట్టుకుంది.

"ప్లీస్ హెల్ప్ మి!" అందామె కన్నీళ్ళతో.

ఒక కాంపౌండులో కారు ఆగింది. ఇద్దరూ కిందకు దిగారు. ఎిర్ కండిషండ్ ఆఫీసు గదిలోకి అతడు నడిచాడు. వెనకనే వెళ్ళిందామె.

రొటేటింగ్ కుర్చీలో కూర్చున్నాడతను. ఎదురుగా వున్న సోఫాలో ఆమెను కూర్చోమన్నాడు. ఆమెవైపు నవ్వుతూ అతడు చూశాడు.

"అతడితో నీకెలా పరిచయమైంది? అంతా వివరంగా

చెప్పు!" అన్నాడు బులెట్.

"అతడు పద్మినీ కారులో మా కాలేజికి వచ్చేవాడు. మోహినితో అతడు తిరిగేవాడు. మోహినితో వుండగా అతడు నన్ను చూశాడు. ఒకరోజు మోహిని కాలేజికి రాలేదు. అతడామెను గురించి నన్ను అడిగాడు. ఆమె రాలేదని చెప్పాను. తన కారులో నన్ను యింటి దగ్గర దింపుతానన్నాడు. సరే అని అతడి కారులో యెక్కాను. అతడు కారును పోనిచ్చాడు" అందామె.

ఆమె చెప్పింది వింటూ బులెట్ సిగరెట్ వెలిగించాడు.

"ప్రొసీడ్" అన్నాడు బులెట్.

"అతడు అందంగా వుంటాడు. చక్కగా మాట్లాడగలడు. ఏదేనా హోటల్‌కి వెళ్దామన్నాడు. ఇద్దరం అట్లాంటిక్ హోటల్‌కి వెళ్లాం. బేరర్ రాగానే అతడు ఆర్డరిచ్చాడు. ఇద్దరం తింటూ మాట్లాడసాగాము. మేం లేచేసరికి చీకటి పడింది. అతడు బిల్లు చెల్లించాడు. నా గురించి అడిగాడు. అంతా చెప్పాను. నా తండ్రి రెండో పెళ్ళి చేసుకున్నాడని నేను చెప్పలేదు."

"తర్వాత ఏమైంది?"

"మోహిని తనకు నచ్చలేదని చెప్పాడతను. ఇటుపైన ఆమెను చూడనన్నాడు. నన్ను ప్రేమిస్తున్నానన్నాడు. నన్ను పెళ్ళాడతానన్నాడు. అతడి మాటలు విని నేను పొంగిపోయాను. సవతి తల్లికి దూరంగా పోవాలని నా ఆశ. అతడు నన్ను పెళ్లాడితే నేను మరో చోటుకు పోవచ్చు. సవతి తల్లితో వుండనక్కరలేదు. అలా భావిస్తూ సంతోషించాను. అటుపైన యిద్దరం కల్సుకునేవాళ్ళం. అతడి కారులో అనేక చోట్లకు వెళ్ళేవాళ్ళం.

అతడు పెద్దమనిషిలా ప్రవర్తించేవాడు."

టెలిఫోన్ మ్రోగింది. బులెట్ యెవరితోనో మాట్లాడి రిసీవర్ని పెట్టేశాడు. ఆమె వైపు తిరిగి "చెప్పు!" అన్నాడు.

"ఒకనాటి రాత్రి అతను నన్ను తన యింటికి తీసుకు వెళ్ళాడు. ఇంట్లో యెవ్వరూ లేరు. పడగ్గదిలోకి నన్ను తీసుకెళ్ళాడు. నా నగ్న సౌందర్యాన్ని చూడాల న్నాడు. నేను సిగ్గుపడ్డాను. పెళ్ళి అయ్యాక అవన్నీ చూడొచ్చు అన్నాను. ప్రేమించిన క్షణంలోనే దైవ సాక్షిగా మా పెళ్ళి అయిపోయిందని అన్నాడతను. తనని నమ్మమన్నాడు. ఆ పరిస్థితుల్లో ఏమీ చెయ్యలేక అతడికి పూర్తిగా లొంగిపోయాను. అతడు ఫోటోలు కూడా తీశాడు. రాత్రి పది దాటాక అతడు నన్ను మా యింటి సమీపంలో దింపేశాడు. ఆటుపైన అతడు కాలేజికి రావడం మానేశాడు."

"బాస్టర్డు!" అర్చాడు బులెట్.

"అతడి యిల్లు నాకు గుర్తుంది. ఒకరోజు అతడి యింటికి వెళ్ళాను. అతడు నాతో ముభావంగా మాట్లా డాడు. మధురలో వున్న తలిదండ్రులు మరో అమ్మాయితో తన పెళ్ళి నిశ్చయం చేశారన్నాడు. తనని మర్చిపొమ్మని నన్ను మా యింటి దగ్గర దింపేశాడు. ఆటుపైన ఆ ఫోటోతో వచ్చి నాన్నను బెదిరించి అతడు లక్ష రూపాయిలు యిమ్మన్నాడు."

"డర్టీ రోగ్!" అన్నాడు బులెట్.

"ఇప్పుడు నేను ఏం చెయ్యాలి?"

"మాలతీ, నువ్వు భయపడకు. నీ సవితి తల్లి అడిగితే ఫోటోలు తెస్తానని చెప్తూ వుండు. నువ్వు అతడి యింటికి వెళ్ళొద్దు. అతడు యిలా చాలామంది యువతులను మోస

గించి బ్లాక్ మెయిల్ చేస్తున్నాడు. కొందరు అతడికి డబ్బు చెల్లించారు. అతడిని గురించి నేను దర్యాప్తు చేస్తున్నాను. నువ్వు చెప్పినదంతా నా పరిశోధనకు చాలా ఉపయోగపడుతుంది. త్వరలో నీ ఫోటోలు తెచ్చి నేను నీకిస్తాను. నీకు యే ప్రమాదం రాకుండా నేను చూస్తాను" అని అతడు హామీ యిచ్చాడు.

"మోహిన్ని కూడా అతడు ఇలాగే మోసగించాడా?" అడిగిందామె.

"అది నాకు తెలియదు. కనుక్కోవాలి" అన్నాడతను.

రామోజీరావు తన నుంచి యెంతో దాచాలని చూశాడు కాని అంతా తనకు తెలిసిపోయింది!

"అతడిని గురించి మోహిని నీతో ఏం చెప్పింది?"

"ఆమె పెళ్ళి నిశ్చయమైందిగా! ఆమె కాలేజికి రావడంలేదు" అంది మాలతి.

"రేపు మోహిని పెళ్ళి! ఆమె పెళ్ళికి వెళ్తావా?" ప్రశ్నించాడతను.

"ఇదేదో తేలిందాకా నేనెక్కడికీ వెళ్ళదల్చుకో లేదు. ముళ్ళమీద కూర్చున్నట్లుంది నా బ్రతుకు" అందామె.

"మాలతీ, పోదాం పద" అన్నాడు బులెట్.

ఆమె కారులో కూర్చుంది. అతడు కారును పోనిచ్చాడు.

"అతడి పేరేమిటి?"

"మోహిని రాజా అని అతడిని పిల్చేది. నాతో తన పేరు మురళీ అని చెప్పాడతను."

"అతడు పేర్లు మారుస్తూ వుండాలి" అన్నాడు

బులెట్.

"ఇక్కడ కారు ఆపండి. నా ఫ్రెండ్ యింటికి వెళ్ళి అక్కడనుంచి నా యింటికి పోతాను."

"ఆ ఫ్రెండుకి కూడా అతడు తెలుసా?"

"అడిగిచూడాలి" అందామె.

"ఆమె కతడు తెలిస్తే నాకు ఫోన్ చేసి చెప్పు" అని కారును ఆపాడతను.

ఆమె కిందకు దిగింది. అతడివైపు కృతజ్ఞతతో చూసింది.

"మీతో మాట్లాడాక నాకు కొంత ధైర్యం వచ్చింది" అని కదిలిందామె.

బులెట్ తన అంబాసిడర్ కారును వేగంగా ముందుకు పోనిచ్చాడు.

# 8

పద్మినీ కార్లోంచి దిగిన యువతి రోడ్డమ్మట నడుస్తోంది. సన్నగా, పొడుగ్గా వుందామె.

అంబాసిడర్ కారు ఆమె పక్కనే ఆగింది.

"మిస్ ఎక్కు!" అన్నాడు బులెట్.

ఆమె భయంగా అతడివైపు చూసింది.

"ఆ కార్లోంచి యిప్పుడే దిగావు. అతడితో తిరుగుతున్నావని నేను నీ తండ్రితో చెప్తే ఏమవుతుందో ఆలోచించు!" అన్నాడు బులెట్.

ఆమె సీటుమీద కూర్చుని, తలుపు మూసింది.

"ప్లీస్, నాన్నతో చెప్పొద్దు. నాన్న నా తోలు వలేస్తాడు" అందామె.

"ఏం చదువుతున్నావు?"

"బి. ఎ. ఫస్టు యియ్యర్."

"నువ్వు దిగిన కారు ఎవరిది?"

"ప్రీతమ్‌ది."

"నీతో తన పేరు ప్రీతమ్ అని అతడు చెప్పాడన్న మాట!" అన్నాడు బులెట్.

"అతడికింకా పేర్లు వున్నాయా?"

బులెట్ వ్యంగ్యంగా నవ్వాడు.

"తను కలుసుకున్న ప్రతి యువతికీ ఏదో పేరు చెపుతూ వుంటాడతను. ఒక అమ్మాయికి అతడు రాజా, మరో అమ్మాయికి మురళీ. నీకు అతడు ప్రీతమ్."

"మీకు అతను తెలుసా? అతడి అసలు పేరు యేమిటి?"

"అది యెవ్వరికీ తెలియదు. కాని ఒక్క విషయం చెప్పగలను. నీలాగే అతడితో తిరిగిన ఒక యువతి ఏడుస్తూ నా దగ్గరకొచ్చింది. ఆమె నతడు మోసగించాడు. ఆమె తండ్రిని బ్లాక్ మెయిల్ చేస్తున్నాడు!"

ఆమె తృళ్ళిపడింది.

"ఇదంతా మీకెలా తెలుసు?"

"అతడిని వెంటాడుతున్నాను. అతడి గురించి దర్యాప్తు చేస్తున్నాను."

అంతా ఆమెకు అగమ్యగోచరంగా కనిపిస్తోంది. అతడితో ఆమెకు పరిచయమై రెండు రోజులు కూడా దాటలేదు. ఆమెను హోటళ్ళకు తీసుకువెళ్ళాడు. ఇద్దరూ బీచ్‌కి వెళ్ళారు. అతడామెమీద చెయ్యికూడా వెయ్య లేదు! అంత మర్యాదగా ప్రవర్తించిన వ్యక్తి బ్లాక్ మెయిలరా?

"నీ పేరు?"

"గాథ."

"నీ తండ్రి పేరు?"

"నాన్న పేరు గోపిరెడ్డి. ఆయన సినిమా నిర్మాత" అందామె.

"పేరు విన్నాను. ఎన్నో హిట్ పిక్చర్లను ఆయన నిర్మించారు" అన్నాడతను.

బీచ్ రోడ్డు వారగా అతడు కారును ఆపాడు. పక్కకు తిరిగి ఆమె వంక చూశాడు.

"రాధా, నీ మంచి కోరి నిన్ను నేను కారులో ఎక్కమన్నాను. అతడిలో తిరగకు. నిన్ను మోసం చేస్తాడతను."

"మా యింటికొచ్చి నాన్నతో మా పెళ్ళి గురించి మాట్లాడానన్నాడు."

"అలాగే అని నిన్ను నమ్మిస్తాడు. కాని పెళ్ళి విషయంమీద నీ యింటికి రాడు. బ్లాక్ మెయిల్ చేయడానికి నీ తండ్రి దగ్గర కొస్తాడు."

"మీరు చిత్రించినట్లు అతడు నిజంగా దుర్మార్గుడైతే నేనతడిని పోలీసులకు పట్టిస్తాను."

"అలా అన్నందుకు నిన్ను మెచ్చుకుంటున్నాను. ఏం జరుగుతుందో నేను చెప్తాను విను. ప్రేమ నటిస్తూ అతడు నిన్ను తన యింటికి తీసుకు వెళ్తాడు. నీ దుస్తులను తీసేసి నగ్నంగా అతడిపక్క నుండగా నీ ఫోటోలు తీస్తాడు. ఆ ఫోటోలు తీసుకొని, నీ తండ్రికి చూపించి అతడిని బ్లాక్ మెయిల్ చేస్తాడు."

"ఫోటోలు నేను తీయనివ్వను. నగ్నంగా నేనుండను."

"అయితే మనిద్దరం ఒక ఒప్పందం చేసుకుందాం. నువ్వు ధైర్యంగల యువతిలా వున్నావు. మీ యిద్దర్నీ

నేను వెంటాడుతూ వుంటాను. అతడితో తిరిగి ఏం జరుగుతుందో చూడు. నీకేదైనా ప్రమాదం రాబోతే నేను నిన్ను రక్షిస్తాను" అన్నాడతను.

బులెట్ తన కార్డును ఆమెకిచ్చాడు.

"ఈ కార్డును జాగ్రత్తగా వుంచుకో! ఈ కార్డు అతడి కంట బడకూడదు" అన్నాడతను.

"అలాగే" అందామె.

## 9

మోహిని పెళ్ళి వైభవంగా జరిగిపోయింది. భర్త మోహన్‌తో హనీమూన్‌కి కాశ్మీర్ వెళ్ళిపోయింది.

రామోజీరావు ఎదురుగా కూర్చున్నాడు బులెట్.

అంతా బులెట్ వివరంగా చెప్పాడు.

"ఎంతమంది యువతులనో అతడు మోసం చేశాడు, యింకా చేస్తున్నాడు" అన్నాడు బులెట్.

"అటువంటివాడు స్వేచ్ఛగా పట్నంలో తిరుగుతూ వుండడం ప్రమాదకరం. అతడిని జైలుకు పంపాలి!" అన్నాడతను.

"త్వరలో అతడు జైలుకెళ్తాడు" అని బులెట్ లేచాడు.

రామోజీరావుతో కరచాలనం చేసి అతడు బయటకు వెళ్ళిపోయాడు.

చీకటిపడింది. రోడ్డు దీపాలు వెలుగుతున్నాయి. ఆ ఇంటికి కొంచెం దూరంలో అంబాసిడర్ కారుని ఆపుకుని బులెట్ కూర్చున్నాడు. అప్పుడప్పుడు ఆ యింటివైపు నడిచి లోపలకు చూస్తున్నాడు.

అతడితో రాధ లోపలకు వెళ్ళడం అతడు గమ

నించాడు. ఆమెకు యే ప్రమాదమూ రాకుండా తను చూడాలి!

*                                *

విశాలమైన పడగ్గదిలో రెండు ఫ్లోరసెంట్ ట్యూబులు ప్రకాశవంతంగా వెల్గుతున్నాయి.

రాధ పక్కనే అతడు పరుపుమీద కూర్చున్నాడు. ఆమె వంక ప్రేమతో చూశాడు. దగ్గరకు లాక్కుని ఆమెను కౌగలించుకున్నాడు. ఎర్రటి ఆమె పెదిమలమీద బలంగా ముద్దెట్టుకున్నాడు.

ఆమె వెనక్కు జరిగింది.

"ప్రీతమ్, యిదంతా నాకిష్టంలేదు. నువ్వు తొందర పడుతున్నావు" అందామె.

"ఏమైంది రాధా?" అడిగాడతను.

"నాన్నతో మన పెళ్ళి విషయం గురించి నువ్వు మాట్లాడు!"

"మన పెళ్ళి గురించి కోయంబత్తూరులో వున్న నా తలిదండ్రులకు రాశాను. వాళ్ళ జవాబు రాగానే మీ నాన్నగారితో మాట్లాడ్తాను" అన్నాడతను.

"మంచిది" అందామె.

ఆమెవైపు సూటిగా చూశాడతను.

"ప్రేమించుకున్న క్షణంలోనే మన పెళ్ళి దైవ సాక్షిగా అయిపోయింది. జీవితంలో ముఖ్యమైనది ప్రేమ, పెళ్ళికాదు!"

"అయినా సంఘం కోసం మనం పెళ్ళి చేసుకోవాలి" అంది రాధ.

నవ్వుతూ అతడామె చీరను లాగబోయాడు. ఆమె దూరంగా జరిగింది.

"అలా చేస్తే నేను ఇంటికి వెళ్ళిపోతాను" అందామె.

అమాంతంగా అతడికి కోపం వచ్చింది. ఆమెవైపు కోపంగా చూశాడు.

"యూ డర్టీ బిచ్, ఏదో మహా పతివ్రతలా నటిస్తున్నావు! నా భార్య కాబోయే యువతి స్పోర్టివ్ గా వుండాలి" అన్నాడతను.

"వుంటుంది పెళ్ళయినాక!" అందామె.

"వుంటుందని గ్యారంటీ యేమిటి? పెళ్ళయినా నీలా మూతి ముడుచుకొని కూర్చుంటే అప్పుడు ఏం చేయగలను?"

రాధ అతడివైపు సూటిగా చూసింది.

"ప్రీతమ్, నీకేం కావాలి?" అడిగిందామె.

"ఇన్ని రోజులూ మనం దూరం దూరంగా వుంటూ వచ్చాం. ఇవాళ నీకు దగ్గరవాలని నాకు కోరికగా వుంది. నీ నగ్న సౌందర్యాన్ని తనివితీరా చూడాలని వుంది" అన్నాడతను.

"అదంతా పెళ్ళయ్యాక చూద్దువుగాని!" అందామె.

"అలా కండిషన్ పెడ్తే మన పెళ్ళి జరగదు!" అన్నాడతను.

"నీ కోర్కె తీర్చుకునే అవకాశం నీకు వుండదు" అందామె కృపంగా.

"ఈ యింట్లో అడుగు బెట్టిన యువతి నా కోర్కె తీర్చకుండా బయటకు వెళ్ళదు!"

"నన్ను ఆపగల్గితో ఆపు, చూస్తాను" అని ఆమె గుమ్మంవైపు నడిచింది. తలుపు గడియ తీసింది.

తటాలున ఆమెవైపు దూకాడతను ఆమెను బలంగా పట్టుకుని, యీడ్చుకు వెళ్ళి పరుపుమీద పడేశాడు.

ఆమె జాకెట్‌ను చింపేశాడు.

"యూ బ్రూట్!" అర్చిందామె.

ఆమెవంక ఆగ్రహంతో చూశాడతను. ఆమె పమిటను పక్కకు లాగాడు. జాకెట్ పైన బంగారం గొలుసులో అమర్చిన ఒక విజిల్‌ని నోట్లో పెట్టుకొని ఆమె గట్టిగా వూదింది.

విజిల్ శబ్దం గదిలో ధ్వనించింది.

"నువ్వు ఏం చేసినా నిన్ను కాపాడ్డానికి యిక్కడకు యెవ్వరూ రారు" అన్నాడతను.

ఆమె చీరను బలంగా లాగాడతను. ఆమె అతడిని కాలితో తన్నింది. అతడివైపు యాష్ట్రేని విసిరింది.

మరోసారి విజిల్ని వూదింది!

ఆమె మెదడులో ఆలోచనలు వేగంగా తిరుగుతున్నాయి. మిస్టర్ బులెట్ చెప్పినదంతా నిజమే! ప్రీతమ్ ఒక దుర్మార్గుడు!

తలుపును తోసుకొని బులెట్ గదిలోకి జొరబడ్డాడు.

పావడాలో వున్న రాధవైపు చూశాడతను.

అమాంతంగా ప్రీతమ్‌వైపు దూకాడు. ప్రీతమ్ చంప పగిలింది. అతడిని కాలితో తన్నాడు బులెట్.

ప్రీతమ్ కింద పడ్డాడు. అతడి ముక్కువెమ్మట రక్తం కారింది.

"రా! కమాన్!" అన్నాడు బులెట్.

ప్రీతమ్ నేలమీదనుంచి లేవలేదు.

బులెట్ టెలిఫోన్ దగ్గరకు నడిచాడు. రిసీవరెత్తి ఒక నంబరు తిప్పాడు.

"హలో, ఇన్‌స్పెక్టర్ బాండ్" అందో కంఠం అటువైపునుంచి.

"ఇన్‌స్పెక్టర్ బాండ్, బులెట్ హియామ్!"

"చెప్పండి!"

"వెంటనే నంబర్ 13, అహమ్మద్ స్ట్రీట్‌కి రండి. తేనాంపేటలో వుంది."

"వస్తున్నాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

రిసీవర్ పెట్టేసి బాండ్ అతడి ముందుకు వెళ్ళి నిలబడ్డాడు.

"నువ్వు తీసిన ఫోటోలు యెక్కడున్నాయి?" అడిగాడు.

అతడు జవాబు చెప్పలేదు. మెడ పట్టుకొని బులెట్ అతడిని లేవదీశాడు. మళ్ళా చంప పగలగొట్టాడు.

"అక్కడున్నాయి" అన్నాడతను.

"పద, చూపించు" అన్నాడు బులెట్.

ప్రింట్లను, నెగటివ్‌లను బులెట్ జాగ్రత్తగా పరీక్షించాడు.

మోహిని ఫోటోలు యెక్కడా లేవు. మాలతి ఫోటోలను, నెగటివ్‌లను అతడు తన కోటు జేబులో దాచుకున్నాడు.

"రాజా ఎలియాస్, మురళీ, ఎలియాస్, ప్రీతమ్! నీకింకా ఎన్ని పేర్లు వున్నాయి?"

"చాలా వున్నాయి."

"నీ అసలు పేరేమిటి?"

"విన్సెంట్ రావు."

"రామోజీరావు నీకిచ్చిన డబ్బు పాకెట్ యెక్కడుంది?"

అతడు గాడ్‌రెజ్ బీరువాను తెరిచాడు. బ్రౌన్ పేపరుతో కట్టిన పాకెట్‌ను అతడు బులెట్‌కి ఇచ్చాడు.

ఆ పాకెట్ను బులెట్ తన పాంట్ లోపల జేబులో దాచుకున్నాడు.

గాడ్రెజ్ బీరువాలో యెన్నో నోట్లకట్టలు వున్నాయి.

బయట జీప్ ఆగిన చప్పుడయింది. కాన్స్టేబుల్లో ఇన్స్పెక్టర్ బాంగ్ నలుగురు కాన్స్టేబుల్సుతో పడ గదిలోకొచ్చాడు.

బులెట్ అతడితో కరచాలనం చేశాడు.

"ఇన్స్పెక్టర్, ఆమె పేరు రాధ. ప్రముఖ చిత్ర నిర్మాత గోపిరెడ్డిగారి కూతురు. అతడామెను ఒంటరిగా యిక్కడకు తీసుకొచ్చి రేప్ చేయబోతే నేనామెను కాపాడాను" అన్నాడు బులెట్.

"ఈ సమయంలో మీరిక్కడ యెలా వున్నారు?" అడిగాడు ఇన్స్పెక్టర్.

"ఇతడిని గురించి ఎన్నో కంప్లెయింట్స్ నాకొచ్చాయి. అతడిని షాడో చేస్తూ యిక్కడికొచ్చాను" అన్నాడు బులెట్.

విన్సెంట్ రావు గురించి వివరంగా బులెట్ ఇన్స్పెక్టర్కి చెప్పాడు.

"ఫోటోలు, నెగటివ్లు ఆ బీరువాలో వున్నాయి. ఆ గాడ్రెజ్ బీరువాలో యెన్నో నోట్ల కట్టలున్నాయి. నేను వెళ్లాలి. రాధ తన గురించి మీకు చెప్తుంది" అన్నాడు బులెట్.

"ప్లేటులో పెట్టి బ్లాక్ మెయిలర్ని నాకు యిచ్చినందుకు మీకు చాలా థాంక్స్, మిష్టర్ బులెట్" అన్నాడు ఇన్స్పెక్టర్ బాంగ్.

"రాధా, మళ్లీ నిన్ను కల్సుకుంటాను" అని బులెట్

బయటకు నడిచాడు.

* * *

అంబాసిడర్ కారును బులెట్ మాలతి గేటుముందు ఆపాడు. కారును చూసి ఆమె గేటు బయటకు పరుగెత్తుకొచ్చింది.

ఒక కవర్ను అతడామె కిచ్చాడు.

"ఫోటోలూ, నెగెటివ్స్ అన్నీ యీ కవరులో వున్నాయి. నిన్ను మోసగించిన మురళీ పోలీసు లాకప్ లో వున్నాడు" అన్నాడు బులెట్.

"మీకు నా ధన్యవాదాలు" అని ఆమె అతడి బుగ్గమీద ముద్దెట్టుకుంది.

అతడు తన అంబాసిడర్ కారును తిన్నగా యింటికి పోనిచ్చాడు.

ఆఫీసు గదిలోకి వెళ్ళి రామోజీరావుకి ఫోన్ చేశాడు.

"హలో, రామోజీ!"

"బులెట్ రిపోర్టింగ్! ఆ దుర్మార్గుడి పేరు విన్సెంట్ రావు. అతడిని పోలీసులకు అప్పగించాను. మీరు అతడికిచ్చిన డ్రాఫ్టు పేపరు పాకెట్ నా దగ్గర వుంది."

"అది నువ్వు వుంచుకో, మిస్టర్ బులెట్!"

"అక్కడ మీకు సంబంధించిన ఫోటోలు యేమీ లేవు."

"గుడ్ వర్క్. అదే నాకు కావలసింది."

"వుంటాను, సార్" అని బులెట్ రిసీవర్ని పెట్టేశాడు.

—: అయిపోయింది :—

# లవర్స్ సెంట్

## వసుంధర

ఒక్కణ్ణీ యింట్లో వున్నాను. మంచంమీద పడుకుంటే నిద్రపట్టడంలేదు. పుస్తకం చదువుదామంటే ఎక్కడం లేదు. తలనొప్పిగా లేదుకానీ చిరాగ్గా వుంది.

చిరాకు నాకు చాలా కాలంగా వుంటోంది. అందుకు కారణముంది. దేవుడు వరమిచ్చినా పూజారి వరమివ్వని స్థితి నాది.

ఏ ఆలోచనా ముందుకు వెళ్ళని పరిస్థితిలో మా ఇంటి కాలింగ్ బెల్ మ్రోగింది. అప్పుడు నాకు కలిగిన చిరాకు ఇంతా అంతా కాదు.

వచ్చిందింకెవరై వుంటారు—శ్రీమతి తప్ప!

ఈ మధ్య శ్రీమతిని చూస్తూంటే నాకు చాలా చిరాకు కలుగుతున్నది. నేను మామూలు ఉద్యోగిని. నా నెల జీతం వెయ్యి రూపాయలు. నాకు పెళ్ళై రెండేళ్ళయింది. ఇంకో ఏడాదిదాకా పిల్లలు వద్దనుకున్నాం.

నా భార్య పేరు కమల. యెంతో మంచిది. నన్ను

ప్రాణానికి ప్రాణంగా చూసుకుంటుంది. అందువల్ల నే ఏమో ఆర్నెల్లలో నే ఆమె అంటే నాకు మొహం మొత్తింది. నా మనసు పరాయి స్త్రీలమీదకు పోతోంది. పరాయి అంటే ఫలానా అని లేదు. ఎవరో ఒకరు కమల తప్ప!

అందుకు పూర్తిగా కమలనూ తప్పుపట్టలేను. అలాగని నా మనసునూ తప్పుపట్టలేను. కొంతవరకూ నా మిత్రుడు రంగారావు కారణమని చెప్పాలి.

మనిషన్నవాడు అన్నీ అనుభవించాలిట. మగాడికి ఆడది ఓ పెద్ద వరమట. వయసులో వుండగానే వెరైటీ చూడాలట!

"మరి శ్రీమతికి తెలిస్తే?" అన్నాను.

"తెలియనివ్వకూడదు. అదే ఆర్టు. ఇంకా చెప్పాలంటే అదే పెద్ద అడ్వెంచర్—"

"అడ్వెంచర్ సంగతి సరే—పెళ్ళయిన వాడితో కులకడానికి యే పిల్ల ఒప్పుకుంటుంది?" అన్నాను.

"డబ్బు—డబ్బుండాలి. అంతే!" అన్నాడు రంగారావు.

"నాకు డబ్బు లేదుగదా—"

"అదే నా బాధ..అందుకే ఇప్పుడు బార్లకు వెళ్ళడం మానేశాను. సిగరెట్లు మానేశాను. మానేసినట్లు నా భార్యకు తెలియదు. ఖర్చులా మెకు చెబుతూనే వున్నాను. ఆ డబ్బంతా దాస్తున్నాను. ఏడాదిలో వెయ్యి రూపాయలు దాచాను...."

"అయితే రంగంలోకి దిగుతావా?"

"రంగంలోకి దిగడమంటే యేమిటి నీ ఉద్దేశ్యం?"

"ప్రాడ్జికి వెళ్ళడం—"

"ఛా—లాడ్జికి వెళ్ళాలనుకుంటే వెయ్యిరూపాయ లెందుకూ? యెక్కడో వలవేసి ఓ పెళ్ళికాని పిల్లను పట్టి ప్రేమ వ్యవహారం నడపాలి. ప్రేమించి వలికి తేనే బ్యూటీ—తెలిసిందా?" అన్నాడు రంగారావు.

నాకు ముందు అర్థం కాలేదు. రంగారావే వివరించి చెప్పాడు.

"ఇరవై యేళ్లొచ్చినా పెళ్ళికాని ఆడపిల్ల లెందరో వుంటారు. ఏ కట్నం సమస్యవల్లనో వాళ్ళకు పెళ్ళి కాదు. వాళ్ళు మగాడినుంచి రవంత సానుభూతి ఆశి స్తూంటారు. అలాంటి వాళ్ళలో మనకు నచ్చిన ఓ అంద మైన పిల్లను పట్టాలి. స్నేహం పెంచుకోవాలి. తలి దండ్రుల మాట విని కట్నానికి ఆశపడి ఓ పిల్లను పెళ్ళి చేసుకున్నాననీ జీవితంలో సుఖం లేకుండా పోయిందనీ చెప్పాలి.

"ఇలాంటి వ్యవహారంలో కొంత నిజాయితీ కావాలి. ఆ పిల్లను మనం పెళ్ళిచేసుకోమని తెలియాలి. స్నేహం తప్ప మరే భావమూ ఆ పిల్లపట్ల లేనట్లు నటించాలి. పెళ్లైన మగాళ్ళకు నటన పెద్ద కష్టంకాదు. నేనైతే పెళ్ళికాకముందే ఓ పిల్లను బుట్టలో వేసుకున్నాను...." అన్నాడు రంగారావు.

"ఎలా?"

"అప్పుడు నా దగ్గర డబ్బులు దండిగా వుండేవి. ఆ పిల్లకోసం చాలా చాలా కొనేవాణ్ణి. నా దురదృష్టం ఆమెను భార్యగా పొందలేక పోవడమేనని చెప్పేశాను. ఇంటి పరిస్థితులు, డబ్బు అవసరం భయంకరంగా వర్ణించి చెప్పాను. కాబోయే భార్య నాకు యాభై వేలు కట్నం తెస్తోందని అబద్ధం చెప్పాను. ఆమె నమ్మింది. పెళ్ళికి

ముందు యిద్దరం ఎంజాయ్ చేశాం. తర్వాత ఒకరినొకరు మరచిపోయాం —"

"అది సాధ్యమా?" అన్నాను.

రంగారావు అదోలా నవ్వి—"ఈ ప్రపంచంలో ఆడ వాళ్ళంత మంచివాళ్ళూ, అమాయకులూ వుండరు. వాళ్ళు మోసాన్ని సహించలేరు తప్పితే దేనికైనా ఒప్పు కుంటారు. ముందే అన్నీ చెప్పేస్తే యే బాధా వుండదు. ఎటొచ్చీ వాళ్ళు డబ్బుతో ప్రేమను కొలుస్తారు కాబట్టి డబ్బును బాగా వెదజల్లాలి...." అన్నాడు.

వాడి మాటలు నాకు బాగా పట్టాయి. అప్పట్నించీ ఈ విషయమై ఆలోచిస్తున్నాను. కానీ దారి దొరక లేదు. ధైర్యం చాలలేదు. శ్రీమతిమీద విరక్తి మాత్రం ప్రారంభమయింది. అయితే అది బయటకు ప్రదర్శించ కుండా జాగ్రత్తపడేవాణ్ని. ఎందుకంటే రంగారావు చెప్పనే చెప్పాడు—భార్యను మోసం చేయాలనుకున్న వాడు—ఆమెమీద మామూలుగాకంటె కాస్త ఎక్కువగా ప్రేమను చూపించాలి. ఆడవాళ్ళను ప్రేమతో సాధించి నట్లు—విసుగుతో సాధించలేము.

కానీ కొద్ది నెలలుగా నేను కమలమీద విసుక్కుం టున్నాను. కమలకు ఇప్పుడు డబ్బు పిచ్చి యెక్కు వయింది. అలాగని డబ్బు అడగదు. అన్నీ కొనాలం టుంది. ఆమె కోరికలకు అంతుండడంలేదు.

"నా జీతం నెలకు వెయ్యి రూపాయలు మాత్రం!" అని ఆమెకు గుర్తుచేశానోసారి.

"మీరడిగినవన్నీ నేనిస్తున్నాను. నేనడిగినవన్నీ మీరివ్వాలి—" అని నవ్వింది కమల.

నిజానికి ఆమె అడిగినవన్నీ నేను కొనగలను. ఆ డబ్బు

నా దగ్గరుంది. ఆ విషయం కమలకు తెలియదు. తెలియకూడదనే నా ఉద్దేశ్యం. ఆ డబ్బును నేను లైఫ్ ఎంజాయ్ చేయడం కోసం దాస్తున్నాను.

కానీ లైఫ్ ఎలా ఎంజాయ్ చేయాలి?

ఈ విషయం ఆలోచించడంకోసమే ఈ మధ్య నేను ఎక్కువగా యేకాంతాన్ని కోరుతున్నాను — ఇంట్లో కూడా! అందువల్ల బజారుకు శ్రీమతి ఒక్కతే వెళ్ళి వెచ్చాలు, కూరలు తెచ్చుకుంటోంది. సినిమాలకు కూడా ఒక్కతే వెడుతోంది.

"నీ కోరికలు న్యాయమైనవి. అందుకు డబ్బు కావాలి. ఆ డబ్బు సంపాదించే మార్గాలు నేనాలోచిస్తున్నాను. నన్ను డిస్టర్బ్ చేయకుండా ఏకాంతానికి వదిలిపెట్టు. నేనేంచేసినా నీకోసమే!" అన్నాను భార్యతో.

ఈ అందమైన అబద్ధాన్ని శ్రీమతి నమ్మింది. అందుకే నాకు వీలైనంతగా యేకాంతాన్నిచ్చి సహకరిస్తోంది.

ఈ రోజు ఆదివారం. ఆమె నన్ను ఇంట్లో వదిలి మ్యాట్నీకి వెళ్ళింది. టికెట్లు దొరకలేదో, మూడ్ మారిందో యేమో అప్పుడే తిరిగి వచ్చేసింది.

కాలింగ్ బెల్ మరోసారి మ్రోగింది.

నేను పరుగున వెళ్ళి తలుపుతీసి ఉలిక్కిపడ్డాను. ఆశ్చర్యపడ్డాను. నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను.

నా ఎదురుగా ఓ అందాల భరిణ నిలబడి వుంది.

## 2

"నా పేరు కుసుమ!" అన్నదామె.

"ప్లీజ్ — లోపలకు రండి!" అన్నాను తడబడుతూ.

ఆమె లోపలకు వచ్చింది. తలుపులు తీసే వున్నాయి. ఇద్దరం చెరో కుర్చీలో కూర్చున్నాం.

అప్పటికి నా బుర్ర పనిచేయసాగింది.

ఆమె ఎవరు? ఎవరికోసం వచ్చింది? ఆమెను చూడ గానే వివరాలేమీ అడక్కుండా నే నెందుకు లోపలకు రమ్మన్నాను? ఆమె కూడా వివరాలేమీ అడక్కుండా వెంటనే లోపలకు యెందుకు వచ్చింది?

ఇన్ని ఆలోచిస్తున్నా పైకేమీ అనలేదు నేను. అమర్యాద అనుకున్నా సరేనని ఆమె వంకే కళ్ళప్పగించి చూస్తున్నాను.

ఆమె భుజానికి ఓ సంచీ వ్రేలాడుతోంది. అందు లోంచి ఓ చిన్న సీసా తీసిందామె. చూడగానే సెంటు సీసా అని తెలిసిపోతుంది. సీసా తీయగానే గదిలో వాసన పరిమళం గుప్పుమంది. ఆ పరిమళం నాకెంతో నచ్చింది.

"ఇది లవర్స్ సెంట్!" అన్నదామె.

"అంటే?" అన్నాను.

"వివాహం కాక మునుపు ప్రేయసీ ప్రియుల మధ్య ఒక ప్రత్యేకమైన ఆకర్షణ వుంటుంది. అందుకు కారణం తెలుసా మీకు?" అంది కుసుమ.

"నాకు తెలియదు. మీరే చెప్పండి!" అన్నాను.

ఆమె మాటలు యెంతో తియ్యగా వున్నాయి. ఆమె ప్రేమ గురించీ, ప్రేయసీ ప్రియుల గురించీ మాట్లాడడం నా అదృష్టం. ఇదే టాపిక్ మీద ఆమెచేత యింకా మాట్లాడించాలని ఉంది నాకు.

మానవ శరీరమంతా రసాయనాలు అంటే కెమి కల్స్‌తోనే నడుస్తోంది. మెదడులో తయారయ్యే అనేక రసాయనాలే మనలోని కోపం, శాంతం, ప్రేమ— వగైరా భావాలను సృష్టించి అదుపు చేస్తున్నాయి.

నూతన ప్రేమికులు ఒకరికొకరు యెదురైనపుడు మెదడు కొన్ని రసాయనాలను విడుదల చేస్తుంది. వాటి కారణంగా ఆ ప్రేమికుల శరీరాలకు—ఓ వింత పరిమళం యేర్పడుతుంది. తమకు తెలియకుండానే నూతన ప్రేమికులా పరిమళానికి పరస్పరం ఆకర్షించబడతారు-" అంది కుసుమ.

"కొత్త విషయం చెప్పారు. చాలా థాంక్స్!" అన్నాను.

"ప్రేయసీ ప్రియులొకరికొకరు దగ్గరయ్యాక, వారి మధ్య చనువు పెరిగాక మెదడులో రియాక్షన్స్ ఆగిపోతాయి. అంతా యాంత్రికం అయిపోతుంది. కొత్తగా రసాయనాలు విడుదలకావు. పరిమళాలుండవు. అందువల్ల భార్యాభర్తల మధ్య ఆదిలో వున్న ఆకర్షణ వుండదు" అంది కుసుమ.

"కరెక్టుగా చెప్పారు...." అన్నాను.

"ఈ లోపం సవరించడానికీ—ప్రపంచంలో ప్రేమ కలకాలం వర్ధిల్లడానికీ కనిపెట్టబడింది లవర్స్ సెంట్! ఇది రాసుకున్న ప్రేయసీ ప్రియులు యెప్పటికీ కొత్త ప్రేమికుల్లాగే వుండిపోతారు. తొలి ప్రేమ ఊహల్లో మెదడు సృష్టించే రసాయనాలేమిటో పరిశోధించి తెలుసుకొని వాటిని కృత్రిమంగా సృష్టించి తయారు చేయబడిన సెంటు ఇది. సీసా వెల పాతిక రూపాయలు మాత్రమే!"

ఆమె సేల్స్ గర్ల్ అని అర్థమైంది నాకు.

ఈ సెంటు యెవరు తయారుచేస్తున్నారో కానీ వారిని అభినందించాలి. ఈ రోజుల్లో ప్రతి చిన్న విషయానికీ యేదో సైంటిఫిక్ వివరణ యివ్వడం ఫ్యాషనై

పోయింది. ఆమె చెప్పింది నిజమనీ, సెంటు అలాగే పని చేస్తుందనీ అనుకునేందుకు లేదు. కానీ ఈ వివరణ చెప్పి ఈ సెంటు అమ్మడానికి కుసుమవంటి అమ్మాయిని నియోగించిన ఆ కంపెనీని అభినందించాలి. అయితే నేను వెంటనే ఆ సెంటు సీసా కొనదల్చుకోలేదు.

"మీ సెంటువల్ల నాకు ప్రయోజనముండదు—" అన్నాను.

"మా సెంటు గురించి మీకు తెలీదు. ఒకసారి వాడి చూస్తే ఈ మాట అనరు మీరు—" అందామె.

"సెంటు గురించి నాకు తెలీదు. నా భార్య గురించి మీకు తెలీదు!"

కుసుమ వళ్ళంతా కదిలేలా నవ్వింది. అప్పుడామె యెంత బాగుందని? కళ్ళప్పగించి ఆమె వంక చూస్తూండి పోయాను.

"మీరు చాలా సరదాగా మాట్లాడతారు. మీవంటి భర్త వున్న భార్యకు యిలాంటి సెంటు అవసరముండదు. కానీ బంగారానికి నా గోడ చేరువు కావాలంటారు. ప్లీజ్—ఒక సీసా తీసుకోండి—" అన్నదామె.

"ఈ సీసాను తప్పక తీసుకుంటాను. కానీ నా భార్య కోసం కాదు. మీకోసం!" కావాలనే ద్వంద్వార్థం ధ్వనించేలా చేశాను.

"ఏమన్నారూ?" అందామె తడబడుతూ.

"చూడండి—మీకు పెళ్ళయింది కదూ!"

"ఊఁ" అందామె అదోలా.

ఉలిక్కిపడ్డాను. అంతవరకూ ఆమెకు పెళ్ళి కాలేదనుకున్నాను.

"అయాం సారీ!" అన్నాను అప్రయత్నంగా.

"సారీ నాకొద్దు. సీసా కొనండి...." అంది కుసుమ.

"మీ సీసామీద నాకు నమ్మకం కుదర్లేదు—" అన్నాను.

"ఈ రోజు సెంటు వాడండి. గుణం కనిపించకపోతే రేపిదే సమయానికి నేను వస్తాను. మీకు డబ్బు వాపసిచ్చేస్తాను...." అంది కుసుమ.

"ఒకసారి డబ్బు తీసుకున్నాక మీరు మళ్ళీ వాక్కుని పిస్తారా?" అన్నాను.

ఆమె దెబ్బ తిన్నట్లు—"మీరు చాలా అనుమానస్తులా గున్నారు. పోనీ ఈ రోజుకు కొంత అడ్వాన్సివ్వండి. మిగతా సొమ్ము రేపివ్వండి—" అంది.

ఆమెకు పదిరూపాయలిచ్చాను. ఒకవేళ తర్వాత ఆమె రాకపోయినా ఈ సెంటు సీసా ఆమాత్రం విలువ చేస్తుంది.

కుసుమ వెళ్ళిపోతూ వెళ్ళిపోతూ-"వేడినీళ్ళ స్నానం చేయండి. బకెట్లో రెండే రెండు సెంటు చుక్కలు వేసుకోండి. ఆ తర్వాత చూడండి. మీ భార్యనూ అదే విధంగా స్నానం చేయమనండి—" అని చెప్పింది.

# 3

టైము నాలుగయేసరికి నేనిల్లు వదిలిపెట్టాను. కుసుమ యిచ్చిన లవర్స్ సెంట్‌తో స్నానం చేశాను. వళ్ళంతా ఘుమఘుమలాడిపోతూ నామీద నాకే ప్రేమను పుట్టిస్తోంది. నేనెక్కడికి వెళ్ళాలో ముందే నిర్ణయించుకున్నాను.

సూర్యప్రభ మా ఆఫీసులో స్టెనో టైపిస్టు. మనిషి అందంగా ఉండదని అంతా అంటారుకానీ ఆమెను చూస్తే నాకు చచ్చేంత ఆకర్షణ. ఎప్పుడూ ఆధునికమైన

దుస్తులు వేసుకుంటుంది. అధునాతనంగా వుంటుంది. డాషింగ్ గా వుండేవాళ్ళంటే నాకెంత యిష్టమో అంత భయంకూడా!

సూర్యప్రభ యెప్పుడూ మేనేజరు గదిలోనే ఉంటుంది. మేనేజరుతో తప్ప వేరెవ్వరితోనూ మాట్లాడదు. ఆమెకు చాలా గర్వమని అంతా చెప్పుకుంటారు. ఆమెతో కాసేపు కబుర్లు చెప్పాలన్నది నా సరదా. ఈ రోజు లవర్స్ సెంట్ రాసుకున్నాను కాబట్టి ఆమె నాతో మాట్లాడ్డానికి సుముఖంగానే ఉంటుందని భావించాను.

సూర్యప్రభ ఒంటరిగా ఉంటోందనీ ఆదివారాలు ఇల్లు కదలదనీ కూడా నాకు తెలుసు. నేను సూర్యప్రభ యింటికే వెళ్ళాను.

తలుపు సూర్యప్రభ తనే స్వయంగా తీసింది. ఆమెను చూసి ఆశ్చర్యపడ్డాను. మనిషి చాలా సీదాసాదాగా వుంది. ఆఫీసుకు వచ్చే సూర్యప్రభ యిలాగుండదు.

ఆమె కూడా నన్ను చూసి ఆశ్చర్యపడుతూ-"నువ్వా? లోపలకు రా_" అని ఆహ్వానించింది.

లోపల గది చాలా నీటుగా అలంకరించి ఉంది. సూర్యప్రభ అభిరుచి అభినందించతగ్గది. కానీ మేకప్ లేకపోయేసరికి ఆమె రూపం నన్ను నిరుత్సాహపరచింది.

గదిలో ఖరీదైన సోఫాసెట్టుంది. ఇద్దరం ఎదురెదురుగా కూర్చున్నాం. ఆమె నా వంక అదోలా చూస్తూ "ఏమిటి విశేషం?" అంది.

"ఎందుకో యీ రోజు మీ యింటికొచ్చి నిన్ను చూడాలనిపించింది. నీతో మాట్లాడాలనిపించింది_"

అన్నాను. ఈ మాటలనడానికి లవర్స్ సెంటు నాకు తగినంత ధైర్యాన్నిచ్చింది.

"థాంక్స్— నేనూ కంపెనీకోసం చూస్తున్నాను—" అంటూ సూర్యప్రభ లేచి వెళ్ళి వీధి తలుపులు వేసి వచ్చింది.

అప్పుడే లవర్స్ సెంటు పనిచేస్తోందా అన్న అనుమానం నాక్కలిగింది. కానీ నేనప్పుడే బయటపడదల్చుకోలేదు.

సూర్యప్రభ నాకోసం కాఫీ కలిపి తెచ్చింది. నేను తాగాను. అప్పుడామె నా పక్కనే కూర్చుని—"కాఫీ బాగుందా?" అనడిగింది.

"నీకంటే కాదు..." అన్నాను చటుక్కున.

"ప్లీజ్—నన్ను పొగడొద్దు—" అంది సూర్యప్రభ.

"ఎందుకని?"

"నన్ను పొగిడే మగాడిని చంపబుద్ధి వేయదు నాకు."

"అంటే?"

అప్పుడు సూర్యప్రభ లేచి ఓ మూలగా వున్న పొడువాటి పెట్టెను నా ముందుకు లాక్కొని వచ్చింది. పెట్టె మూత తెరిచి అందులోని వీణను తీసి లోపలెక్కడో పెట్టి వచ్చింది.

"చూశావా— పెట్టె ఖాళీచేశాను...." అంది సూర్యప్రభ.

"ఎందుకు?" అన్నాను.

"తర్వాత తెలుస్తుందలే!" అందామె.

నేను మాట్లాడలేదు. ఉన్నట్లుండి నన్ను మత్తు ఆవహించసాగింది. కాళ్ళూ చేతులూ స్వాధీనం తప్పసాగాయి.

"నాకేదో అవుతోంది—" అన్నాను కంగారుగా.

"కంగారుపడకు. కాఫీలో నిద్రమాత్రలు కలిపాను. నిన్ను పెట్టెలో పెట్టి భద్రంగా నీ యింటికి చేరవేసే పూచీ నాది—" అంది సూర్యప్రభ.

ఏమో అందామనుకున్నాను కానీ నిద్ర ముంచుకొచ్చేసింది.

## 4

నాకు మెలకువ వచ్చి కళ్ళు తెరిచేసరికి గదిలో బల్బు వెలుగుతోంది. నేను మంచంమీద పడుకొని వున్నాను. ఏం జరిగిందీ గుర్తుచేసుకుందుకు ప్రయత్నించేలోగా—"మెలకువొచ్చిందా?" అన్న గొంతు వినబడి ఉలిక్కిపడి అటు తిరిగాను.

సూర్యప్రభ!

అది సూర్యప్రభ బెడ్‌రూం. నేను ఆమె బెడ్‌మీద పడుకొని వున్నాను. ఆమె గది గుమ్మం దగ్గరుంది. అయితే ఆమె ఇందాకటిలా లేదు. ఫుల్ మేకప్‌లో నేనాఫీసులో చూసే అందాల దేవతలాగుంది.

అప్పుడు నాకంతా గుర్తుకొచ్చింది.

"నువ్వు నన్ను మా యింటికి పంపలేదా?" అన్నాను.

"పంపాలనే అనుకున్నాను. నిన్ను వీణపెట్టెలోనికి తరలించాలనుకునేసరికి యేమిటో ఉన్నపళంగా నీవంటే యేదో ఆకర్షణ బయల్దేరింది. నీతో మాట్లాడి నీ మనసు తెలుసుకోవాలనిపించింది—" అంది సూర్యప్రభ.

నాకు కలిగిన ఉత్సాహమింతా అంతా కాదు. అంటే లవర్స్ సెంట్ పనిచేసిందనే అనుకోవాలి. ఆ సెంటు కనిపెట్టిన సైంటిస్టుకు శతాధికాభివందనాలు!

నేను లేచి కూర్చుని—"నా మనసు తెలుసుకోవడ

మంటే?" అన్నాను.

"నువ్విక్కడికెందుకొచ్చినట్లు?" అందామె.

"నిన్ను చూడాలని!"

"నన్నెందుకు చూడాలనుకున్నట్లు?"

"ఏమో — చెప్పలేను...."

"నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా?" అందామె.

"ఊఁ."

"కానీ నీకు పెళ్ళయింది కదూ...."

"అవును. అది నా దురదృష్టం...."

"నీ పెళ్ళానికి విడాకులిస్తావా?"

"ఇవ్వలేను. అదీ నా దురదృష్టమే!"

"నీ దురదృష్టాలు నాకు నచ్చలేదు కానీ నీ నిజాయితీ చాలా నచ్చింది—"

ఆమె మెప్పుకోలు వినగానే నాకు రంగారావు గుర్తొచ్చాడు. ఆడది మోసానికి లొంగదు కానీ నిజాయితీకి లొంగుతుంది—అన్నాడతను. అది నిజమవుతోంది.

"స్త్రీతో మాట్లాడాలని చాలా కాలంగా అనుకుంటున్నాను. ఇన్నాళ్ళకు ధైర్యం చేశాను—" అన్నాను.

"ఇప్పటికి నా మంచి పని చేశావు. నాకూ నువ్వంటే యిష్టమే!" అంది సూర్యప్రభ.

నాకు చాలా ఉత్సాహం కలిగింది—"థాంక్స్!" అన్నాను,

"ఆడది మనస్ఫూర్తిగా ప్రేమిస్తుంది. మగాడు స్వార్థంతో ప్రేమిస్తాడు. అవునా?" అంది సూర్యప్రభ.

"నాకు స్వార్థం లేదు...." అన్నాను.

"ఋజువు చేసుకోగలవా—అవకాశమిస్తాను!" అంది సూర్యప్రభ.

ఆ రోజు బీచ్ వద్ద ఓ అమ్మాయిని కలుసుకోవాలి. ఆమె పేరు మాధురి. మనిషి వగలాడి. ఆమెతో రెండు గంటలు గడిపి పవిత్రంగా ఉండాలి. అప్పుడు సూర్య ప్రభ నా ప్రేమను నమ్ముతుంది.

సూర్యప్రభ నా కా అమ్మాయి ఫోటో కూడా యిచ్చింది. ఫోటోలో అమ్మాయి సూర్యప్రభకంటే వెయ్యిరెట్లు బాగుంది. అందువల్ల ఈ పందెంలో ఓడినా గెల్చినా నాకు ఆనందమే!

## 5

సరిగ్గా ఏడుంపావుకి నేను బీచ్ దగ్గరున్నాను. సూర్య ప్రభ చెప్పిన వివరాలన్నీ నోట్ చేసుకున్నాక మాధురిని కనిపెట్టడం నాకు పెద్ద కష్టం కాలేదు.

ఆమె ఒంటరిగా కూర్చుని ఇసుకలో చేత్తో గీతలు గీస్తోంది.

నేనామెను సమీపించి — "హలో — మీ పేరు మాధురి కదూ!" అన్నాను.

ఆమె తెల్లబోయి నా వంక చూసింది. అప్పుడామె అందాన్ని మాటల్లో వర్ణించి చెప్పలేను. ఫోటో ఆమె అందంలో నూరోవంతు కూడా పట్టుకోలేకపోయింది.

"నా పేరు మీకెలా తెలుసు?" అందామె.

"మిమ్మల్ని చూడగానే మీ కా పేరొక్కటే తగునని పించింది...."

"అబద్ధం—ఇంత కచ్చితంగా నా పేరూహించారంటే మీకింకా యేమో తెలిసుండాలి—...." అందామె అనుమానంగా.

"ఇఫ్ యూ డోంట్ మైండ్" అంటూ ఆమె పక్కన కూర్చున్నాను.

ఆమె యిబ్బందిగా ముఖం పెట్టింది.

"ఒక్కణ్నీ బీచ్ కొచ్చాను. యేం తోచడంలేదు. మిమ్మల్ని చూడగానే ప్రాణం లేచివచ్చినట్లనిపించింది. కాసేపు సరదాగా కబుర్లు చెప్పుకొని తర్వాత యెవరికి వారే యమునాతీరే అన్నట్లు విడిపోవచ్చు! మీకిబ్బందని పిస్తే చెప్పండి — యిప్పుడే లేచి వెళ్ళిపోతాను...." అన్నాను.

"నో....నో....ఇట్సాల్ రైట్ —" అందామె మొహమాటంగా.

నేను కబుర్లు ప్రారంభించాను.

ఆమెకూడా సూర్యప్రభకిలాగే ఒంటి పక్షి. ముందు మొహమాటం చూపించినా తర్వాత హుషారుగానూ చలాకీగానూ మాట్లాడింది. ఆమె మాటలు వింటూంటే ఆమెను వగలాడి అనడంలో తప్పులేదనిపించింది. ఆమె అమాయకత్వాన్ని మోతాదుకు మించి నటిస్తోంది.

ఉన్నట్లుండి ఆమె — "మీలో ఏదో ప్రత్యేకత నన్నాకర్షిస్తోంది—" అంది.

'ఓహో — సెంటు పనిచేస్తోందన్న మాట—' అనుకున్నాను. పైకి ఆమెతో — "మిమ్మల్నాకర్షించిన ధన్యమైన ఆ ప్రత్యేకత యేమిటో నాకు తెలుసుకోవాలనుంది...." అన్నాను.

"చెప్పలేను కానీ మనం ఒకరినొకరు మన్నించుకోవద్దు—" అందామె.

"ఎందుకని?"

"ఐ లవ్ యూ...."

ఆమె తీయని పెదవుల మధ్యనుంచి వెలువడిన ఆ అక్షరాల నందుకోవాలని గాలిలోకి చేతులు సాచాను.

ఆమె నన్ను పార్థం చేసుకుని—"ఇది బీచ్!" అంది.

అప్పుడు నేను వెంట నే—"బీచ్ కాకపోతే నీ కభ్యం తరంలేదా?" అన్నాను.

"నా మనసులో పుట్టిన ప్రేమ నన్ను నీ చేతుల్లో చేరమంటోంది—" అంది మాధురి నిస్సంకోచంగా.

"హేట్సాఫ్ టూ యూ లవర్స్ సెంట్!" అను కున్నాను.

ఇది చాలా తమాషాగా ఉంది. ముక్కూ ముఖం యెరుగని ఆడపిల్లలు తక్షీమని నా వశమైపోతున్నారు. లవర్స్ సెంట్ ఈ శతాబ్దానికే ఓ గొప్ప డిస్కవరీ!

"నీకభ్యంతరం లేదంటే నీకు నా ఇల్లు చూపిస్తాను" అంది మాధురి.

"అదృష్టానికెవరైనా అభ్యంతరం చెబుతారా?" అన్నాను.

ఇద్దరం లేచాం. ఆమె స్కూటర్ మీద నా వెనుక కూర్చుంటే అంతవరకూ యెన్నడూ చెందని ఓ కొత్త అనుభూతి నాలో కలిగింది.

ఆమె చెప్పిన ప్రకారం వెళుతూ సరిగ్గా పది నిమిషాల్లో ఆమె ఇల్లు చేరుకున్నాము. అదో చిన్న బంగళా! బంగళా చుట్టూ పూలతోట.

మాధురి తనే యింటి తలుపు తాళంతీసి దీపాలువేసి నన్నో సోఫాలో కూర్చోమని తను నాకెదురుగా కూర్చుంది. పక్కన కూర్చుంటే బాగుండునని ఆశపడ్డాను కానీ అడగలేదు.

ఆమె ఎదురుగా ఉంటే కంటికి విందు. పక్కనుంటే ఒంటికి విందు.

ప్రస్తుతానికి కంటికే విందుగా వుంది.

"కాఫీయా బోర్న్‌విటానా?" అందామె.

"నో డ్రింక్స్ ప్లీజ్!" అన్నాను సూర్యప్రభ ఇంట్లో జరిగిన అనుభవాన్ని పురస్కరించుకుని.

"పోనీ ఏం కావాలో చెప్పు!"

"నాకు నువ్వే కావాలి" అనేసి నా ధైర్యానికి నేనే ఆశ్చర్యపడిపోయాను. లవర్స్ సెంట్ నాలో ధైర్యాన్ని మరీ మరీ పెంచుకుపోతోంది. ఇది దేనికి దారితీస్తుందో!

"అతిథి మర్యాదలో నాకు నేనే సాటి.... అందాకా ఈ పత్రిక చూస్తూండు..." అని ఆమె లోపలకు వెళ్ళింది.

నా దృష్టి పత్రికమీదకు మరలినా ఆలోచనలు మాధురి చుట్టూ మాత్రమే తిరుగుతున్నాయి. మాధురి నిజంగా నాకు అందుతుందా అన్న సంశయం నన్ను పీడిస్తోంది. మాధురి కోసం సూర్యప్రభ చేసిన సవాల్లో ఓడిపోదలిచాను. మాధురి సూర్యప్రభను మించి ఎన్నో రెట్లు అందంగా వుంది.

మాధురి మళ్ళీ అక్కడకు రావడానికి ఓ యిరవై నిమిషాలు పట్టింది. పత్రికలోకే చూస్తున్న నేను— "ఇప్పుడు నేనెలాగున్నానో చెప్పు!" అన్న మాధురి గొంతు విని ఉలిక్కిపడి తలెత్తి చూశాను.

అప్పుడు మాధురి మానవకాంతలా లేదు. దేవకన్యలా వుంది.

లేత గులాబీ రంగు మాక్సీ వేసుకుందామె. అదామె వంటి రంగులో కలిసిపోయినట్లుంది. అదే రంగు బొట్టు పెట్టుకుంది. జుత్తును విరబోసుకొని అలాగే వదిలేసింది. ఆమెను చూడగానే అప్పుడే స్నానం చేసి వచ్చిందని అర్థమవుతుంది.

"నువ్వుకూడా స్నానం చేసిరా-ఫ్రెష్‌గా ఉంటుంది" అందామె.

ఆమె నాకు బాత్రూముకు దారి చూపించింది. అందులో అన్ని ఆధునిక సదుపాయాలూ వున్నాయి. నేను తలుపులు వేసుకోబోతుండగా మాధురి నాకు ఇస్త్రీ చేసిన పూల లుంగీ, అదే రంగు నైటీ అందించింది.

అదృష్టమిక పూర్తిగా నన్ను వరించినట్లే!

హాయిగా వేడినీళ్ళ స్నానం చేశాను. లవండర్ డ్యూ సబ్బుతో వళ్ళు రుద్దుకున్నాను. ఘుమఘుమలాడే టర్కిష్ టవల్‌తో వళ్ళు శుభ్రంగా తుడుచుకుని లుంగీ వేసుకున్నాను. నైటీ తొడుక్కున్నాను.

ఉరకలువేసే ఉత్సాహంతో బాత్రూం తలుపులు తెరిచి స్థాణువైపోయాను.

అక్కడ నాకు ఎదురుగా మా మేనేజరు కనిపించాడు. ముందాయన కళ్ళు కోపంతో ఎర్రగా వున్నాయి. నన్ను గుర్తించగానే ఆ కళ్ళు అదోలా రెపరెపలాడాయి. ఆయన చటుక్కున వెనుతిరిగి వెళ్ళిపోయాడు. ఆ వెళ్ళడం ఏకంగా ఇంట్లోంచే వెళ్ళిపోయాడు.

నాకు మతిపోయినట్లయింది. ఈ యింట్లోకి మా మేనేజరెలాగొచ్చాడు? ఆయనంత కోపంగా యెందుకున్నాడు? ఆయనిక్కడ నన్ను చూడ్డంవల్ల రేపు ఆఫీసులో విశేషమేదైనా జరుగుతుందా?

నేనలాగే నిలబడి వుండగా—"ఈ లుంగీకూడా వేసుకున్నావూ—ఇక నా పని అయిపోయింది—" అన్న మాటలు వినపడ్డాయి.

అది మాధురి గొంతు.

నేనీలోకంలోకి వచ్చి—"ఏం జరిగింది మాధురీ!"

అన్నాను.

"సర్వనాశనం!" అంది మాధురి.

"అంటే?"

"ఆ వచ్చినాయన నిన్నూ నన్నూ చూసి అనుమానించాడు...."

"అనుమానిస్తే?"

"బంగారు పిచ్చుక ఎగిరిపోయింది!" అంది మాధురి దీనంగా.

"నీ మాటలు నాకేమీ అర్థం కావడంలేదు...." అన్నాను.

"మగాళ్ళెందరాడళ్ళతో తిరిగినా తప్పులేదు. ఆడది రెండో మగాడితో మాట్లాడినా వాళ్ళకనుమానమే!" అంది మాధురి యేడుపు గొంతుతో.

అసలు విషయం తెలుసుకోడానికి నాకు కాసేపు పట్టింది.

నా మేనేజరు పేరు విజయ్. అతడికి చెప్పుకోదగ్గ స్త్రీ వ్యసనముంది. తనకు నచ్చిన స్త్రీ కోసం అతడెంతైనా వెచ్చిస్తాడు. అయితే ఆ స్త్రీ పూర్తిగా అతడికే కట్టుబడి ఉండాలి.

"అంటే నువ్వు డబ్బు కోసం ఆయన కమ్ముడుపోయావా?"

మాధురి అదోలా నవ్వి—"అతడికమ్ముడుపోయి డబ్బు సంపాదిస్తాను. తర్వాత ఆ డబ్బుతో ఓ మొగుణ్ణి కొనుక్కుంటాను. తప్పా?" అంది.

"తప్పే మరి...." అని — "నేను నీ అదృష్టంకొద్దీ యిక్కడకొచ్చి విజయ్‌నుంచి నీకు విముక్తి కలిగించాను. ఇంతవరకూ నువ్వు సంపాదించింది చాలు. ఇకమీదట

నీతిగా వుంటు—" అన్నాను.

"అంటే నెలకు పదివేలూ యికనించి నువ్విస్తావా నాకు?" ఆశగా అడిగింది మాధురి.

"నెలకు పదివేలా?" తెల్లబోయాను.

"అవును. నాకింకా పాతికవేలు అప్పుంది. ఆ అప్పు తీరితే ఈ యిల్లు, ఫర్నిచర్ — అన్నీ నా స్వంతమై పోతాయి. ఆపైన ఒకటి రెండు లక్షలైనా రొక్కం పోగుచేయాలి. విజయ్ సావాసంలో ఇంకో మూడేళ్ళలో అన్నీ సాధించగలననుకున్నాను. కానీ నీ మూలంగా అన్నీ పాడైపోయాయి. ఇప్పుడతణ్ణి నా దారికి మళ్ళించాలంటే నేను చేయవలసిన కృషి ఇంతా అంతా కాదు-" అందామె.

ఇది వినగానే ఒక్కసారిగా నేనెంతో పేదవాడినని పించింది. మాధురి నా కారణంగా బాగా నష్టపోయిన మాట నిజం. ఆమె సౌందర్యండంకోసం నేనుకూడా తక్కువ నష్టపోలేదన్న విషయం ఆమెకు చెప్పాలనుకున్నాను.

"మాధురీ! నీ కంటె నేనే నష్టపోయాను...." అన్నాను.

"ఎలా?" అందామె.

"మా ఆఫీసులో నాకు మేనేజర్ విజయ్! నీకూ అతడికీ యిలాంటి సంబంధముందని నాకు తెలియదు. ఆఫీసులో రేపు నాకేం జరుగుతుందో...."

మాధురి కంగారుగా — "అంటే వాళ్ళ కంపెనీలో నువ్వు విజయ్ సబార్డినేటువా?" అంది.

"అవును..."

"చచ్చాను. అయితే నాకిక విజయ్‌ని కలుసుకునే

అవకాశం లేదు..." అంది మాధురి నీరసంగా.

"ఎందుకని?"

"తన సబార్డినేట్స్ంటే విజయ్‌కు బాగా చిన్న చూపు. నీవంటి వారితో తిరిగే ఆడవారిని కన్నెత్తి చూడ్డానిక్కూడా అతిడసహ్యించుకుంటాడు. అందువల్ల విజయ్‌కు సంబంధించినంతవరకూ అన్ని వైపులనుంచీ నాకు ద్వారాలు మూసుకుని పోయాయి...."

ఈ మాటలు నాకు చాలా అవమానంగా తోచాయి. విజయ్‌కి సబార్డినేటు నైనంత మాత్రాన నేను మనిషిని కానా? నన్ను పలకరించిన ఆడవాళ్ళు మైలపడి పోతారా?

పెద్దవాళ్ళంతా చేరి కులతత్వాన్ని ఎద్దేవా చేస్తారు కానీ—కులతత్వం డబ్బులోనూ, అధికారంలోనూ వుంది. ఈ రెండూ వున్నవాళ్ళకు లేనివాళ్ళు అంటరానివాళ్ళు.

"విజయ్‌కు నచ్చజెప్పుకో— నేను వచ్చిన పని వేరని చెప్పు...."

"ఆ అవకాశమూ పోయింది. నువ్వు కట్టుకున్న లుంగీ నేను విజయ్‌కోసమని ప్రత్యేకంగా కొన్నాను. అది తనకోసమే వాడతానని చెప్పాను. నిన్ను విజయ్ ఆ లుంగీలో చూడనే చూశాడు. ఇదంతా చూస్తే ఎవరో తెలివిగా ఆడించిన నాటకంలాగుంది. లేకుంటే ఈ సమయంలో ఫోన్ చేయకుండా విజయ్ రావడమేమిటి?" అంది మాధురి.

"ఇందులో యెవరి నాటకమూ లేదు. నువ్వే నన్ను స్వయంగా నీయింటి కాహ్వానించావు—...." అన్నాను.

"ఆహ్వానిస్తే ఆహ్వానించి వుండొచ్చు. కానీ నువ్వు నేనెవరో తెలియకుండా నా పేరెలా చెప్పగలిగావు?

ఎవరో నిన్ను పంపారు... అవునా?" అంది మాధురి.

"నన్నెవరు పంపుతారు?" అన్నాను తడబడుతూ.

"అవునూ—నువ్వు విజయ్ కంపెనీలో నేకదా పని చేస్తున్నావు. అంటే సూర్యప్రభ నీ కొలీగే అయుండాలి. ఆదే నిన్ను పంపి ఉంటుంది. విజయ్‌ని తనక్కాకుండా చేశానని దానికి నామీద మహామంటగా వుంది. నాకూ విజయ్‌కీ చెడగొట్టడానికి అది వేసిన పథకంలో భాగానివి నువ్వు...." అంది మాధురి కోపంగా.

ఇప్పుడు నాక్కూడా సూర్యప్రభమీద అనుమానం కలిగింది. తప్పకుండా ఇదామె పథకమే! తన అవసరానికి చాలా తెలివిగా ఆమె నన్నుపయోగించుకుంది.

విషయం నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. విజయ్‌కు పెళ్ళైందని నాకు తెలుసు. అతడికిద్దరు కూతుళ్ళు. పెద్ద కూతురి వయసు పన్నెండు. చూడ్డానికి పదహారేళ్ళ పిల్లలా వుంటుంది. రెండో కూతురికి పదేళ్ళు.

అలాంటి విజయ్ తను తప్పుదారిన నడుస్తూ తన ఉంపెడుకత్తె నీతి తప్పకూడదనుకుంటున్నాడు. ఇది డబ్బతడికిచ్చిన అవకాశం!

"మాధురీ! సూర్యప్రభ నాకు కొలీగ్ కావచ్చు. కానీ ఆమె చాలా అహంకారి. మేమిద్దరం యెప్పుడూ మాట్లాడుకోనైనా లేదు. నేను నిన్ను బీచ్ వద్ద పలకరించి పక్కన కూర్చున్నాను. అంతవరకూ నా తప్పు. అటుపైన నీదే తప్పు! నన్నాహ్వానించి నాలో ఆశలు రేపి నన్నిప్పుడు నిందిస్తున్నావు. నువ్వు రమ్మంటేనే కదా నీ యింటికొచ్చాను. నీవిచ్చావనేకదా ఈ బట్టలు కట్టుకున్నాను...." అన్నాను.

"అవును....నీలో నాకలాంటి ఆకర్షణ అగుపడింది.

ఆ ఆకర్షణకులోనై నిన్ను నా ఇంటికి తీసుకుని వచ్చాను" అంటూ మాధురి నన్ను సమీపించింది. బాగా దగ్గరగా వచ్చింది.

ఆమె దుఃఖంలో ఉందని నాకు తెలుసు. ఆమెకు ముఖ్యమయిన ప్రియుడు డబ్బున్న విజయ్ అనీ నాకు తెలుసు. అయినా లవర్స్ సెంట్ ప్రభావంతో ఆ అందాల యువతి ఒక్కసారి నా వశమైతే నేను తప్పక ఆనందిస్తాను. అందుకే ఆమె సామీప్యం నాలో మళ్ళీ ఆశలను చిగురింపజేసింది.

"ఎందుకలా భ్రమపడ్డానో నాకర్థంకావడంలేదు. నాకు నువ్వంటే యేవిధమైన ఆకర్షణా కలగడంలేదు. అంతా నా దురదృష్టం. తక్షణం యిక్కణ్ణించి వెళ్ళిపో!" అంది మాధురి ఉన్నట్లుండి తీవ్రంగా.

నేను తెల్లబోయి—"ఏమంటున్నావ్?" అన్నాను.

"గెటౌట్!" అంది మాధురి.

ఏ బట్టలతో ఆ యింట్లో అడుగుపెట్టానో అదే బట్టలతో మళ్ళీ బయటకు వెళ్ళాను. ఇంక సూర్యప్రభ దగ్గర కూడా వెళ్ళలేదు.

# 6

ఇల్లు చేరేసరికి టైము తొమ్మిదయింది. శ్రీమతి గుమ్మంలోనే ఎదురై—"ఎక్కడకు వెళ్ళారూ?" అంది.

నేను మాట్లాడకుండా బట్టలు మార్చుకున్నాను.

"అదోలాగున్నారేంటండీ...." అంది శ్రీమతి.

నేను బదులివ్వలేదు. భోంచేసి పడుకున్నాను. శ్రీమతి గిన్నెలూ అదీ సర్దుకుని నా పక్కలో చేరి—"ఏమయిందండీ—అదోలాగున్నారు...." అంది.

"ఏమీ లేదు. రొంపపట్టేలాగుంది. అంతే!" అన్నాను.

ఆ తర్వాత శ్రీమతి నన్ను పలకరించలేదు. తను చాలా తొందరగా నిద్రపోతుంది.

నా బుర్రలో మాత్రం రకరకాల ఆలోచనలు తిరుగుతున్నాయి.

లవర్స్ సెంట్ వ్యవహారం విచిత్రంగా వుంది.

సూర్యప్రభ నేను తనింటికి వచ్చానని అసహ్యించుకుంది. నాకు తగిన విధంగా బుద్ధి చెప్పాలనుకుంది. కాఫీలో నిద్రమాత్రలు వేసింది. నన్ను బీరువాలో ఉంచాలనుకుంది. అప్పుడామె నాకు బాగా దగ్గరగా వచ్చింది. లవర్స్ సెంటు పని చేసింది. మనసు మార్చుకుంది. ఆమెకు నేనంటే ఆకర్షణ కలిగింది. తను నాకు వశమై పోవాలనుకుంది. కానీ ఆడబుద్ధి!

నా కారణంగా తను తన కార్యం సాధించాలనుకుంది. అంటే ప్రతిఫలం లేకుండా ఆమె నాకు వశం కాదల్చుకోలేదు.

నన్ను మాధురి వద్దకు పంపించింది. నేను మాధురి యింట్లో ఉండగా విజయ్‌కు కబురందించింది.

అదలాగుంచితే మాధురి కూడా లవర్స్ సెంట్ ప్రభావానికి గురైంది. నన్ను తనింటి కాహ్వానించింది. అయితే నేను స్నానం చేసి వచ్చేక ఆమెకు నాపై ఆకర్షణ పోయింది. అందుకు కారణం విజయ్ వచ్చి వెళ్ళడం కాదు. నేను చేసిన స్నానం—ఆపైన వాడిన లవండర్ ద్వాసబ్బు-నా వంటికున్న లవర్స్ సెంట్ పరిమళాన్ని పోగొట్టాయి. అందుకే మాధురి నన్ను గెటౌట్ అంది.

లవర్స్ సెంట్ పరిమళం నా వంటికి లేదు. కాబట్టే నేనూ సూర్యప్రభ యింటికి వెళ్ళలేను. ఆమె కూడా నన్ను గెటౌట్ అనే ప్రమాదముందని నాకు తెలుసు.

ఇంతకీ నన్ను కొన్ని అనుమానాలు పట్టి పీడిస్తున్నాయి. లవర్స్ సెంట్ కు నిజంగా ప్రేమికుల నాకర్షించే శక్తి ఉందా? సూర్యప్రభ ఆ శక్తికి ఆకర్షించబడిందా? మాధురి కూడా ఆ శక్తికే ఆకర్షించబడిందా?

మాధురి నన్నే ఉద్దేశ్యంతో తనింటికి పిలిచింది. లవర్స్ సెంట్ గురించి ఆమెకు తెలుసా? తనా ప్రభావానికి గురై నాచే ఆకర్షించబడుతున్నానని ఆమె గ్రహించిందా? ఇంటికి వెళ్లాక ఆమె నన్ను స్నానం చేయమంది. లవర్స్ సెంట్ ప్రభావం పోవడానికే ఆమె అలా చెప్పిందా?

ఎక్కడో యేదో తిరకాసుందని నా కనిపించినా ఒక్క విషయం నాకు సంతోషంగా ఉంది. లవర్స్ సెంటు రాసుకుని వెళ్ళి నేను నవ్వులపాలు కాలేదు. మాధురి నన్నవమానించినా అందుకు కారణం లవర్స్ సెంటు కాదు.

రేపు నే నేం చేయాలీ అన్నది కూడా నాకు తోచడం లేదు. ఆఫీసుకు వెడితే విజయ్ ఏమంటాడు?

ఆలోచనల మధ్య యెప్పుడో నాకు నిద్రపట్టింది. అందులో మంచి కల. ఎందరో ఆడపిల్లలు నాకంటికున్న లవర్స్ సెంటు పరిమళానికాకర్షించబడి నా వైపు పరుగున వస్తున్నారు. అప్పుడున్నట్లుండి మురళీనాదం వినిపించింది. ఆడపిల్లలంతా అటు తిరిగారు.

మురళిని వాయిస్తున్నది శ్రీకృష్ణుడు. ఆ శ్రీకృష్ణుడు అచ్చం విజయ్ లాగున్నాడు.

అంతే! మంచి కల కాస్తా పీడకలగా మారిపోయింది.

# 7

ఉదయం లేచి స్నానానికి వెడుతున్నప్పుడు నాకు

లవర్స్ సెంటు గుర్తొచ్చింది. అది భద్రంగా శ్రీమతికి కనబడకుండా అల్మారాలో నా బట్టలకు మూలగా పెట్టి ఉంచాను. శ్రీమతికి కనబడి అది వాడిందంటే తనంటే నాకు ఆకర్షణ పుట్టుకొచ్చేస్తుందేమోనని నాకు భయం. ఎందుకంటే ప్రస్తుతం నాకు మంచి అవకాశాలు దొరికే లాగున్నాయి. భార్యపట్ల ఆకర్షణ పెరిగితే పరాయి ఆడదాని గురించి ఆలోచించడం కూడా కష్టమౌతుంది.

స్నానం చేసేటప్పుడు సెంటు తీసుకొని వెళ్ళలేదు. ఆఫీసుకెళ్ళేటప్పుడు లవర్స్ సెంటు వాడడం ప్రమాదమని నాకనిపించింది.

ఉదయం భోజనానికి కూర్చున్నప్పుడు — "రాత్రి కొంపపట్టేలాగుందన్నారు. ఇంకా పట్టినట్లు లేదే—" అంది శ్రీమతి.

"ఏం బాధగా వుందా?" అన్నాను చిరాగ్గా.

"అదేంటండీ అలాగంటారు?" అంది శ్రీమతి నొచ్చుకుంటున్నట్లు.

"మరేం చేయను? రాత్రి కొంప పడుతుందా అనిపించింది. ఇప్పుడు పట్టలేదేమని నిలదీస్తే నేనేం చేసేది?"

నాకు చిరగ్గా ఉందని కనిపెట్టి శ్రీమతి మరి మాట్లాడలేదు. నేను మామూలుగా ఆఫీసుకు వెళ్ళిపోయాను. మనసులో చిరాకు, భయం ఉన్నప్పుడు నేనాఫీసుకు కొంచెం పెందరాళే వెళ్ళడం మామూలు. ఆ రోజు పావుగంట ముందు వెళ్ళాను. నేను వెళ్ళే వెళ్ళగానే సూర్యప్రభ తప్ప ఇంకెవ్వరూ లేరు. అంత భయంలోనూ అక్కడ మేమిద్దరమే ఒంటరిగా ఉన్నామని గ్రహించేసరికి నా మగబుద్ధి నన్ను లవర్స్ సెంటుతో స్నానం చేసి

రాలేదని తిట్టింది.

అయితేయేం—ఎన్నడూ లేనిది సూర్యప్రభ ఆ రోజు నాతో వచ్చి మాట్లాడింది—"మీ నేజరింకా రాలేదు-" అందామె నాతో.

"ఆయనొచ్చే టైమింకా కాలేదుగా...." అన్నాను.

"వచ్చినా నువ్వు భయపడక్కర్లేదు. ఏ పరిస్థితుల్లో నువ్వు మాధురింట్లో ఉన్నావో నేను విజయ్‌కు చెప్పాను" అంది సూర్యప్రభ.

"అంటే?"

"ఆయన నీ అమాయకత్వాన్నీ, అసహాయతనూ అర్థం చేసుకున్నాడు. మాధురి అసలు రంగూ తెలుసుకున్నాడు. నీకింకేమీ భయంలేదు. ఎటొచ్చీ నువ్వింకెప్పుడూ మా యింటికి రాకు...." అంది సూర్యప్రభ.

"ఎందుకని?"

"విజయ్‌కు నచ్చదు...."

"నచ్చకపోతే?"

"విజయ్ ఎవరినీ రెండుసార్లు క్షమించడు...."

నేను మాట్లాడలేదు. నా వల్ల సూర్యప్రభ చాలా గొప్ప కార్యాన్ని సాధించింది. ఇప్పుడు నన్ను వదుల్చుకోవాలనుకుంటోంది.

"మిస్ సూర్యప్రభా! నా కారణంగా నీకు అధికంగా లాభం వచ్చింది. నాకూ కొంత వాటా యివ్వాలి...." అన్నాను.

సూర్యప్రభ తెల్లబోయి—"వాటా ఏమిటి?" అంది.

"నాకో అయిదువేలియ్యి. లేదా నీ యింటికి వస్తాను. విజయ్ నా అసహాయతనూ, అమాయకత్వాన్నీ మరో సారి అర్థం చేసుకోగలడని నా నమ్మకం—" అన్నాను.

"నువ్వు నన్ను బ్లాక్ మెయిల్ చేస్తున్నావు...." అంది సూర్యప్రభ.

"తెలివి ఒకరి సొత్తు కాదు. నువ్వు నన్నాశపెట్టి మోసం చేశావు ..."

"నేను నిన్నాశపెట్టినమాట నిజం. కానీ నేను నిన్ను మోసం చేయాలనుకోలేదు. అప్పుడెందుకో నిజంగానే నాకు నీమీద మోజు కలిగింది. కారణం చెప్పలేను. ఏదో తాత్కాలికమైన బలహీనత...." అంది సూర్యప్రభ.

అది నాకు తెలుసు. అంతా లవర్స్ సెంటు ప్రభావం. లేకుంటే నాలో ఏం విశేషముందని! కాలేజీలో నన్నెవ్వరూ ప్రేమించలేదు. మా బంధువులమ్మాయి లెందరో ఉన్నారు. ఒక్కరూ నేనంటే మోజుపడలేదు. ప్రేమించి పెళ్ళి చేసుకోవాలని నాకో కోరికుండేది. ధైర్యంచేసి యెవరినైనా ప్రేమిద్దామనుకున్నా నాకు భయం. ఎవరినుంచీ రవంత ప్రోత్సాహం లభించలేదు.

నిన్న ఒక్క రోజులో ఇద్దరాడపిల్లలు నా వెంట బడ్డారు. అది లవర్స్ సెంటు ప్రభావమా? లేక నేను ధైర్యంచేస్తే సులభంగా నాకాడపిల్లలు వశమవుతారా?

"నీ బలహీనత నా బలహీనతను రెచ్చగొట్టింది. నాకు డబ్బో, నువ్వో—యేదో ఒకటి కావాలి...."

"ఒకసారి డబ్బిస్తే మళ్ళీ మళ్ళీ వేధించవని నమ్మకమేమిటి?"

"నేను బ్లాక్ మెయిలర్ని కాదు. నువ్వు చేసిందానికి నీకు గుణపాఠం చెప్పడానికే డబ్బడుగుతున్నాను...."

ఏమనుకుందో—"ఆల్ రైట్—మధ్యాహ్నానికల్లా డబ్బిస్తాను. కానీ మళ్ళీ మళ్ళీ డబ్బడిగావో నువ్వు నాకు చెప్పినకంటే బాగా నేను నీకు గుణపాఠం చెప్పగలను.

నా చేతిలో పలుకుబడిగల మనుషులు చాలామందున్నారు" అంది.

అంత సులభంగా అయిను వేలివ్వడానికామె ఒప్పుకుంటుందని నేననుకోలేదు. ఆ ఆనందంలో—"నువ్వు నాకైదు వేలిచ్చావంటే—నేను మళ్ళీ నిన్ను వేధించడం సంగతటుంచు. నీకు ఋణపడి ఉన్నానని కూడా భావిస్తాను...." అన్నాను.

సూర్యప్రభ యేదో అనబోయింది. ఆఫీసుకు జనం రావడం ప్రారంభమైంది. సూర్యప్రభ వెంటనే—"వస్తాను, థాంక్స్!" అని వెళ్ళిపోయింది.

ఆమెనూ నన్నూ చూసినవాళ్ళు విపరీతంగా ఆశ్చర్యపోయారు. సూర్యప్రభ ఆఫీసులో వాళ్ళందర్నీ పురుగుల్లా చూస్తుంది. ఆ పురుగుల్లోకల్లా హీనాతిహీనమైన పురుగును నేను—ఆడవాళ్ళకు సంబంధించినంతవరకూ! నా స్నేహితులు నన్ను నెమ్మదైనవాడు అంటారు. మిగతా వాళ్ళు డల్లర్డ్ అంటారు.

సూర్యప్రభ నాతో మాట్లాడమే కాకుండా మిగతా వాళ్ళు రాగానే చటుక్కున సంభాషణ త్రుంచేసి వెళ్ళిపోయింది. ఇది అందర్నీ యెక్కువగా ఆకర్షించింది. వీలైనప్పుడల్లా అందరూ ఆ విషయమే మాట్లాడుకున్నారని నాకనిపించింది.

ఒకరిద్దరు నా దగ్గరకు వచ్చి నన్నభినందించారు. ఒక అనూయాసరుడు మాత్రం-"ఏ మాత్రం ఖర్చుపెట్టావేంటి గురూ!" అన్నాడు.

నే నేమీ మాట్లాడలేను.

మధ్యాహ్నం సూర్యప్రభ ఓ పొడవాటి కవరును ప్యూన్ ద్వారానా దగ్గరకు పంపించింది. కవర్లో అయిదు

వేలున్నాయి. వాటితో పాటు ఓ కాగితముంది.

ఇంకా కావాలని ఆశపడ్డావో అన్న వాక్యం పక్కన ఒక పుర్రె రెండు బొమికలు—బొమ్మ వేసి వుంది.

నాకీ అయిదువేలూ చాలు. ఇంక ఆశపడను.

లకర్స్ సెంటు నాకు అమ్మాయిలనే కాదు. డబ్బు కూడా సంపాదించి పెడుతోంది. అలా అనుకోగానే నాలో యింకో ఆశ కూడా బయల్దేరింది. డబ్బున్న అమ్మాయి నన్ను ప్రేమించిందంటే యెంత బాగుంటుంది!

అయిదు వేలంటే నాకు సామాన్యమైన మొత్తం కాదు. ఆ డబ్బును ఒక్క పూటలో నాకిచ్చేసింది సూర్యప్రభ. పడితే అలాంటమ్మాయిని పట్టాలి.

నేను డబ్బును రెండు మూడుసార్లు లెక్కపెట్టు కున్నాను.

ఇప్పుడీ డబ్బునేం చేయాలి?

నా చెవుల్లో శ్రీమతి కోరికలు గింగురుమన్నాయి. కానీ అంతకంటె బిగ్గరగా రంగారావు మాటలు వినపడ సాగాయి. క్రమంగా శ్రీమతి మాటలు ఆగి వాడి మాటలే వినపడసాగాయి.

'ఇప్పుడు బార్లకు వెళ్ళడం మానేశాను. సిగరెట్లు మానేశాను. మానేసినట్లు నా భార్యకు తెలియదు. ఖర్చులా మెకు చెబుతూనే ఉన్నాను. ఆ డబ్బంతా దాస్తున్నాను. ఏడాదిలో వెయ్యిరూపాయలు దాచాను....' అన్నాడు రంగారావు.

నాకంత బాధలేదు. ఏ శ్రమా లేకుండా అయిదు వేలు సంపాదించాను.

ఇంక నేను ఆలోచించలేదు. వెంటనే రంగారావుకు ఫోన్ చేశాను.

# 8

రంగారావు క్షణాలమీద సరాసరి ఆఫీసుకు వచ్చేశాడు. పర్మిషన్ తీసుకుని నేను బైటకు వెళ్ళాను. ఇద్దరం దగ్గరలోని పార్కులోకి వెళ్ళాం.

"ఏమిటి కథ?" అన్నాడు వాడు.

"అనుకోకుండా నా దగ్గర కొంత డబ్బు చేరింది. ఎన్నడూ లేని ధైర్యమూ నన్నావహించింది. ఇదంతా నీ ప్రభావమే ననుకుంటాను...."

రంగారావు ముఖం వెలిగింది—"ఇప్పుడు నన్నెందుకు పిలిచావో చెప్పు...."

"నువ్వు చాలా గొప్పవాడివి. నాకో అమ్మాయికురాలిని వెతికి పెట్టు. అందంగా ఉండాలి. వయసులో ఉండాలి. ఆమెను ఆకర్షించుకోవడం నా వంతు...."

"ఏం—నువ్వు వెతుక్కోలేవా?"

"ఈ ఆధునిక యుగంలో అనుభవముంటే తప్ప మంచికీ చెడ్డకూ తేడా తెలియదు. నాకు అనుభవంలేదు" అన్నాడు.

రంగారావు కాసేపాలోచించి"_అయితే నీకు రాధను సజెస్ట్ చేస్తాను...." అన్నాడు.

"రాధ ఎవరు?" అన్నాను. రంగారావు చెప్పాడు.

రాధ అందమైన మధ్య తరగతి అమ్మాయి. మెట్రిక్‌తో చదువాపేసింది. ఇటీవల ఆమె తల్లికి జబ్బు చేసింది. జబ్బు చేయకముందైతే రంగారావామెను మోసం చేయాలనుకున్నాడు. ఎందుకంటే రాధకప్పటి కున్న సరదాలు చిన్నచిన్నవి. సినిమాలు, హోటళ్ళు, బట్టలు—యివే ఆమె కోరికలు. వీటిని తీర్చడం పెద్ద కష్టం కాదు.

"రాధ శ్రమజీవి. యింట్లో బట్టలు కుడుతుంది. ఎంబ్రాయిడరీ చేస్తుంది. ప్లాస్టిక్ వైర్లతో రకరకాల వస్తువులు చేసి అమ్ముతుంది. ఆమె సంపాదన నెలకె దారు వందలకు తక్కువ కాకుండా వుంది. ఆ డబ్బుతో విలా సాలు కుదరవు కానీ ఆమెకూ, ముసలి తల్లికీ రోజులు వెళ్ళిపోతాయి. రాధకు అందముంది. అభిరుచి ఉంది. తన అందంతో ఓ డబ్బున్న యువకుడిని ఆకర్షించి జీవి తంలో తనకున్న తీరని కోరికలన్నీ తీర్చుకోగలనని ఆమె నమ్ముతోంది. అలాంటమ్మాయిని వల్లో వేసుకోవడం చాలా సులభం" అన్నాడు రంగారావు.

ఇప్పుడు రాధ తల్లికి జబ్బు చేసింది. కనీసం రెండు వేలైనా అర్జంటుగా ఉంటేతప్ప రాధకు తల్లి దక్కదు. రంగారావు దగ్గర అంత డబ్బు లేదు. అదీకాక మొదటి సారే రెండు వేలిచ్చి ఆమె నాదుకంటే అందువల్ల ఆమె ప్రేమ దొరికినా దొరక్కపోయినా—ఏడాదిలో కనీసం ఓ అయిదు వేలైనా ఖర్చుపెట్టాల్సి ఉంటుంది.

"అయిదు వేలా?" అన్నాను. అంత డబ్బు యిప్పుడే నా దగ్గరుంది.

"ఇప్పుడు రెండు వేలిచ్చావంటే ఆమె జీవితాంతం నీకు ఋణపడి వుంటుంది. ఆమెకు తల్లి దక్కుతుంది. తరచుగా నీవామె యింటికి వెడుతూండవచ్చు. ఎటొచ్చీ రొమాన్సులోనికి దిగడానికి మాత్రం ఇది తగిన సమయం కాదు. కొంతకాలం వేచి వుండాలి...."

"అదంతా నే చూసుకుంటాలే! నువ్వు నాకు రాధ అడ్రసివ్వు—" అన్నాను. నా వద్ద లవర్స్ సెంటుంది. దాని ప్రభావంతో ఎలాగూ రాధను వశం చేసుకోగలను.

రంగారావు నాకామె అడ్రసిచ్చి—"నీ జీవితంలో

ఆరోగ్యకరమైన మార్పు వస్తోంది. అందుకే నాకు సంతోషంగా ఉంది—" అన్నాడు.

పేకాట, గుర్రప్పందాలు, తాగుడు—యిలాంటివి వ్యసనాలని సమాజం చెబుతోంది. కానీ ఈ వ్యసనాలున్న వారందరూ అందర్నీ తమవైపు ఆకర్షించాలనీ, తమలో కలుపుకోవాలనీ ప్రయత్నిస్తారు. తమ ప్రయత్నాలు ఫలిస్తే ఆనందిస్తారు. అదే వ్యసనపరుల గొప్పతనం. తమ సుఖాన్ని పదిమందికీ తెలియజెప్పి—అది పదిమందీ అనుభవించేలా చేస్తారు.

అదే మంచివాడైతే అలా కాదు. తన బ్రతుకేదో తను బ్రతుకుతాడు. అడిగిన వాళ్ళకు సాయం చేస్తాడు తప్పితే తన చుట్టూ ఉన్న వారిలో మంచితనాన్ని నింపడానికి ప్రయత్నించడు. ప్రయత్నించినా—ఆ ప్రయత్నం సఫలమయ్యేటంత ఆకర్షణ అతడిలో ఉండదు.

అందుకే ఒక్క వ్యసనపరుడు వందమంది వ్యసనపరుల్ని తయారుచేస్తూంటే పదిమంది మంచివాళ్ళు కలిసి కూడా ఒక్క మంచి వాణ్ణి తయారు చెయ్యలేకపోతున్నారు.

ఈ సమాజం వ్యసనాలకూ, మంచితనానికీ నిర్వచనాలైనా మార్చాలి. మంచితనపు ఆకర్షణనైనా పెంచాలి.

అందాకా నేను రంగారావు దారిలోనే వెడతాను.

# 9

ఆఫీసు వదిలిపెడుతూనే తిన్నగా రాధ యింటికి వెళ్ళాను.

అదో చిన్న పెంకుటిల్లు. ఇంటికి కాలింగ్ బెల్ కూడా లేదు. నేను తలుపు తట్టగానే ఓ యువతి తలుపుతీసింది.

పువ్వుల చీర కట్టుకున్న ఆ యువతి తనే ఓ పువ్వులా ఉంది. ఆమెను చూడగానే అనిపిస్తుంది—అందం ఈ ప్రపంచంలో ఆడదాని సొత్తు మాత్రమేనని.

ఆమె ప్రశ్నార్థకంగా నా వంక చూసింది.

"మీ పేరు రాధ కదూ!" అన్నాను.

ఆమె తలూపింది.

"నన్ను రంగారావు పంపాడు...."

"రంగారావుగారా?" అందామె.

ఆమె అలా అనగానే నాలో రెండు రకాల భావాలు కలిగాయి. రంగారావుని పెళ్ళాం కూడా ఏమండీ అని మన్నించదు. వాణ్ణికూడా రంగారావుగారని మన్నించే వాళ్ళున్నారా అన్న ఆశ్చర్యమొకటైతే—రంగారావుకూ రాధకూ మధ్య పరిచయం మన్నింపు వదిలిపెట్టే స్థాయి చేరుకోలేదన్న ఆనందం రెండవది.

"లోపలకు రావచ్చా?" అన్నాను.

ఆమె తడబడుతూ—"రండి—లోపలకు...." అంది.

లోపలకు వెళ్ళాను. ముందు గదిలోనే ఓ పట్టు మిషనుంది. దానికి ముందో స్టూలుంది. ఆ స్టూలుకి కాస్త దూరంగా ఓ స్టీలు చెయిర్ ఉంది. ఆమె నాకు కుర్చీ చూపించి తను స్టూలుమీద కూర్చుంది.

"నేను మీకు సాయపడాలని వచ్చాను—" అన్నాను.

ఆమె అర్థంకానట్లు చూసింది.

"మీకు నేనెలా సాయపడగలనో మీరే చెప్పాలి!"

క్షణమాలోచించి—"మా అమ్మ హాస్పిటల్లో ఉంది" అంది రాధ.

"ఊఁ" అన్నాను.

"నేను ఊఁ అంటే ఆపరేషన్ జరుగుతుంది. ఆమెను

ప్రైవేట్ నర్సింగ్ హోంకు మార్చాలి. అక్కడ వారం పదిరోజులుండాలి. మొత్తం రెండువేలవుతుంది...."

"ఊఁ" అన్నాను.

"పదిరోజుల్లోగా ఆపరేషన్ జరక్కపోతే అమ్మ నాకు దక్కకపోవచ్చు—" అంది రాధ.

"అయితే పదిరోజు లెందుకు — రేపే వెళ్ళి ఊఁ అనండి...."

"అలాగే అంటాను. కానీ డబ్బెవరిస్తారు — మీ రిస్తారా?"

"ఊఁ."

రాధ తెల్లబోయి — "మొత్తం రెండువేలూ మీ రిస్తారా?" అంది.

"అవును—కానీ మీ తల్లి ప్రేమను పరీక్షించి...."

"అంటే?"

"తల్లి ప్రాణాలు రక్షించుకోవడం కోసం అశాశ్వత మైన శరీరానికూడా విలువనివ్వకూడదు మీరు...."

"అంటే?"

"రేపు మధ్యాహ్నానికి నేను డబ్బు తీసుకొని వస్తాను. అందాకా అయిదువందలు అడ్వాన్సుగా యిస్తాను...." అంటూ జేబులోంచి అయిదు వందరూపాయల నోట్లుతీసి ఆమె కందించాను. వణుకుతున్న చేతులతో వాటినందు కుందామె.

"మీకు చాలా చాలా థాంక్స్!" అందామె.

"థాంక్స్ చెప్పే పద్ధతి యిది కాదు. నేను రేపు మధ్యాహ్నం పదిహేనొందలూ తీసుకొని వస్తాను. నేను కోరిన విధంగా థాంక్స్ చెప్పాలి—" అన్నాను.

ఆమె భయంగా నా వంక చూసింది.

"నన్ను రంగారావు పంపాడు. నేను మీకు సాయ పడాలని వచ్చాను...." అన్నాను సర్మగర్భంగా.

అప్పుడు రాధ మిషను కున్న సొరుగును లాగింది. అందు లోంచి ఓ తాళంచెవి నాకిచ్చి—"హాస్పిటల్లో డాక్టరుది రేపు మధ్యాహ్నం డ్యూటీ. ఆయనే టైముకొస్తాడో సరిగ్గా చెప్పలేను. నేను అమ్మకన్ని యేర్పాట్లూ చేసి వస్తాను. రావడ ఆలస్యమైతే మీరు ఇంట్లోనే ఉండ డానికి వీలుగా డూప్లికేట్ కీ యిస్తున్నాను. నేను పదకొండింటికి యిల్లు వదులుతాను. రెండింటికల్లా వచ్చే స్తాను. ఎట్టి పరిస్థితుల్లోనూ మూడు దాటదు...." అని చెప్పింది.

అప్రయత్నంగా—"థాంక్స్!" అన్నాను.

# 10

ఆ రోజు ఆఫీసుకు బయల్దేరేముందు లవర్స్ సెంటు జేబులో ఉంచుకున్నాను. ఆఫీసుకు తీసుకెళ్ళే బ్రీఫ్ కేసులో నైట్ డ్రస్ ఉంచాను. ఈ రెండు విషయాలూ కమలకు తెలియవు.

నా మనసు ఊహాల్లో తేలిపోతోంది. రాధ చాలా సులభంగా ఒప్పుకున్నందుకు నాకెంతో ఆనందంగా ఉంది. అయినా నేను చేస్తున్న త్యాగం మాత్రం గొప్పదా? సరైన సమయంలో రెండు వేలిచ్చి నిండు ప్రాణాలను నిలబెడుతున్నాను.

ఈ ప్రపంచంలో యేదైనా ప్రాణాలు నిలబెట్టుకున్న తర్వాత నేనని విశ్వామిత్రుడంతటి ఋషే చెప్పాడు. పోయే ప్రాణాలు నిలబెట్టుకోవడంకోసం ఆయన కుక్క మాంసం తిని అది తప్పు కాదనీ, శాస్త్ర సమ్మతమనీ అన్నాడు.

రాధ ఒప్పుకుంటే నేను చేయబోతున్నదీ తప్పుకాదు. రాధ ఒప్పుకుందంటే ఆమెదీ తప్పుకాదు. ఈ ప్రపంచంలో ప్రాణాలు తీయడం తప్పు. పోతున్న ప్రాణాలను నిలబెట్టక పోవడం తప్పు. అందుకోసం ఏం చేసినా తప్పు కాదు.

కథ ఇంతవరకూ వచ్చేక నాలో తప్పొప్పుల సంఘర్షణ బయల్దేరింది. కమల కన్యాయం చేస్తున్నానన్న భీతి కలుగుతోంది. అయినా ముందడుగు వేస్తూనే ఉన్నాను.

వెళ్ళడం ఆఫీసుకు వెళ్ళాను. సరిగ్గా పన్నెండు గంటలకు నాకు కడుపునొప్పి వచ్చింది. ఆఫీసు నుంచి తిన్నగా రాధ ఇంటికి వెళ్లాను. ఇల్లు తాళంపెట్టి ఉంది. తాళం తీసుకుని లోపలకు వెళ్ళాను. రాధ యింటిముందు స్కూటరెక్కువసేపుంచే ప్రమాదముంటుందని అసలింటి దగ్గర బయల్దేరినప్పుడే స్కూటర్ తీయలేదు.

లోపలకు వెళ్ళి మంచంమీద పడుకున్నాను. అది కావడానికి పట్టెమంచమేకానీ నులకమంచంలాగుంది. దుప్పటీ యెత్తిచూస్తే అడుగున కనీసం బొంతైనాలేదు. పట్టెడకు సవాలక్ష ముళ్ళున్నాయి.

సుకుమారి రాధ ఆ మంచంమీద పడుకుందంటే నాకు బాధ కలిగింది. ఇప్పుడు నేను రాధ బాధల గురించి ఆలోచిస్తున్నాను. ఆమె కష్టాల్లో పాలెలా పంచుకోవాలా, ఆమె కష్టాలనెలా తొలగించాలా అని బాధ పడుతున్నాను.

అలాగే టైము ఒంటిగంటయింది. ఇంకా యెక్కడా రాధ జాడలేదు.

అప్పుడు నాకు గుర్తుకొచ్చింది.

రాధ వచ్చేసరికి లవర్స్ సెంటుతో స్నానమైపోవాలి.

అందు గురించి ఇల్లంతా కలియ తిరిగాను.

బాత్రూం ఒకటి ఉంది. అందులో నీళ్ళకుండీ ఉంది. కుండీ నిండా నీళ్ళున్నాయి. పక్కనే రెండు బకెట్లు న్నాయి. ఆశ్చర్యమేమిటంటే అంత పేదింట్లోనూ ఓ ఇమ్మర్షన్ హీటరుంది. బహుశా రాధ తల్లి వేణ్ణీళ్ళ స్నానంకానీ చేయలేదేమో మరి!

నేను వేణ్ణీళ్ళు కాచుకుని లవర్స్ సెంటుతో స్నానం చేసి నైట్ డ్రస్‌లోకి మారాను. అప్పుడు నాకు బాగా ఫ్రెష్‌గా అనిపించింది.

ఇప్పుడు రాధ ఇంటికి వస్తే నా మనసులోని మాట చెప్పకుండానే అర్థమవుతుంది ఆమెకు.

వెళ్ళి మంచంమీద కూర్చున్నాను. టైము గడవడం లేదు. ఎట్టి పరిస్థితుల్లోనూ మూడు దాటదంది. అంటే ఆమె మూడుదాకా రాదేమో!

నాకు బెంగ పట్టుకుంది. కానీ టైము సరిగ్గా అయిదు నిమిషాల తక్కువ రెండయ్యేసరికి ఎవరో యింటి తలుపు తట్టారు. తప్పకుండా రాధే అయుండాలనుకున్నాను. ఇప్పుడు నన్ను రాధ యిలా చూస్తే.... ఏమనుకుంటుంది? ఎంత థ్రిల్లింగ్ ఉంటుంది?

నేనాలోచిస్తూండగా మరోసారి తలుపు తట్టిన చప్పుడయింది. ఉత్సాహంగా వెళ్ళి తలుపు తీశాను.

ఎదురుగా ఓ యువతి....

ఆమెను పరీక్షగా చూసి ప్రమాన్పడిపోయాను. నన్ను చూసి ఆమె ప్రమాన్పడిపోయింది.

"నువ్వా?" అన్నాను.

"మీరా?" అందామె. ఆమె నా భార్య కమల!

నేను వెనకడుగు వేశాను. ఆమె లోపలకు వచ్చింది.

"మీరిక్కడ.... ఈ నైట్ డ్రస్సులో....” అని—
"ఆఫీసుకు వెళ్ళలేదా?” అంది కమల.

ఏ అబద్ధం చెబితే అతుకుతుందో తెలియక—“నువ్వి క్కడికెందుకొచ్చావు?” అని యెదురు ప్రశ్న వేశా నామెను.

మామూలు మనుషులం కావడానికిద్దరికీ కాసేపట్టింది.

అప్పుడామె భుజాన వ్రేలాడుతున్న సంచిని గమ నించాను.

"అదేమిటి?” అన్నాను.

చెప్పడానికామె తటపటాయించింది.

నేను చనువుగా ఆ సంచీలో చేయిపెట్టాను. లోప లేవో బాటిల్సున్నాయి. ఓ బాటిల్ బైటకు తీశాను.

చిన్న సెంటుసీసా.

"అరే—లవర్స్ సెంట్!” అన్నాను ఆశ్చర్యంగా.

"అరే—లవర్స్ సెంట్ మీకెలా తెలుసు?” అంది శ్రీమతి ఆశ్చర్యంగా.

"నువ్వు లవర్స్ సెంట్ అమ్ముతున్నావా?” అన్నాను.

"ఇది మీకెవరైనా అమ్మారా?” అంది శ్రీమతి.

ఇద్దరం ఒకరి ప్రశ్నలొకరు పట్టించుకోవడంలేదు. క్రమంగా నాకంటే శ్రీమతి బలం పెరిగింది. నేనక్క డెందుకున్నానని ఆమె నిలదీస్తోంది. రాధ వచ్చేలోగా యేదో చెప్పాలని నాలో తాపత్రయం బయల్దేరింది. ఆఖరికబద్ధం చెప్పేశాను.

"మా ఆఫీసులో ఒకతను రాధకు సాయపడతానని నాకు రెండువేలిచ్చి పంపారు. ఆ డబ్బామె కివ్వాల నిక్కడకు వచ్చాను.” ఆమెకు రాధ పరిస్థితి చెప్పాను.

"మరి నైట్ డ్రస్సేమిటి?”

"రాధకెవరో వచ్చి డబ్బిస్తే అనుమానం వస్తుంది కదా! అందుకని నేనామె బంధువులా ఇంటికి వచ్చి ఇక్కడ స్నానం చేసి ఇంట్లో మనిషిలా మసలాలని నా మిత్రుడు కోరాడు...."

"మీరు చెప్పేది అర్థం పర్థం లేకుండా వుంది...."

అప్పుడు నా బుర్రలో యేదో మెరిసింది—"ఇంకా అర్థం పర్థంలేని విశేషమింకొకటుంది...." అన్నాడు.

"చెప్పండి!" అంది కమల.

"ఈ అర్థం పర్థలేని పనికి ఒప్పుకున్నందుకు నా మిత్రుడు నాకో రెండు వేలిచ్చాడు...." అన్నాను.

"నిజమా?" అంది కమల.

"ఆ రాధకు డబ్బివ్వగానే నేను నీ దగ్గరకే వచ్చి వాలుదామనుకుంటున్నాను. యెందుకంటే నీకో నగ కొనాలిగా!" అన్నాను.

"నాకు నగెందుకూ?" అంది కమల.

"నాకు డబ్బెందుకూ__నీకు నగ కొనడానికి కాక పోతే!"

"అయితే తారాచంద్ దుకాణానికి వెడదామండీ— అక్కడ ముత్యాల లోలకులు బాగుంటాయి. వాటిమీద నాకెంత కాలంగానో మనసు...."

సరిగ్గా మూడింటికి రాధ వచ్చింది. ఆమెకు పదిహేను వందలూ ఇచ్చి శ్రీమతిని పరిచయం చేశాను.

రాధ ఆశ్చర్యపోయి-"మీవంటి ఉదాత్త పురుషులను నేనెక్కడా చూడలేను. నిన్న అయిదువందలూ యిచ్చి నపుడు కూడా మీ ప్రవర్తన యెంతో ఉదాత్తంగా ఉంది. మీ సహాయం నేను తప్పక గుర్తుంచుకుంటాను" అంది.

నేను కావాలనే శ్రీమతిని తీసుకుని అక్కడకు వచ్చానని ఆమె భావించినట్లుంది. అలాంటి యువతి నైట్ డ్రస్సులో ఒంటరిగా నన్ను చూస్తే యేమనుకుని ఉండేది? ఇప్పుడు రాధ కళ్ళలో కనబడుతున్న కృతజ్ఞత వెలుగులు నేనెంత నీచత్వానికి సిద్ధపడ్డానో చెబుతున్నాయి.

ఏమైతే నేం ఆమెవద్ద సెలవు తీసుకొని నేను, కమల తారాచంద్ దుకాణానికి వెళ్లాం. దుకాణదారామెను చూస్తూనే-"మీరు చెప్పిన ఉంగరం తయారైందమ్మా-" అన్నాడు. అది విని నేనాశ్చర్యపడ్డాను.

సుమారు అరకాసు బరువున్న ఉంగరానికి ఒకపక్క నలు చదరపు పలకపై "ఓం" అని చెక్కి వుంది. ఇలాంటి ఉంగరం చేయించుకోవాలని నేను చాలా కాలంగా మనసు పడుతున్నాను.

దుకాణదారు శ్రీమతికి అందిస్తే శ్రీమతి నా వ్రేలికి తొడిగిందా ఉంగరం. సరిగ్గా సరిపోయింది.

"ఇదేమిటి కమలా?" అన్నాను.

"నేను మిమ్మల్ని తారాచంద్ దుకాణానికి రమ్మన డానికి కారణమిదే!" అంది కమల.

అప్పుడు నేనామెకు మనస్ఫూర్తిగా రెండువేలు పెట్టి ముత్యాల లోలకులు కొన్నాను.

# 11

శ్రీమతి లవర్స్ సెంటుకు సేల్సు ఉమన్ గా ఉంటూ ప్రతి నెలా కొంత డబ్బు సంపాదిస్తోంది. ఆమె ఈ ఉద్యోగం ప్రారంభించి అప్పుడే మూడు నెలలు దాటింది. ఎవరికీ చెప్పనని ఒట్టేయించుకొని శ్రీమతి లవర్స్ సెంటు గురించిన పరమ రహస్యం నాకు చెప్పింది.

లవర్స్ సెంటు మనుషులమధ్య ప్రేమను పుట్టిస్తుందన్న నమ్మకం ప్రజల్లో బాగా కలిగించడానికి ఓ సంస్థ ప్రయత్నిస్తోంది. అందుకని యెందరినో ముఖ్యంగా ఆడవారిని లవర్స్ సెంటు సభ్యులుగా చేర్చుకుంటోంది. సభ్యులందరికీ నెలకింత అని పారితోషికం ముడుతుంది. సభ్యులు చేయవలసిందల్లా లవర్స్ సెంటు వాసన సోకినప్పుడు తామాకర్షించబడినట్లు నటించాలి. ఆ తర్వాత యేదో ట్రిక్కు చేసి తప్పించుకోవాలి—ఆకర్షణ మరింత దూరం వెళ్ళకూడదనుకుంటే! ఈ లవర్స్ సెంటు సభ్యుల్లో యెక్కువమంది కాల్‌గర్ల్స్. లవర్స్ సెంటు ఫలానా వారిమీద పనిచేయలేదని ఫిర్యాదు వస్తే వారిపై సంస్థ తీవ్రమైన చర్య తీసుకుంటుంది. ఇప్పటికే లవర్స్ సెంట్‌కు కొంత ప్రచారం లభించింది. కోరిక ఉండీ ధైర్యంలేని వాళ్ళకు ధైర్యాన్నివ్వడంతో దీనివల్ల కాల్‌గర్ల్స్‌కి వ్యాపారాభివృద్ధి జరుగుతోంది.

లవర్స్ సెంటు అమ్మేవారికి సీసాకు అయిదు రూపాయలిస్తారు. ఆ సీసా ఖరీదు ఒక రూపాయైనా ఉంటుందో ఉండదో కానీ అప్పుడే దాని గురించి ప్రజల్లో కొంత సంచలనం ప్రారంభమైంది. కొంతకాలంలో ఈ సెంటును దుకాణాల్లో కూడా ప్రవేశపెట్టాలనుకుంటున్నారు. శ్రీమతి మూడు నెలల్లో మూడువందలకుపైగా సీసాలమ్మింది.

ఒకసారి సంచలనం కలిగి మార్కెట్లోకి వచ్చేక— సెంటు అదే నిలబడగలదని లవర్స్ సెంట్ సంస్థ నమ్మకం.

లవర్స్ సెంట్ అమ్మడానికి కమలవస్తే నన్నక్కడ

కలుసుకుంది.

"ఇంతకీ ఈ సెంటుకి ప్రభావముంటుందా?" అన్నాను యేమీ ఎరగనట్లు. సూర్యప్రభ, మాధురి లవర్స్ సెంటు పట్ట్యరాండ్రైౖ ఉంటారనీ—మాధురి నన్ను తప్పించు కుందుకే స్నానం చేయమన్నదనీ నాకర్థమైంది.

"ఉంటుందనుకోను. ఈ సెంటు గురించి తెలియగానే నేనే ముందు వాడి చూశాను...." అంది కమల.

"ఎవరిమీద?" అన్నాను కంగారుగా.

"మీరుండగా ఆకర్షించబడ్డానికి నేనింక వేరెవరిని వెతుక్కుంటానో చెప్పండి...." అంది కమల.

ఎప్పుడో కొద్ది నెలల క్రితం ఆమె యేదో సెంటు రాసుకున్న గుర్తుంది కానీ నేనప్పుడు పట్టించుకోలేదు. ఇప్పుడామె మాటలు నాకు చురుక్కుమని తగిలాయి. ఆమె లవర్స్ సెంటును నామీద ప్రయోగిస్తే—నా మనసు మాత్రం వేరే తప్పుదార్లు తొక్కింది.

తను కష్టపడి సంపాదిస్తూ ఆ డబ్బును నా సరదా కోసం వెచ్చించాలనుకున్న శ్రీమతి ప్రేమ పరిమళాన్ని మించిన ఆకర్షణ యే లవర్స్ సెంటివ్వగలదు?

ఈ సత్యం గ్రహించేక నా మనసెన్నడూ శ్రీమతిని దాటిపోలేదు. రంగారావు మాత్రం నా మనసులోంచి యెప్పుడో జారిపోయాడు.

—:అయిపోయింది:—

# మిస్ జూలీ కథ

మిస్ కె. మధుబాల

"మరో గ్లాసు పట్రావే!" అన్నాడు రిటైర్డ్ తాశీల్దార్ రంగారావు.

"ఎందుకండీ? గ్లాసులు కడగలేక చస్తున్నాను. ఎంత వెతికినా పనిమనిషి దొరకడంలేదు" అంది అతడి భార్య సావిత్రి.

"నా గ్లాసులు నేనే కడుక్కుంటాలే" అన్నాడతను విసుగ్గా.

ఆమె లోపలకు వెళ్ళి మరో గ్లాసు తెచ్చి అతడి కిచ్చింది. గ్లాసులోని వేడి కాఫీని మరో గ్లాసులోకి పోసి అతడు చల్లార్చుకున్నాడు. కాఫీని సేవిస్తూ సిగరెట్ వెలిగించాడు.

ఎదురుగా సోఫాలో కూర్చుని సావిత్రి కాఫీ తాగుతోంది.

రంగారావు రిటైరయి సంవత్సరం దాటింది. ఒక కొడుకు అమెరికాలో వున్నాడు, మరో కొడుకు

దుబాయిలో ఉద్యోగం చేస్తున్నాడు. ఇద్దరు కూతుళ్ళకూ పెళ్ళిళ్ళు అయిపోయాయి. ఇటుపైన ఆ దంపతులకు యే బాధ్యతలూ లేవు.

స్వంత ఇంట్లో సుఖంగా జీవిస్తున్నారు. ప్రతి నెలా పెన్షన్ వస్తుంది. బాంక్ డిపాజిట్లనుంచి వడ్డీవస్తుంది. దేనికీ లోటు లేకుండా వాళ్ళ జీవితాలు సాగిపోతున్నాయి.

"అమ్మా!" ఎవరో పిల్చారు.

"ఎవరది?" అడిగింది సావిత్రి.

"ఎవరో పిలుస్తున్నారు. బయటకు వెళ్ళి చూడు!" అన్నాడు రంగారావు.

ఆమె బయటకు వెళ్ళింది. ఒక స్త్రీ బయట నిలబడి ఉంది. ఆమె వంక సావిత్రి సూటిగా చూసింది.

"ఎవరు నువ్వు? నీకేం కావాలి?" అడిగింది సావిత్రి.

"నేను పల్లెటూరునుంచి వచ్చానమ్మా. మీ రేదేనా పనిస్తే చేసుకుంటూ బతుకుతాను" అందా స్త్రీ.

"నీ పేరు?"

"మల్లిక."

"ఏ వూరు మీది?"

"మండపేటమ్మా."

"ఈ పట్నానికెందు కొచ్చావు?"

"పల్లెటూర్లో బతకలేకమ్మా."

"మా ఇంట్లో పనిమనిషిగా ఉంటావా?"

"ఉంటానమ్మా."

"ఎంత జీతం కావాలి?"

"మీరే చెప్పండమ్మా."

"నెలకు 30 ఇస్తాను. నేను చెప్పిన పనులన్నీ

చెయ్యాలి."

"చేస్తానమ్మా."

సావిత్రి సంతోషించింది. ఇంత కాలానికి తనకొక పనిమనిషి దొరికింది!

"ఈ పట్నంలో నీకెవ్వరూ లేరా?"

"లేరమ్మా."

"అయితే నువ్వు యెక్కడుంటావు?"

"మీరు పనిస్తే ఇక్కడే వుండి వరండాలో పడుకుంటానమ్మా."

"వుండు, మా వారితో మాట్లాడి వస్తాను" అని సావిత్రి లోపలకు వెళ్ళింది.

రంగారావు ఆమెవైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"పనికోసం ఒక ఆడది వచ్చింది" అందామె.

"వెతుకుతున్న తీగ కాలికి తగిలిందన్నమాట!" అన్నాడతను.

"పల్లెటూరిది. మంచిదానిలా వుంది. ముప్ఫయి ఇస్తానంటే ఒప్పుకుంది."

"వెంటనే ఆమెను పనిలో చేరమను. నువ్వు ఆలస్యం చేస్తే యెవరో ఆమెను యెత్తుకుపోతారు" అన్నాడు రంగారావు.

ఆమె బయటకు వెళ్ళింది.

"మల్లికా, నువ్వు వెనక్కు రా!"

"అలాగేనమ్మా."

సావిత్రి లోపలనుంచి వెనకవైపుగా వెళ్ళింది. మల్లిక అక్కడ సిద్ధంగా ఉంది.

"మొదట్లో ఈ కాఫీ తాగు. తర్వాత పని ప్రారంభించొచ్చు" అంది సావిత్రి.

ఆమె ఇచ్చిన గ్లాసును అందుకొని మల్లిక వేడి కాఫీని తాగేసింది.

## 2

మల్లిక పనిలో చేరి వారం రోజులైంది. సావిత్రి చెప్పిన పనులన్నీ ఆమె సవ్యంగా చేసుకుపోతోంది. ఒళ్ళు వంచి పనిచేసే మనిషి దొరికినందుకు సావిత్రి యెంతో సంతోషించింది.

రాత్రి తొమ్మిది దాటింది.

"అమ్మా, నేను ముందు వరండామీద పడుకుంటాను. తలుపులు వేసుకోండి" అంది మల్లిక.

"వేసుకుంటానులే" అంది సావిత్రి.

సోఫాలో కూర్చుని పత్రిక చదువుతున్న భర్తవైపు చూసింది.

"దాని వయస్సు యే యిరవై నాలుగో వుంటుందండి. దాన్ని లోపల పడుకోమంటే!"

"ఎక్కడ?"

"ఈ హాల్లో."

"తొందరపడకే! అది కొత్త ముఖం.... అది ఎక్కడ నుంచి యిలా వచ్చిందో మనకు తెలియదు" అన్నాడు భర్త.

"మండపేట నుంచి వచ్చానని చెప్పిందిగా?"

"అది చెప్పినదంతా మనం నమ్మకూడదు. మరి కొంత కాలం చూశాక, ఆమె మీద మనకు పూర్తిగా నమ్మకం యేర్పడ్డాక లోపల ఆమెను మనం పడుకోమనొచ్చు" అన్నాడు రంగారావు.

"అలాగేలెండి" అని ఆమె వెళ్ళి ముందు తలుపులు మూసింది.

మర్నాడు పొద్దుట రంగారావు నిద్ర లేచి ఒళ్ళు విరుచుకుని కిందకు దిగాడు. ఏదో ఆలోచన తట్టి పర్సు లోంచి పదిరూపాల నోటు తీసి టేబుల్ కింద పడేశాడు. మల్లిక యెటువంటిదో ఆ నోటు కాస్సేపట్లో నిరూపిస్తుంది!

అతడు పళ్ళు తోముకొని, ముఖం కడుక్కొని హాల్లో కెళ్ళి సోఫాలో కూర్చున్నాడు. నవ్వుతూ వచ్చి సావిత్రి అతడికి కాఫీ యిచ్చింది.

దిన పత్రికను అతడిముందు పెట్టింది.

"నువ్వు యెప్పుడు లేచేవే?"

"ఐదింటికి మెలుకువొచ్చేసింది. మళ్లా నిద్రపట్టలేదు. సముద్రపు హోరులా వుంది మీ గురక!" అందామె.

"నన్నూ లేపేస్తే గురక మాయమయ్యేదిగా!" అన్నాడతను.

"అంత పెందరాళే లేచి యేం చేస్తారు మీరు?"

"ఏమీ చెయ్యకపోయినా నువ్వు చేసేది చూసేవాడినిగా!"

"రేపు లేపుతాలెండి" అని ఆమె వెళ్ళిపోయింది.

అతడు కాఫీ తాగి పేపరు చదువుతూ కూర్చున్నాడు. మునుపు సిగరెట్ పొగ పీల్చి వదుల్తూ కాఫీ తాగేవాడు. కాని డాక్టర్ సిగరెట్ ముట్టుకోవద్దన్నాడు. మంచి పిల్లాడిలా రంగారావు సిగరెట్‌ను వదిలేశాడు. వయస్సు వచ్చినకొద్దీ అలవాట్లు మార్తూ వుంటాయి. మునుపు అతను ఆల్కహాల్‌కి దూరంగా వుండేవాడు. రిటైరయ్యాక, సిగరెట్లు మానేసి విస్కీ, బ్రాందీలు సేవించడం మొదలెట్టాడు. దుబాయినుంచి వచ్చిన రెండో కొడుకు స్కాచ్ విస్కీ బాటిల్సు పట్టుకొచ్చాడు. తండ్రిని కొంచెం తాగి

చూడమన్నాడు. ఆ విధంగా డ్రింకింగ్ అలవాటైంది.

మల్లిక తుడవడానికి పడగ్గదిలోకి వెళ్ళింది. పేపరు చదవడం మాని అతడు ఆ గది గుమ్మంవైపే చూస్తున్నాడు. వంటింటి గుమ్మంలోంచి సావిత్రి పడగ్గదివైపే చూస్తోంది.

కాసేపట్లో పనిముగించి బయటకొచ్చింది. హాలును తుడిచి వెనక్కు వెళ్ళిపోయింది.

"సావిత్రీ!" పిల్చాడతను.

భార్య అతడి దగ్గరకొచ్చింది.

"ఈ ముండని మనం నమ్మకూడదు. టేబుల్ కింద యేదేనా దొరికితే, మంచిమనిషయితే మనకిస్తుంది. గది తుడిచి అది వెళ్ళిపోయింది!" అన్నాడతను.

"అదే నేనూ ఆలోచిస్తున్నాను. నా మట్టెలు రెండూ మంచంకింద పడేశాను. వెళ్ళిచూస్తే అవి లేవు. ఆ దొంగముండ యెక్కడో దాచుకొని వుంటుంది!" అందామె.

అతడు గంభీరంగా నవ్వాడు.

"నువ్వు అక్కడ పడేసేవని నాకేం తెలుసు? నీ మట్టెలను నేను తీసి డ్రాయరులో దాచాను" అన్నాడతను.

"మీతో చెప్పకుండా అలా చేయడం నా తప్పు!" అందామె.

"అయినా నా పదిరూపాయిల నోటు అది యివ్వలేదే!" అన్నాడతను.

"అది మీరు పడేశారా? ఆ నోటును నేను తీసి దాచాను" అంది సావిత్రి నవ్వుతూ.

"మన పరీక్ష ఫెయిలయింది. రేపు యిదే మళ్ళా

చేద్దాం. చూద్దాం మల్లిక ఏం చేస్తుందో" అన్నాడు రంగారావు

మర్నాడు మల్లిక హాల్లో కూర్చున్న వాళ్ళ దగ్గరకు నవ్వుతూ వచ్చింది.

"అమ్మగారూ, మీ మట్టెలు మంచంకింద పడు న్నాయి" అని వాటిని యిచ్చేసింది.

"వీటికోసం నిన్నటినుంచి వెతుకుతున్నాయి. లక్కీ. దొరికాయి" అంది సావిత్రి.

రంగారావు పనిమనిషి వంక చూస్తున్నాడు. ఆమె హాలును తుడుస్తోంది. భార్యాభర్తలిద్దరూ పడగ్గదిలోకి వెళ్లారు.

"నీ మట్టెలిచ్చింది. నా పదిరూపాయిల నోటు కొట్టే సింది" అన్నాడతను తగ్గు స్వరంతో.

సావిత్రి టేబుల్ వైపు నడిచింది.

టేబుల్ కింద, జోళ్ళ వెనక పదిరూపాయిల నోటు అలాగే ఉంది!

"పాపం, అది మంచిదేనండి" అంది సావిత్రి.

"దాన్ని మనం నమ్మొచ్చు" అన్నాడు రంగారావు.

ఆనాటి రాత్రి మల్లిక చాప పట్టుకొని బయటకు వెళ్ళ బోతుంటే సావిత్రి పిల్చింది.

"ఈ హాల్లో పడుకో! ఒంటరిగా బయట యెందుకు పడుకోడం?" అంది సావిత్రి.

"నా మొగుడు నన్ను వదిలి వెళ్ళిపోయినప్పటినుంచీ నేను ఒంటరిదాన్నేనమ్మా" అంది మల్లిక.

"నీ మొగుడు నిన్ను వదిలేశాడా?"

"అవునమ్మా. చిన్నప్పుడే పెళ్ళయిపోయింది. ఆరేళ్లు నాతో ఉన్నాడు. నాకు పిల్లలు పుట్టలేదు. నన్ను

వదిలేసి మస్కట్ పోయాడు. అక్కడ బాగా డబ్బు గడించి మరో పిల్లను పెళ్ళాడి అక్కడే ఉంటున్నాడని విన్నాను."

"దుర్మార్గుడు!" అంది సావిత్రి.

"పోనీయండమ్మా! ఎక్కడో అతడు సుఖంగావుంటే అదే నాకు చాలు. అతడు వెళ్ళిపోయాక నేను మళ్ళా కళ్ళెత్తి మరో మొగాడివంక చూడలేదు" అంది మల్లిక.

"సావిత్రీ" పడగ్గదిలోంచి రంగారావు పిల్చాడు.

"ఇక్కడే పడుకో! తలుపులు మూసి గడియలు బిగించు" అని సావిత్రి వెళ్ళిపోయింది.

# 3

సావిత్రి తలంటు పోసుకుంటోంది. స్నానాల గదిలో దగ్గరుండి మల్లిక ఆమెకు సహాయపడ్తోంది.

వీపు రుద్దుతూ, "మీది బంగారంలాంటి ఒళ్ళమ్మా. చిన్నప్పుడు యెంత అందంగా వుండేవారో!" అంది మల్లిక.

ఆ మాటలు విని సావిత్రి సంతోషించింది.

"మాది పెద్ద కుటుంబం. నా తలిదండ్రులకు నలుగురు కొడుకులు, ముగ్గురు కూతుళ్ళు. నే ఆడపిల్లల్లో పెద్దదాన్ని. ఎస్సెల్సీదాకా చదివాను. నన్ను చూడ్డానికొచ్చిన మొదటి వ్యక్తి నా భర్త అయిపోయారు. పిల్ల నాకునచ్చింది, ముహూర్తం పెట్టించండి అన్నారాయన. అదంతా నాకు బాగా జ్ఞాపకం. పెళ్ళి అయ్యేసరికి నా వయసు పదిహేళ్ళు. నా పెళ్ళి ఫోటో నీకు చూపిస్తాను" అందామె.

వళ్ళు బాగా రుద్ది ఆమె సావిత్రికి నీళ్ళు పోసింది. ఆమె వయసు యాభై దాటింది. భర్త ఆమెకంటె

ఎనిమిదేళ్ళు పెద్ద.

"మీరు వెళ్ళండమ్మా! నేను ఈ గది శుభ్రపరిచి వస్తాను" అంది మల్లిక.

సావిత్రి తన పడగ్గదిలోకి నడిచింది. రంగారావు బాంకికి వెళ్లాడు, పెన్షన్ డబ్బు తీసుకోడానికి.

కాస్సేపట్లో మల్లిక గదిలో కొచ్చింది. చక్కటి పట్టుచీరను సావిత్రి కట్టుకుంది. మేకప్ చేసుకుంది. గాడ్‌రెజ్ బీరువా తెర్చి నగలు మెళ్ళో వేసుకుంది. ఎడంచేతికి పెద్దకొడుకిచ్చిన అమెరికన్ వాచ్‌ను పెట్టుకుంది.

"చాలా అందంగా ఉన్నారమ్మా. మీలాటివారి ఇంట్లో పని దొరకడం నా అదృష్టం" అంది మల్లిక.

సంతోషంగా సావిత్రి తన పెళ్ళి ఫోటోను మల్లికకు చూపించింది. ముచ్చటగా ఫోటోను చూసింది మల్లిక.

పాతకాలపు ఫోటో. అక్కడక్కడ ఫోటోను పురుగులు తినేశాయి. పెళ్ళికూతురు కట్టుకున్న పట్టుచీర ముడతలు స్పష్టంగా వున్నాయి. రంగారావు సూటులో ఉన్నాడు. ఇద్దరూ యవ్వనంలో వున్నారు.

"ఈ ఫోటోలో వున్నట్లు మీరిప్పుడూ అందంగానే వున్నారమ్మా" అంది మల్లిక.

బీరువా అద్దం ముందు నిలబడి సావిత్రి తన రూపాన్ని ఓసారి చూసుకుంది.

"యాభై ఏళ్ళు దాటినా ముప్ఫయిఐదేళ్ళదానిలా వున్నారు మీరు" అంది మల్లిక.

ఆనందంగా ఆమె మల్లికవైపు చూసింది.

"ఈ పగడాల గొలుసు నువ్వేసుకో!" అంది సావిత్రి.

"బంగారం గొలుసు నా కొద్దమ్మా" అంది మల్లిక.

"ఈ గొలుసులో యెక్కువగా బంగారం లేదులే. నా దగ్గర యెన్నో నగలున్నాయి. నేనీ గొలుసు వేసుకోడంలేదు."

"తీసుకోమన్నారు. ఆ మాట చాలమ్మా నాకు. నా భర్తతో వున్నప్పుడు నా మెళ్ళో గొలుసు వుండేది. చేతులకు గాజులుండేవి. అవన్నీ నా మొగుడు లాక్కుని. అమ్మేసి తాగేశాడు. పరాయివాడు ఒల్చుకుపోయేవేవీ ఒంటిమీద వుండకూడదని నేననుకున్నాను. అప్పటినుంచీ ఇలాగే వుంటున్నాను" అంది మల్లిక.

సావిత్రి ఆమెవైపు జాలిగా చూసింది.

"మల్లికా, నీ వయస్సెంత?"

"నే పుట్టిన గుడిసెలో కాలెండర్ ఎక్కడుందమ్మా డేటు చూడ్డానికి?"

"నీ వయసు యిరవై నాలుగు దాటి వుండదు. మంచి యవ్వనంలో వున్నావు. ఈ పట్నంలో నువ్వు ఎక్కువ కాలం ఒంటరిగా వుండలేవు. నీ అందచందాలు చూసి యెవరో నీ వెనక బడ్తారు" అంది సావిత్రి.

"అటువంటి వాళ్ళ బారినుంచి తప్పించుకోవాలని నేనిక్కడికొచ్చానమ్మా. నా మొగుడిని చూశాక మరో మొగాడి వంక చూడాలనే కోరిక నాలో లేకుండా పోయింది'' అంది మల్లిక.

అప్పుడే రంగారావు వచ్చాడు. మల్లిక బయటకు పరుగెత్తింది.

## 4

చక్రాల బండిలో రోడ్డు వారగా కూరలు అమ్ముతున్న గోపీ ఆమె వంక నవ్వుతూ చూశాడు.

"నీది కొత్త మొహం!" అన్నాడతను.

"నాకు నీదీ కొత్త మొహమే" అంది మల్లిక.

"పట్నానికి కొత్తగా వచ్చావా?"

ఆమె తలాడించింది.

"వంకాయలు కిలో ఎంత?"

"నీతో బేరమాడ్డం నాకిష్టంలేదు. అందరూ రెండు రూపాయిల చొప్పున ఇస్తున్నారు. అదెక్కువనుకుంటే తగ్గించి యియ్యి" అన్నాడతను.

క్షణకాలం మల్లిక అతడివైపు నవ్వుతూ చూసింది. అతడి వయస్సు ఇరవై అయిదు దాటింది. తెల్లటి పంచె, చొక్కా ధరించాడు. కళ్ళు మెరుస్తున్నాయి. ఏదో ఆకర్షణ ఆమెను అతడివైపు లాక్కుపోతోంది.

"నీ పేరు?" అడిగిందామె సిగ్గుతో.

"గోపీ. నీ పేరుకూడా చెప్పాలి!"

"మల్లిక. అదిగో ఆ ఇంట్లో పని చేస్తున్నాను. రాత్రీ పగలూ అక్కడే వుంటాను" అందామె.

కొంచెం దూరంలో వున్న ఆ ఇంటివైపు అతడు సూటిగా చూశాడు.

"కూరలు కొనడానికి నువ్వొచ్చావేం? ఆ ఇంటి అమ్మగారు బావున్నారా?"

"గుండులా వున్నారు. ఇటుపైన కూరలూ అవీ నేనే కొంటూ వుంటాను."

మల్లిక మూడు రకాల కూరల్ని కొంది. అతనికి డబ్బిచ్చింది. తన చేతిలో వున్న చాక్లెట్ను గోపీ చేతిలో పెట్టింది.

"నీ కొడుక్కి!" అందామె నవ్వుతూ.

అతడు తియ్యగా నవ్వాడు.

"నాకింకా పెళ్ళే కాలేదు."

"అయితే నువ్వే తిను" అని మల్లిక వెనక్కి తిరిగి వడివడిగా వెళ్ళిపోయింది.

ఆనాటి సాయంత్రం గేటు ముందు నిలబడి మల్లిక రోడ్డువైపు చూస్తోంది. చక్రాల బండి తోసుకుంటూ గోపీ ఆమె దగ్గరకు వచ్చాడు.

"ఎవరికోసం యెదురు చూస్తున్నావు?" అడిగాడు నవ్వుతూ.

"నీకోసం కాదులే!" అందామె కొంటెగా.

"అబద్ధం చెప్తున్నావు!" అని గోపీ ఆమె బుగ్గమీద వేలితో మెల్లిగా తట్టాడు.

"నాతో పరాచికాలాడకు!"

"ఆడితో యేమవుతుంది?"

"పళ్ళూడుతాయి."

"ఊడితే ఫరవాలేదులే. నీ పేరు చెప్పి మళ్ళా కట్టించుకుంటాను."

మల్లిక కళ్ళు చిట్లిస్తూ అతడివైపు తీక్షణంగా చూస్తూ ఉండిపోయింది.

"మల్లీ నీతో మాట్లాడాలి!"

"ఇప్పుడదేగా చేస్తున్నదీ?"

"ఈ రోడ్డుమీద కాదు. మనిద్దరం ఓ చోట యెదురెదురుగా కూర్చుని మాట్లాడాలి."

ఆమె కొంటెగా నవ్వింది. బండివైపు చూసింది. కూరగాయలు లేవు.

"అంతా అమ్మేశావా?"

"నా బండిలో యెప్పుడూ కూరలు మిగలవు. ఎవరో వచ్చి కొని పట్టుకుపోతారు."

"అదృష్టవంతుడివి."

"అలా నువ్వన్నందుకు సంతోషిస్తున్నాను. ఎప్పుడు కలుసుకుందాం?"

"రాత్రి పదింటికిరా. అప్పటికి అయ్యగారూ, అమ్మగారూ నిద్రపోతూ వుంటారు. చడీ చప్పుడూ చెయ్యకుండా రావాలి. నీకోసం ముందు వరండామీద నిలబడి వుంటాను. అక్కడ కూర్చుని మనం మాట్లాడుకోవచ్చు" అందామె.

గోపీ ఆమె కళ్ళల్లోకి ఆత్రంగా చూశాడు.

"మల్లీ, నువ్వు చాలా అందంగా వున్నావు!"

"అదంతా అప్పుడు చెప్పు."

"వెళ్ళిపోనా?"

ఇంట్లోంచి సావిత్రి, "మల్లికా?" అని గట్టిగా పిల్చింది.

"వస్తున్నానమ్మా" అని మల్లి అతడివైపు నవ్వుతూ చూసింది.

గబగబా ఇంటివైపు నడిచింది మల్లిక.

గోపీ ఆమెకేసి ఓరగా చూస్తూ చక్రాల బండిని ముందుకు పోనిచ్చాడు.

సావిత్రి ముందుకు వెళ్ళింది ఆమె మెల్లిగా.

"మల్లికా, యిప్పుడు నేనూ ఆయనా సినిమాకి వెళుతున్నాం. మేం తిరిగొచ్చేసరికి తొమ్మిది దాటుతుంది. ఇల్లు జాగ్రత్తగా చూసుకో."

"ఇంటికి తాళంవేసి వెళ్ళండమ్మా. మీరొచ్చిందాకా నేను ముందు వరండామీద కూర్చుని వుంటాను" అంది మల్లిక.

ఇంటికి తాళంవేసి వాళ్ళు వెళ్ళిపోయారు. మల్లిక గేటువైపు నడిచింది. రోడ్డు పొడుగునా చూసింది.

కొంచెం దూరంలో గోపీ రూపం కనిపించింది. ఆమె వేగంగా అటువైపు పరుగెత్తింది.

కాస్సేపట్లో అతడి పక్కకు చేరుకుంది. బండినాపి అతడామె వంక చూశాడు.

"పడింటికి రావద్దా?" అడిగాడతను.

"వద్దు" అందామె.

"నీ మనసెందుకలా మారింది?"

"అమ్మగారూ, అయ్యగారూ సినిమాకి వెళ్లారు. వాళ్ళు తిరిగొచ్చేసరికి తొమ్మిది దాటుతుంది. ఇప్పుడే పోదాం పద!" అందామె.

అతడు సంతోషంగా బండిని వెనక్కి తిప్పాడు. ఇద్దరూ మెల్లిగా ఆ ఇంటి ముందుకు చేరుకున్నారు. బండిని అతడు కాంపౌండులోకి తీసుకెళ్లాడు.

గేటు మూసి నవ్వుతూ ఆమె అతడి దగ్గరకు నడిచింది. అతడామె చెయ్యిని పట్టుకున్నాడు.

"తొందరపడకు! ఇరుగు పొరుగువాళ్ళు చూస్తే బాగోదు. చీకటి పడనీ!" అందామె.

సమీపంలో వున్న మందార చెట్టుకింద యిద్దరూ కూర్చున్నారు. అతడామె వేళ్ళను నిమిరాడు.

చీకటి పడింది. మెల్లిగా అతడామెవైపు జరిగాడు.

"మల్లీ, చూడగానే నువ్వు నాకు బాగా నచ్చావు!" అన్నాడతను.

"అలా యెందరికో నీకు నచ్చుండాలి!" అందామె.

"ఏ ఆడదానితోటీ నాకు సంబంధంలేదు. మొదటిసారిగా నీకు దగ్గరవుతున్నాను."

ఆమె పకపక నవ్వింది.

"నీ మాటలు నేను నమ్మను!"

"తర్వాత నువ్వే ఒప్పుకుంటావు" అన్నాడతను.

అతడి ఒళ్ళో తలెట్టుకుని మల్లిక వెల్లకిలా పడుకుంది. చేతుల్తో ఆమెను ఎత్తి పెదిమలను అతడు బలంగా ముద్దెట్టుకున్నాడు.

చీకట్లో ఇద్దరూ పక్కపక్కనే పడుకున్నారు. ఆమె అతడిమీద చెయ్యి వేసింది.

"నీ ఇల్లెక్కడ?"

"నాకు ఇల్లు లేదు. పార్కులోని సోఫాలో నిద్ర పోతూ వుంటాను."

"నీ కెవ్వరూ లేరా?"

"లేరు" అన్నాడతను.

"ఇంతకాలం ఎలా పెరిగావు?"

"రోడ్లమీద తిరుగుతూ పెరిగాను."

"నీకు గోపీ అన్న పేరు ఎవరు పెట్టారు?"

"గోపీ సినిమా చూసి ఆ పేరు నేనే పెట్టుకున్నాను."

ఆమె బలంగా అతడిని కౌగలించుకుని, పెదిమలను ముద్దెట్టుకుంది.

"నువ్వే నా ముద్దుల గోపీవి" అందామె.

## 5

అర్థరాత్రి!

మెల్లిగా ఆమె ముందు తలుపు తెర్చింది. హాల్లోని లైట్ వెల్గుతోంది. ఇద్దరు మనుషులు లోపలకు వచ్చారు. ఒకతను పొడుగ్గా, బలంగా వున్నాడు. అతడి చేతిలో కత్తి వుంది. రెండోవాడు పొట్టిగా, లావుగా వున్నాడు. అతడి చేతిలో పిస్టల్ వుంది.

"డేవిడ్!" అందామె.

అతడామె వంక చూశాడు.

"ఇద్దరూ నా వెనకనే రండి. నేను పిలిస్తే ఆమె తలుపు తెరుస్తుంది. అటుపైన మీరు ఆ గదిలోకి జొరబడండి" అందామె.

"అలాగే, మిస్ జూలీ" అన్నాడు పొడుగాటి మనిషి డేవిడ్.

"అహమ్మద్, చప్పుడు చేయకుండా నడువు" అందామె పొట్టివాడితో.

పడగజ తలుపును ఆమె తట్టింది.

"ఎవరు?" అడిగింది సావిత్రి.

"మల్లికనమ్మా. మీ చుట్టాలెవరో వచ్చారు" అంది మల్లిక వురఫ్ జూలీ.

సావిత్రి భర్తను లేపింది. అతడు లేచి ఆమెవైపు చూశాడు.

"ఎవరో చుట్టాలొచ్చారట!" అందామె.

అతడు టైమ్ చూశాడు. పన్నెండూ పది అయింది.

"ఇంత రాత్రివేళ చుట్టాలెవరొస్తారే?" ప్రశ్నించాడతను.

"వెళ్ళి తలుపు తెరవండి. మల్లిక పిలుస్తోంది" అంది సావిత్రి.

"నువ్వు తెర్చి చూడవే" అన్నాడు రంగారావు.

సావిత్రి కిందకు దిగింది, తలుపు తెర్చింది. డేవిడ్, అహమ్మద్ ఆమెను తోసుకుంటూ లోపలకు జొరబడ్డారు.

వాళ్ళ వెనకనే ఆమె లోపలకొచ్చింది.

"అహమ్మద్, మొదట యీ ముసలాళ్ళను కుద

ముట్టించు. నన్ను చూసిన వాళ్ళు యీ లోకంలో బ్రతికి వుండకూడదు" అంది జూలీ కఠినంగా.

"మల్లికా, ఏమిటి నువ్వనేది? వీళ్ళిద్దరూ యెవరు?" అడిగింది సావిత్రి గాభరాగా.

వాళ్ళ మాటలు విని రంగారావు తటాలున కిందకు దూకాడు. డేవిడ్ అమాంతంగా అతడి గుండెల్లోకి కత్తిని దిగేశాడు. అరవకుండా అతడి నోటిని చేత్తో కప్పేశాడు. రంగారావు కప్పలా వెనక్కి పడ్డాడు.

సావిత్రి బాత్‌రూమ్‌లోకి పరుగెత్తింది. అహమ్మద్ వెనకనే వేగంగా వెళ్ళాడు. తలుపు మూయడానికి ఆమె యెంతగానో ప్రయత్నించింది. కాని ఆమె ప్రయత్నం ఫలించలేదు. తలుపును బలంగా తోసుకుని అహమ్మద్ బాత్‌రూమ్‌లో అడుగుపెట్టాడు. అరవబోతున్న ఆమె నోటిని చేత్తో కప్పేశాడు. వణుకుతూ ఆమె గచ్చునేల మీద కూర్చుండి పోయింది.

"నన్ను చంపకు. నీకేం కావాలో పట్టుకుపో" అంది సావిత్రి భయంతో.

గుమ్మంలో నిలబడిన జూలీ సావిత్రివైపు సూటిగా చూసింది.

"అహమ్మద్, నీ పని తొందరగా కానీ" అంది జూలీ.

పాంట్ జేబులోంచి కత్తితీసి అహమ్మద్ ఆమెను రెండుసార్లు పొడిచాడు. సావిత్రి నేలమీదపడి కొంచెం సేపు గిజగిజ కొట్టుకుని చివరకు శాశ్వతంగా కళ్ళు మూసింది.

మిస్ జూలీ పడగ్గదిలోకి తిరిగి వచ్చింది. గాడ్రెజ్ బీరువాను తెరిచింది. అక్కడున్న నగలను డేవిడ్ చేతిలో

వున్న బాగ్‌లో పడేసింది. గదిలో వున్న ఇనప్పెట్టెను అహమ్మద్ తెరిచాడు. లోపల నోట్లకట్టలు కుప్పలుగా పడున్నాయి.

"ఈ ముసలాడు బాగా లంచాలు కొట్టేసి వుండాలి" అన్నాడు డేవిడ్.

"అంతా మన మంచికే" అంది జూలీ నవ్వుతూ.

నోట్లకట్టలను డేవిడ్ బాగ్‌లో పడేసుకున్నాడు. జిప్పర్ మూశాడు. సమీపంలో వున్న మిస్ జూలీవైపు చూశాడు.

"డేవిడ్, ఈ ముసలాడ్ని లాక్కెళ్ళి బాత్‌రూమ్‌లో అతడి భార్య పక్కనే పడెయ్యండి" అంది జూలీ.

డేవిడ్, అహమ్మద్ రంగారావ్ శవాన్ని లాక్కెళ్ళి బాత్‌రూమ్‌లో పడేశారు.

గుమ్మంలో నిలబడి వాళ్ళిద్దరివైపూ జూలీ క్షణకాలం చూసింది. వెనక్కి తిరిగింది.

"ఇంట్లోని లైట్లు ఆర్పేసి వెళ్ళిపోదాం" అందామె.

ముగ్గురూ ఇంట్లోంచి బయటకు నడిచారు. గేటువైపు మెల్లగా వెళ్ళారు.

రోడ్డు లైట్లు వెలుగుతున్నాయి. ఆ సమయంలో ఎక్కడా జనసంచారం లేదు. గేటుకి కొంచెం దూరంలో ఒక అంబాసిడర్ కారు ఆగి వుంది. ముగ్గురూ ఆ కారు వైపు నడిచారు.

అహమ్మద్ డ్రైవర్ సీటులో కూర్చుని తలుపు మూశాడు. డేవిడ్, జూలీ వెనక సీటులో కూర్చున్నారు.

అహమ్మద్ వెనక్కి తిరిగాడు.

"మిస్ జూలీ, ఎక్కడికి పోదాం?" ప్రశ్నించాడు.

"మీరుండే హోటల్ విక్టోరియాకి పద!" అందామె.

అహమ్మద్ కారును రోడ్డమ్మట వేగంగా పోనిచ్చాడు.

హోటల్ గదిలో ముగ్గురూ సోఫాల్లో కూర్చున్నారు.

"డేవిడ్, ఎంత డబ్బుందో లెక్కెట్టు!" అందామె.

బాగ్ తెరిచి నోట్లకట్టలను డేవిడ్ బయట పడేశాడు. లెక్కెట్టసాగాడు.

"అహమ్మద్, గ్లాసులో స్కాచ్ విస్కీ పోసి పట్రా!" అందామె.

గ్లాసులో స్కాచ్ విస్కీ పోసి, సోడా కలిపి అహమ్మద్ ఆమెకిచ్చాడు. ఆమె గ్లాసులోని విస్కీని గడగడ తాగేసింది.

"ఫిలిట్!" అందామె.

అతడు గ్లాసులో మళ్ళా పోసి, సోడా కలిపాడు, ఆమె మెల్లిగా తాగుతూ అతడివైపు నవ్వుతూ చూసింది.

"మల్లికలా నటిస్తూ వీటన్నిటికీ దూరం కావలసి వచ్చింది. ఐ యామ్ స్టార్వ్డ్!" అంది జూలీ.

"మిస్ జూలీ, నువ్విలా నటించడంవలన మన పని సులువుగా పూర్తయింది" అన్నాడు అహమ్మద్.

"సిగరెట్" అందామె.

ఒక సిగరెట్ వెలిగించి, రెండుసార్లు పొగ పీల్చి అహమ్మద్ ఆమెకిచ్చాడు.

సిగరెట్ పొగ పీల్చి వదుల్తూ ఆమె టైమ్ చూసింది. రెండు కావస్తోంది.

డేవిడ్ హుషారుగా ఆమె వంక చూశాడు.

"రెండు లక్షల, అరవై వేల నాలుగొందలయాభై వుంది కాష్. నగల విలువ కనీసం లక్షపైన వుంటుంది" అన్నాడు డేవిడ్.

"గుడ్ వాచ్" అందామె.

దేవిడ్, అహమ్మద్ ఆమెకిరువైపులా కూర్చున్నారు.

"తెల్లారగానే వాళ్ళ శవాలు పోలీసువారికి దొరుకు తాయి. మనం ఆ లోపలే ఈ పట్నం వదిలి బెంగుళూరు వెళ్ళిపోవాలి" అందామె.

"గుడ్ ఐడియా" అన్నాడు దేవిడ్.

ఆమె తూలుతూ వెళ్ళి పరుపుమీద పడుకుంది. దేవిడ్, అహమ్మద్ ఆమె కిరువైపులా కూర్చున్నారు.

"ఎన్నిరోజులపాటో నేను నీకు దూరంగా వున్నాను" అన్నాడు దేవిడ్.

"నేనూ దూరంగా వుండవలసి వచ్చింది" అన్నాడు అహమ్మద్.

ఆమె ఇద్దరివైపూ నవ్వుతూ చూసింది.

"ఒక రూపాయి కోయిన్ వుంటే యిలా యియ్యి" అందామె.

అహమ్మద్ ఒక రూపాయ కాసును ఆమె కిచ్చాడు.

"బొమ్మా, బొరుసా?" అందామె దేవిడ్ వైపు చూస్తూ.

"బొమ్మ," అన్నాడతను.

"బొరుసు," అన్నాడు అహమ్మద్.

ఆమె రూపాయి కాయిన్ని పైకి ఎగరేసింది. గిర్రున తిరుగుతూ అది పరుపు మీద పడింది.

బొరుసు! అహమ్మద్ వుషారుగా లేచాడు. దేవిడ్ విచారవదనంతో ఆమెవైపు చూశాడు.

"డోంట్ బాదర్! ఎప్పుడో ఒకప్పుడు నువ్వూ జయిస్తావు," అందామె.

దేవుడ్ లేచి నుంచున్నాడు.

"గుడ్ లక్ మై ఫ్రెండ్," అని అహమ్మద్‌తో కర

చాలసేపు చేసి అతడు గదిలోంచి బయటకు వెళ్ళి పోయాడు.

తలుపు మూసి అహమ్మద్ ఆమె పక్కనే వాలి పోయాడు. ఆవేశంతో ఆమెను ముద్దెట్టుకున్నాడు.

"అహమ్మద్!" అందామె.

"రెండు వారాలపాటు నాకు నిద్రలేదు. చాపమీద పడుకోలేక అష్టకష్టాలూ పడేదాన్ని. నన్ను ప్రశాంతంగా పడుకోనీ! డోంట్ డిస్టర్బ్ మి!" అందామె.

"అలాగే జానీ," అన్నాడతను మరేం గత్యంతరం లేక.

"గుడ్ నైట్," అని ఆమె కళ్ళు మూసింది.

## 6

పొద్దుటే పాలవాడు యింటికొచ్చాడు. ముందు తలుపు మూసివుంది.

"మల్లికా! మల్లికా!" అని అరిచాడు అలవాటు మీద.

మల్లిక రాలేదు.

"సావిత్రి అమ్మా," అరిచాడు.

అప్పుడూ జవాబులేదు. వరండా మీదకు వెళ్ళి తలుపును తట్టాడు. తలుపును తోసి హాల్లోకి చూశాడు. ఎవ్వరూ లేరు.

మరికొంతసేపు పిల్చి పాలవాడు వెళ్ళిపోయాడు. పక్కింటికి నడిచాడు. వరలక్ష్మి పాలు పోయించుకుంది.

"సావిత్రమ్మ యింట్లో ఎవ్వరూ లేరండి!" అన్నాడతను.

"పనిమనిషి మల్లిక లేదూ?" అడిగిందామె.

"ఎంత పిల్చినా ఆమె రాలేదు. పాలు పోయకుండా

వచ్చేశాను," అన్నాడతను.

ఆమె లోపలకు నడిచింది. హాల్లో ఆమె భర్త శంకరన్ కూర్చునివున్నాడు.

"సావిత్రమ్మ యింట్లో ఎవ్వరూ లేరటండీ. పాలు పోయకుండా పాలవాడు వెళ్ళిపోయాడు," అందామె.

"నన్నేం చెయ్యమంటావే?"

"లోపల వున్నారేమో, వెళ్ళి చూసిరండి."

"కాఫీ తాగాక వెళ్తానలే," అన్నాడతను విసుగ్గా.

కాస్సేపట్లో ఆమె కాఫీ తెచ్చియిచ్చింది. అతడు కాఫీ తాగి పేపరు చదువుతూ కూర్చున్నాడు.

"సావిత్రమ్మ యింట్లో...."

"నువ్వు చెప్పింది గుర్తుందే."

"అయితే వెళ్ళి చూసిరండి!"

"ఆ ముసలాళ్ళు బాత్‌రూమ్‌లోనో సరసాలాడుతూ వుంటారు. పానకంలో పుడకలా నేనెందుకు వెళ్ళడం?"

ఆమె అతడి వంక సూటిగా చూసింది.

"నేను వెళ్ళిరానా?" అందామె.

అతను పేపర్ని టేబుల్ మీద పడేసి బయటకు నడిచాడు. సావిత్రమ్మ యింటి హాల్లోకి వెళ్ళాడు. హాల్లో నిశ్శబ్దంగా వుంది.

"రంగారావుగారూ!" అని మూడుసార్లు పిల్చాడు.

పక్కనున్న పడగ్గదిలోకి వెళ్ళాడు. పరుపు మీద ఎవ్వరూ లేరు. గచ్చు నేలమీద రక్తం మరకలు వున్నాయి.

అతడు బాత్‌రూమ్ వైపు నడచాడు. తలుపును లోపలకు తోశాడు. ఆ భయంకర దృశ్యాన్ని చూసి, వెను తిరిగి బయటకు అరుస్తూ పరుగెత్తాడు! క్షణంలో తన యింటికి చేరుకున్నాడు.

"ఏమిటలా వున్నారు? ఏమైంది?" అడిగింది భార్య వరలక్ష్మి.

"వాళ్ళిద్దరూ బాత్ రూమ్‌లో రక్తం మడుగుల్లో పడున్నారు," అన్నాడు శంకరన్.

ఆమె భయంతో భర్తవంక చూసింది.

"మనం ఏం చెయ్యాలి?"

"పోలీసు రిపోర్టు యివ్వాలి," అన్నాడతను.

"అలా చూస్తారేం, రిపోర్టివ్వండి," అందామె.

శంకరన్ టెలిఫోన్ రిసీవర్ ఎత్తి ఒక నంబరు తిప్పాడు.

"తేనాంపేట పోలీస్ స్టేషన్," అందో కంఠం అటువైపు నుంచి.

"మా పక్క యింట్లో హత్య జరిగింది. వెంటనే రండి," అన్నాడు శంకరన్.

"మీ పేరు, అడ్రసు చెప్పండి."

శంకర్ అడ్రెసు పేరు చెప్పాడు.

"హత్య జరిగింది పక్కింట్లో, మా యింట్లో కాదు," అని హెచ్చరించాడు శంకరన్.

"ఆ అడ్రసు చెప్పండి."

శంకర్ చెప్పాడు.

"ఇంకా సబ్ ఇన్‌స్పెక్టర్ గారు రాలేదు. నేను ఆయనకు ఫోన్ చేసి చెప్తాను. మేం అక్కడకు వస్తాం. మీరు అక్కడే వుండండి."

"అలాగే," అని శంకరన్ రిసీవర్ పెట్టేశాడు.

"ఏమన్నారు పోలీసులు?"

"వస్తున్నారు. నాకు కడుపులో కాలుతోంది. వాళ్ళు వచ్చేలోపల నాస్తా పడెయ్యవే!" అన్నాడతను.

"ఇడ్లీ రెడీగా వున్నాయి. తెస్తాను వుండండి," అని ఆమె లోపలకు పరుగెత్తింది.

## 7

పోలీసు జీప్ రంగారావు యింటిముందు ఆగింది. ఇన్‌స్పెక్టర్ దేవరాజు కిందకు దిగాడు.

ప్రజల్లో దేవరాజుకి బాగా పేరుంది. పది హత్య కేసుల్లో పనిచేసి అతడు హంతకులను విజయవంతంగా పట్టుకున్నాడు.

ఇన్‌స్పెక్టర్ దేవరాజ్ యువకుడు. అతడి వయస్సు యింకా ముప్ఫయి దాటలేదు.

జీప్‌లోంచి నలుగురు కానిస్టేబుల్సు కిందకు దూకారు.

"పక్కింట్లో వున్న శంకరన్‌గార్ని ఇక్కడకు రమ్మను" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఒక కానిస్టేబుల్ పక్కింటికి పరుగెత్తాడు.

జీప్ పక్కన నిలబడి దేవరాజు నలువైపులా చూశాడు. ఇంటి చుట్టూ చిన్న కాంపౌండు వుంది. వేప చెట్టు, మందార చెట్టు, కొబ్బరి చెట్లు, పూల మొక్కలు కనిపించాయి.

డాబా యిల్లు. డాబా మీదకు వెళ్ళడానికి మెట్లు బయటే వున్నాయి.

కానిస్టేబుల్‌తో వెనకనే శంకరన్ అక్కడికి వచ్చాడు.

"శంకరన్ నేనే సార్," అన్నాడతను.

"ఈ యింట్లో యెవరుంటున్నారు?"

"రంగారావుగారు, ఆయన భార్య సావిత్రి"

"రండి నాతో," అని యిన్‌స్పెక్టర్ ముందు గుమ్మం వైపు నడిచాడు.

తలుపును తోశాడు. వెనక్కు జరిగింది. ఇన్‌స్పెక్టర్ హాల్లోకి నడిచాడు. శంకరన్ వెనకనే కదిలాడు.

పడగ్గదిలోకి వెళ్లాడు ఇన్‌స్పెక్టర్. "బాత్‌రూమ్‌లో చూడండి," అన్నాడు శంకరన్.

బాత్‌రూమ్ తలుపు లోపలకు తెర్చివుంది. నేలమీద రంగారావు, సావిత్రి పక్కపక్కనే పడివున్నారు.

"ఆ తలుపు మూసివుంది, సార్. నేను తోసి, శవాలను చూసి, బయటకు పరుగెత్తుకెళ్ళి మా యింటి నుంచి మీకు ఫోన్ చేశాను," అన్నాడు శంకరన్.

ఇన్‌స్పెక్టర్ దేవరాజు శవాల పక్కకు నడిచాడు. సావిత్రి నైటీలో వుంది. రంగారావు లుంగీ, బనియన్‌లో వున్నాడు. కత్తితో పొడిచి వాళ్ళను చంపారని స్పష్టంగా తెలుస్తోంది.

ఇన్‌స్పెక్టరు దేవరాజు పక్కనున్న శంకరన్ వైపు చూశాడు.

"వీరుకాక యీ యింట్లో మరెవరు వుంటున్నారు?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"మల్లిక అనే పనిమనిషి వుంటోంది. ఆమె ఎక్కడికెళ్ళిందో!" అన్నాడు శంకరన్.

"ఆమె యిక్కడ చాలా కాలం నుంచి పని చేస్తోందా?"

"ఆమె యిక్కడ పనిలోకి చేరి మూడు వారాలు అయివుంటుంది. పనిమనిషి చాలా మంచిదని సావిత్రమ్మ నా భార్యతో చెప్తూంటే నేను విన్నాను" అన్నాడు శంకరన్.

"రంగారావుగారు ఏం చేసేవారు?"

"ఆయన తాశీల్దారుగా పనిచేసి రిటైరయ్యారు,"

అన్నాడు శంకరన్.

డాక్టర్ సుధాకర్ బాత్‌రూమ్‌లో కొచ్చాడు.

"మీ కోసమే ఎదురు చూస్తున్నా," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

డాక్టర్ సుధాకర్ శవాలను పరీక్షించసాగాడు.

ఇన్‌స్పెక్టర్ దేవరాజు, వెనకనే శంకరన్ పడగ్గది లోకి వెళ్లాడు. మంచం పక్కనే గచ్చుమీదలమీద విశేషంగా రక్తం మరకలు వున్నాయి. వాటివైపు దేవరాజు పరీక్షగా చూశాడు.

పరుపుమీదకు అతడి చూపు మళ్ళింది. భార్యాభర్తలు పరుపుమీద పడుకున్న సూచనలు వున్నాయి. వాళ్ళు నిద్రపోయాక రాత్రి ఎప్పుడో ఇదంతా జరిగివుండాలి!

"మల్లిక తప్ప వేరే పనివాళ్ళు లేరా?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"లేరండి. సావిత్రమ్మ వంట చేసేది. రంగారావు గారు తోటలోని మొక్కలకు నీళ్ళు పోస్తూ వుండేవారు."

"నిన్న సాయంత్రం వాళ్ళను మీరు చూశారా?"

"అందర్నీ చూశాను. రాత్రి మల్లికను కూడా చూశాను."

"ఎన్నింటికి?"

"పదింటికి."

"ఎక్కడ?"

"ఆమె మందార చెట్టుకింద కూర్చుని వుంది."

"ఒంటరిగానా?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"ఆమెతో ఒక మగాడున్నాడు."

"ఎవరతను?"

"అతని రూపం స్పష్టంగా తెలియలేదు."

ఇన్‌స్పెక్టర్ సూటిగా అతడివైపు చూశాడు.

"మల్లికను గురించి మీకు తెలిసినదంతా చెప్పండి!"

"ఆమె కెవడో ప్రియుడు వున్నాడు. వాడు రాత్రిళ్లు పదింటికి వచ్చేవాడు. గంట వరకూ ఆమెతో వుండి వెళ్ళి పోయేవాడు."

"అతడిని మీరు ఎన్నిసార్లు చూశారు?"

"చాలా సార్లు చూశాను."

"ఎక్కడ నుంచి?"

"నా పడగ్గది కిటికీలోంచి. మందార చెట్టుకిందున్న వాళ్ళు నా గదిలోంచి కనిపిస్తారు," అన్నాడు శంకరన్.

"రాత్రిళ్ళు మీరు నిద్రపోరా?"

"నా భార్య తొమ్మిదింటికే పడుకుంటుంది. ఎంత లేపినా లేవదు. నాకు నిద్రపట్టక అలా చూస్తూవుంటాను," అన్నాడతను.

"మల్లిక మాయమవడం విచిత్రంగా వుంది," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఆ ప్రియుడితో లేచిపోయిందేమో! మల్లిక మంచి వయసులో వున్న ఆడది!"

డాక్టర్ సుధాకర్ అక్కడికొచ్చాడు.

"ఇన్‌స్పెక్టర్, నిన్న రాత్రి పన్నెండూ ఒంటిగంట మధ్య వాళ్ళు మరణించి వుండాలి. కత్తితో పొడిచి చంపారు," అన్నాడు డాక్టర్.

"థాంక్స్ డాక్టర్," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

డాక్టర్ సుధాకర్ బయటకు వెళ్ళిపోయాడు. ఒక పోలీసు కానిస్టేబుల్ శవాల ఫోటోలను తీస్తున్నాడు. మరి కొందరు వేలిముద్రల కోసం చూస్తున్నారు.

ఇన్‌స్పెక్టర్ దేవరాజు బయటకు నడిచాడు. మందార చెట్టు కిందకు వెళ్ళాడు. వెనకనే వెళ్ళాడు శంకరన్.

"అదే నా పడగ్గది!" అన్నాడు శంకరన్.

పడగ్గది వైపు చూశాడు ఇన్‌స్పెక్టర్.

"ఆమె ప్రియుడెవరో చెప్పండి!"

"అతడు యిక్కడి వాడే. బండిలో కూరలు అమ్ముకునే గోపీ."

"అతడెక్కడుంటాడు?"

"రోడ్డుమీద కూరలు అమ్ముకుంటూ వుంటాడు."

"మల్లికను కల్సుకునే వ్యక్తి గోపీ అని మీరు ఖచ్చితంగా చెప్పగలరా?"

"వాడే! సందేహంలేదు," అన్నాడు శంకరన్.

మందార చెట్టుకింద చార్మినార్ సిగరెట్ పీకలు కనిపించాయి.

"గోపీ మీకు బాగా తెలుసా?"

"సంవత్సరం నుంచి బండిలో కూరలు అమ్ముతున్నాడు. నేను ఎన్నిసార్లో అతడి దగ్గర కూరలు కొన్నాను. చురుగ్గా, తీగలా వుంటాడు గోపీ! నా మొహం అతడికి గుర్తుండొచ్చు. అంతకంటె ఎక్కువగా అతడితో పరిచయంలేదు," అన్నాడు శంకరన్.

"మీరు జీప్‌లో ఎక్కండి!"

శంకరన్ జీప్‌లో కూర్చున్నాడు. ఇన్‌స్పెక్టర్ దేవరాజు జీప్‌ను పోనిచ్చాడు. రోడ్డమ్మట ఒక కిలోమీటర్ దూరం వెళ్ళాక గోపీ బండి కనబడింది.

"అతనే!" అన్నాడు శంకరన్.

కూర్లబండి వెనక జీప్ ఆగింది. ఇన్‌స్పెక్టర్ దేవరాజు బండి ముందుకు వెళ్ళాడు. శంకరన్ జీప్ దిగి వెనక్కు

తిరిగి రోడ్డమ్మట వేగంగా వెళ్ళిపోయాడు.

కూరల మీద నుంచి యిన్‌స్పెక్టర్ చూపు గోపీ మీదకు వెళ్ళింది.

"తీసుకోండి సార్! ఏం కావాలో చెప్పండి!" అన్నాడు గోపీ.

"నీతో మాట్లాడాలి!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"దేన్ని గురించి సార్?"

"మల్లిక గురించి!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఏమైందామెకు?" అడిగాడు గోపీ.

"ఆమె యిల్లు విడిచి పారిపోయింది. ఇంట్లో రెండు శవాలున్నాయి. రంగారావు, సావిత్రమ్మ చంపబడ్డారు," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

గోపీ తృళ్ళిపడ్డాడు.

"వాళ్ళను ఆమె చంపివుండదు, సార్!" అర్చాడు గోపీ.

"మల్లిక ఎక్కడుంది?"

"నాకు తెలియదు, సార్."

"నీకు తెలుసు. దాస్తున్నావు!" గద్దించాడు యిన్‌స్పెక్టర్.

"నిజం చెప్పాను, నమ్మండి."

"నిన్న ఆమెను చూశావా?"

"చూశాను."

"ఎప్పుడు?"

"పదింటికి."

"ఆమెతో ఎంతసేపున్నావు?"

"గంటసేపు, సార్."

"సరిగ్గా పదకొండింటికి వెళ్ళిపోయావా?"

"టైము నాకు తెలియదు సార్. నేనక్కడి నుంచి బండి తోలుకుని టీ షాపుకు వెళ్ళాను. అక్కడ టైమ్ అడిగాను. పదకొండున్నర అన్నాడు కొట్టతను. పన్నెండు దాకా అక్కడే వున్నాను. తర్వాత రామయ్యర్ పార్కుకు పోయి సోఫాలో పడుకున్నాను."

"నిన్నరాత్రి ఆమె నీతో ఏమంది?"

"కొన్ని రోజుల దాకా తనకోసం అక్కడకు రావద్దని చెప్పింది."

"ఎందుకలనని నువ్వు అడిగేవా?"

"అడిగాను, సార్. అదంతా అడగొద్దంది. వీలుచూసుకుని తనే వస్తానంది."

"నిన్ను ఎక్కడ కల్సుకుంటుంది?"

"నేనెక్కడున్నా అక్కడికొచ్చి కల్సుకుంటానంది," అన్నాడు గోపీ.

"ఆమెను గురించి నువ్వు ఏం చెప్పగలవు?"

"ఆమెను గురించి నాకంతగా తెలియదు, సార్. ఎందుకలనో మా యిద్దర్కీ స్నేహమైంది. వారం రోజుల పాటు సుఖంగా కాలం గడిపాం. ఇప్పుడు వేరయిపోయాము."

"నువ్వామెకు డబ్బిచ్చావా?"

"మొదటిసారి డబ్బివ్వబోయాను. ఆమె తీసుకోలేదు. డబ్బుకోసం నా దగ్గరకు రాలేదని అందామె. అటుపైన నేను మళ్లా డబ్బివ్వలేదు."

"అవసరమైతే మళ్లా వచ్చి నీతో మాట్లాడ్తాను," అని ఇన్‌స్పెక్టర్ జీప్ వైపు నడిచాడు.

జీప్‌ను వేగంగా రంగారావు కాంపౌండులోని పోనిచ్చి ఆపాడు. శంకరన్ ఎదురయ్యాడు.

"ఏమటలా వెళ్ళిపోయారు?" అడిగాడు ఇన్ స్పెక్టర్.

"గోపీగాడు గూండా రకం మనిషి. వాడు మల్లికతో తిరుగుతున్నాడని నేను చెప్పినట్లు తెలిస్తే నా మీద పగ బడ్తాడు. అందుకని వెనక్కి తిరిగి వచ్చేశాను," అన్నాడు శంకరన్.

ఇన్ స్పెక్టర్ దేవరాజు ఆలోచిస్తూ లోపలకు వెళ్ళాడు.

# 8

పోలీసు కమీషనర్ ఎదురుగా యిన్ స్పెక్టర్ దేవరాజు నిలబడివున్నాడు.

"ఏమైందా కేసు?" అడిగాడు కమీషనర్.

"ఎంతో కనుక్కున్నాను సార్. కోయంబత్తూరులో ఒక ముసలామె హత్య చేయబడింది. రెండు వారాల క్రితం ఆమె ఇంట్లోకి కమల అనే పనిమనిషి చేరింది. ముసలామెకు నమ్మకం కుదిరేటట్లు ఆమె నడుచుకునేది. ముసలామె హత్య తర్వాత కమల మాయమైంది."

"గుడ్ గాడ్!" అన్నాడు కమిషనర్.

"సంవత్సరం క్రితం ఈ సంఘటన మధురలో జరిగింది. పరమశివ నాడార్ అనే ధనవంతుడు తన యింట్లో ఒంటరిగా జీవించేవాడు. రేవతి అనే పనిమనిషి అతడి ఇంట్లో చేరింది. మూడు వారాల తర్వాత అతడు చంపబడ్డాడు. రేవతి మాయమైంది."

"ఇవన్నీ ఒకే రకం హత్యల్లా వున్నాయి!" అన్నాడు కమీషనర్.

"అదే నేను చెప్పదలచినది. ఒకే పేటర్న్‌లో యీ హత్యలు జరిగాయి. కమల, రేవతి, మల్లిక ఒకే యువతి మూరు పేర్లు అయివుండాలి, సార్," అన్నాడు యిన్

స్పెక్టర్.

"యూ ఆర్ రైట్," అన్నాడు కమిషనర్.

"త్వరలో ఆమెను పట్టుకుంటాను. కమల, రేవతి ఇంతవరకూ పోలీసులకు చిక్కలేదు. కాని ఈ పట్నంలో జరిగిన హత్యలకు కారకురాలైన మల్లిక నాకు తప్పక దొరుకుతుంది," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"త్వరగా ఆమెను అరెస్టు చేయండి," అన్నాడు కమీషనర్.

"యస్సార్," అని యిన్‌స్పెక్టర్ దేవరాజు బయటకు నడిచాడు.

ఇన్‌స్పెక్టర్ దేవరాజు తన ఆఫీసుకు చేరుకున్నాడు. టెలిఫోన్ మ్రోగింది. అతడు రిసీవర్ని ఎత్తాడు.

"ఇన్‌స్పెక్టర్ హియర్!"

"మూర్తి రిపోర్టింగ్, సార్. గోపీని వెంటాడుతున్నాను. అనేక మంది స్త్రీలు బండి దగ్గరకు వచ్చి కూరలు కొని తీసుకుపోతున్నారు. ఎవ్వరిమీదా నాకు అనుమానం రాలేదు."

"వెంటాడుతూనే వుండు!" అని దేవరాజు రిసీవర్ పెట్టేశాడు.

శంకరన్, వెనకనే ఒక స్త్రీ లోపలకు వచ్చారు.

"కూర్చోండి" అన్నాడు యిన్‌స్పెక్టర్.

"ఇన్‌స్పెక్టర్, యీమె రంగారావుగారి పెద్ద కూతురు. మీ టెలిగ్రామ్ అందగానే వచ్చింది. పేరు శ్రీలక్ష్మి," అన్నాడు శంకరన్.

శ్రీలక్ష్మి ఏడుస్తోంది.

"ఏడవకండమ్మా! ఆ యింట్లోంచి ఎంత డబ్బు పోయి వుంటుందో చెప్పగలరా?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"అమ్మ నగలన్నీ పోయాయి. వాటి విలువ లక్ష రూపాయలు పైన వుంటుంది. చాలా కాష్ కూడా పోయి వుండాలి. ఎంత పోయిందో నేను సరిగ్గా చెప్పలేను," అందామె.

"హంతకులను త్వరలో పట్టుకుంటాను," అన్నాడు దేవరాజ్.

## 9

బెంగుళూరు!

డేవిడ్, అహమ్మద్ ఆమె కెదురుగా కుర్చీలో కూర్చున్నారు.

మిస్ జూలీ మూడు కప్పుల్లో కాఫీ కలిపింది. ఎలక్ట్రిక్ బెల్ మ్రోగింది. డేవిడ్, అహమ్మద్ ముందు గుమ్మంవైపు వెళ్లారు.

ఒక పొట్లాన్ని విప్పి ఆమె పౌడర్ని వాళ్ళ కాఫీలో వేసింది. చంచాతో కలిపేసింది.

ఇద్దరూ తిరిగొచ్చారు.

"ఎవరు?"

"పోస్టువాడు. యేవో ఉత్తరం ఇచ్చాడు. మాది కాదని వాపసు చేసేశాను" అన్నాడు డేవిడ్.

"కమాన్, డ్రింక్!" అందామె.

ఇద్దరూ కప్పులు తీసుకుని తాగుతున్నారు. తన కాఫీ తాగుతూ ఆమె వాళ్ళవైపే చూస్తోంది.

డేవిడ్ అమాంతంగా కుర్చీలోంచి పక్కకు పడ్డాడు. కప్పు కిందపడి పగిలింది. అహమ్మద్ వెనక్కు పడ్డాడు.

కాఫీ తాగేసి ఆమె లేచి నుంచింది. వాళ్ళవైపు మౌనంగా చూసింది.

"శని విరగడైంది" అనుకుంది తనలో తను.

ఆమె పక్క గదిలోకి వెళ్ళింది. మూడు తోలు పెట్టెలు, ఒక లెదర్ బాగ్ గోడవారగా వున్నాయి. వాటిని చూసి ఆమె లోలోపల నవ్వుకుంది.

"కాశ్మీర్‌కి పోదాం" అందామె వాళ్ళతో.

డేవిడ్, అహమ్మద్ అంతా పాక్ చేసి సిద్ధంగా వుంచారు. లెదర్ బాగ్‌ను ఆమె తీసుకుంది. ఒక తోలు పెట్టెను మరో చేత్తో పట్టుకుంది. కిందకు వెళ్ళి అంబాసిడర్ కారులో పెట్టింది.

మళ్ళా యింట్లోకి ప్రవేశించింది. మెట్లెక్కి పైగదిలో పడుకున్న వాళ్ళిద్దరివైపూ చూసింది. గుడ్ బై చెప్పి కిందకు వెళ్ళిపోయింది.

ముందు తలుపు మూసి తాళం వేసింది. స్టీరింగ్ వీల్ వెనక కూర్చుని కారును వేగంగా రోడ్డు మీదకు పోనిచ్చింది.

కామత్ గారేజిముందు కారాపింది. అతడు నవ్వుతూ ఆమె దగ్గరకొచ్చాడు.

"ఈ కారు తీసుకుని నాకో ఫియట్ కారు యియ్యి" అందామె.

దొంగ కార్ల అమ్మకంలో కామత్ ఆరితేరినవాడు.

"ఫియట్ లేదు. ఫోర్డు కారిస్తాను" అన్నాడతను.

ఆమె కిందకు దిగి అతడు చూపించిన ఫోర్డుకారును చూసింది.

"అంబాసిడర్ తీసుకుని నాకెంత యిస్తావు యీ ఫోర్డు కారుతో సహా?" అడిగిందామె.

"పైసా యివ్వను. కావలిస్తే పట్టుకుపో!" అన్నాడు కామత్.

తన పెట్టె, లెదర్ బాగ్‌ను ఆమె ఫోర్డు కారు

డిక్కీలో పెట్టి లాక్ చేసింది. కామత్ కి బైబై చెప్పి కారును పోనిచ్చింది.

ట్యాంక్ నిండా పెట్రోలు పోయించి ఫోర్డు కారును మద్రాసువైపు ఆమె శరవేగంగా పోనిచ్చింది.

ట్రంక్ రోడ్డమ్మట కారు దూసుకుపోతోంది. గతాన్ని గురించి ఆమె ఆలోచిస్తోంది....

తన తల్లి రెండో పెళ్ళి చేసుకుంది. తను స్కూల్లో చదువుకునేది. ఒకనాడు తల్లి యింట్లో లేదు. సవితి తండ్రి తాగివచ్చాడు. తనను రేప్ చేయబోయాడు. అతడి గుండెల్లోకి స్క్రూడ్రయివర్ గుచ్చేసి, యిల్లు విడిచి తను పారిపోయింది.

డేవిడ్ తో తనకు స్నేహమయింది. తర్వాత అహమ్మద్ వాళ్ళతో కలిశాడు! ఇప్పుడు తనకు కావలసింది వాళ్ళు కాదు! తనకు కావలసింది గోపీ!

గోపీతో తను కాశ్మీర్ కి పోవాలి! గతాన్ని మర్చిపోయి అతడితో సుఖంగా జీవితాన్ని గడపాలి!

రోడ్డుమీద పోతులు గుంపులుగా నడుస్తున్నాయి. హారన్ ఎన్నిసార్లు మ్రోగించినా అవి పక్కకు కదలడం లేదు!

ఆమె కారును ముందుకు పోనిచ్చింది. బంపరు తగిలి పోతులు పక్కకు పరుగెత్తాయి.

ఆమె కారును వేగంగా ముందుకు పోనిచ్చింది. గోపీ రూపం ఆమె మెదడులో మెదుల్తోంది.

# 10

రోడ్డు వారగా ఆగి వుంది గోపీ బండి. ఒక ముసలామె కూరలు కొంటోంది. ఆమె కాస్సేపట్లో వెళ్ళిపోయింది.

ఒక యువతి ప్లాస్టిక్ బుట్ట పట్టుకొని బండి దగ్గరకు

వెళ్ళింది. నవ్వుతూ అతడివైపు చూసింది.

"మల్లీ, నువ్వా!" అన్నాడు గోపీ.

"నా పేరిప్పుడు జూలీ. ఆ యింట్లో వుంటున్నాను. రాత్రి రా!" అందామె.

ఎవరో వచ్చారు. జూలీ వంకాయలు, బంగాళా దుంపలు, కాబేజి వగైరా కొని డబ్బిచ్చింది.

బండి దగ్గర మరెవ్వరూ లేరు.

"రాత్రి ఎన్నింటికి?"

"ఎనిమిదింటికి?" అందామె.

"వస్తాను" అన్నాడతను.

మరోసారి అతడి వంక చూసి ఆమె సమీపంలో వున్న తన ఇంటివైపు వెళ్ళిపోయింది. గేటు దాటిందాకా గోపీ ఆమె వంకే చూస్తూ వుండిపోయాడు.

* * *

టెలిఫోన్ మ్రోగింది. దేవరాజు రిసీవర్ని ఎత్తాడు.

"మూర్తి రిపోర్టింగ్ సార్!"

"చెప్పు!"

"ఒక యువతి కూరలు కొనుక్కుని వెళ్ళింది. అతడితో యేదో మాట్లాడింది. ఆమె వెళ్ళిన యింటివైపే గోపీ చూస్తూ వుండిపోయాడు."

"ఇద్దర్నీ వాచ్ చేయండి!" అని దేవరాజు రిసీవర్ని పెట్టేశాడు.

* * *

ఎనిమిదైంది.

చక్రాల బండిని కాంపౌండులో ఆపి అతడు ముందు తలుపువైపు వెళ్లాడు. ఆమె తలుపు తెర్చింది. అతడు లోపలకు రాగానే ఆమె తలుపు మూసింది.

రెటు వెలుతోంది.

"గోపీ! గోపీ!" అని అరుస్తూ ఆమె అతడిని కౌగలించుకుని ముద్దెటుకుంది.

"మనిద్దరం రేపు విమానంలో కాశ్మీర్ పోదాం" అందామె.

ఎవరో తలుపును తట్టారు. తృళ్ళిపడ్డూ ఆమె అతడిని వదిలేసింది.

"నిన్నెవరేనా వెంటాడుతున్నారా?"

"నన్నెవరు వెంటాడ్తారు?" అన్నాడతను.

ఆమె మెల్లిగా తలుపు తెర్చింది. పిస్టల్ని ఆమెవైపు గురిపెట్టి యిన్‌స్పెక్టర్ దేవరాజు లోపలకు వచ్చాడు.

"మల్లికా, చేతులెత్తు!" అర్చాడతను.

"మల్లికెవరు?" అందామె కోపంగా.

"నువ్వే! గోపీ నిన్ను పోలుస్తాడు!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఆమె గోపీవైపు తిరిగింది. గోపీవైపు యిన్‌స్పెక్టర్ దేవరాజు సూటిగా చూశాడు.

"మల్లిక యీమే సార్" అన్నాడు గోపీ.

ఆమె లోపలకు పరుగెత్తింది. వెనకనే పరుగెత్తాడు దేవరాజు. ఆమెను బలంగా పట్టుకున్నాడు.

"నన్ను చావనివ్వండి!" అర్చిందామె.

"రేవతి! కమల! మల్లిక! నువ్వు మూరు పేర్ల మనిషివి! ఎన్ని హత్యలో చేశావు...."

"నేను చంపలేదు. డేవిడ్. అహమ్మద్ చంపారు."

"వాళ్ళు యెక్కడున్నారు?"

"నా చేతిలో వాళ్ళు చచ్చారు!" అందామె.

ఇన్‌స్పెక్టర్ దేవరాజు ఆమె చేతులకు బేడీలు

వేశాడు. ఆమెను ఒక కుర్చీలో కూర్చోబెట్టాడు.

"మూర్తీ!" పిల్చాడతను.

సి.ఐ.డి. ఆఫీసరు మూర్తి దగ్గరకొచ్చాడు.

"ఈ ఇల్లంతా వెతకండి! వాళ్ళు దోచుకున్న డబ్బు మనకు దొరకొచ్చు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ దేవరాజు.

"పడగ్గదిలో మంచంకింద లెదర్ బాగ్‌లో డబ్బూ, నగలూ వున్నాయి. తీసుకోండి. నాకు జీవితం మీద ఆశ పూర్తిగా నశించింది" అందామె.

ఇన్‌స్పెక్టర్ దేవరాజు, మూర్తి పడగ్గదిలోకి నడిచారు.

—:అయిపోయింది:—

# నల్లత్రాచు

## చంద్రశేఖర అజాద్

పగ నన్ను కాల్చేస్తోంది.

నాలోని అణుకణువునీ ఉద్రేకానికిలోను చేస్తోంది. నా శరీరం కొన్ని సంవత్సరాలుగా చల్లబడి ఎరుగదు. నా కళ్ళు సైతం ఎర్రగానే ఉంటున్నాయి. నా చెల్లి జీవితంతో ఆడుకున్న దుర్మార్గుడు మాత్రం ఆనందంగా జీవితాన్ని అనుభవిస్తూనే ఉన్నాడు. నా పగ చల్లారటానికి ఏ ఏ మార్గాలు అవలంబించాలో ఎంతగానో పరిశీలించాను. వాటిలో కొన్ని అమలు చేశాను కూడా. అయితే నేం అవేం విజయవంతం కాకపోగా నాకు మరింత నరకాన్ని సృష్టించాయి.

నేను నిస్సహాయుడుగా మిగిలిపోతున్నాననే బాధ నా హృదయాన్ని రంపంలా కోస్తోంది. నాది పేదవాడి కోపంలా తయారయింది.

సముద్రపు ఒడ్డున కూర్చున్న నాకు ఇంకెంతో నిరాశ పేరుకుపోతోంది. ఉవ్వెత్తున్న లేచి పడుతున్న కెరటాలు

నల్లటి రాళ్ళకు తగిలి తుంపరలై గాల్లోకి ఎగిరి తిరిగి నీళ్ళలో కలిసిపోతున్నాయి.

నేనుకూడా అంతేనేమో? నా ప్రయత్నాలు ఫలించవేమో? జీవచ్ఛవంలా బ్రతకటమే నా చివరి పరినితేమో!

రవి శరీరం కూడా అలా ముక్కలై, గాల్లో కలిసిపోతే నేను చాలా ఆనందించేవాడిని. కానీ ఎలా?

మరో ప్రక్క నా హృదయం ఘోషిస్తోంది. ఆ కెరటాల నిరంతర దాడి మూలంగానే కఠినమైన, కరుకైన ఆ నల్లని రాళ్ళు నున్నగా మారాయని. శతాబ్దాల కాలంలో వాటి అస్తిత్వాన్నే కోల్పోయేలా చేయగలవని. కానీ సముద్రం అనంతం. సముద్రంతోనూ, నిరంతరం ఎగిసి పడే అలలతోనూ నన్ను పోల్చుకోవటానికే సిగ్గు కలుగుతుంది.

నాకు మొన్నటి సంఘటన కళ్ళముందు మెదిలింది....

రవి కొడుకు ఓ పబ్లిక్ స్కూల్ లో చదువుతున్నాడు. వాడ్ని కనుక మాయంచేస్తే, గొంతు పిసికి చంపిపారేస్తే. ఆ విషయం తలుచుకొని వాడు గుండెలు పగిలేటట్టు ఏడిస్తే అప్పుడు నాకు మనశ్శాంతి. వాడు చేసిన అన్యాయానికి అది ప్రతీకారం అవుతుంది.

ఈ నడుమకాలంలో నా గడ్డం బాగా పెంచాను. అంతకుముందు నాకు మీసాలు ఉండేవికావు. చెవిపైకి వెంట్రుకలు కత్తిరించుకునేవాడిని. ఇప్పుడంతా మారిపోయింది. ఇరుకైనబట్టలు, కాళ్ళకుబూట్లు. అయినా ఇవి నా పట్ల చులకన భావాన్ని కలిగించకపోవటం నా అదృష్టం.

రవి కొడుకు పేరు నవీన్. చాలా ముద్దుగా ఉంటాడు. రవి ఊర్లో చిన్న కాన్వెంట్స్ లేకపోలేదు. అయినా

వాడ్ని ఇక్కడే చదివిస్తున్నాడు. అంత చిన్నవయసు లోనే పిల్లలు తల్లితండ్రులకి దూరంగా ఉండటం నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. ఒకరకంగా అదే మంచిదేమో. ఒకరికొకరు అనుబంధాలు పెంచుకొని విడిపోయేటప్పుడు కృంగిపోవటంకన్నా, చిన్నతనం నుండీ ఇలాంటి వాతావరణంలో పెరగటం మంచిదనుకుంటాను.

నా విషయంలో నాకిలాంటి అనుమానం లేదు. ఆ పబ్లిక్‌స్కూల్ వారిని సమాధానపరిచి నవీన్‌తో బయటకు రావటం నాకంత సమస్యకాదు. ముందు ఫోన్ చేసి 'రవి' మాట్లాడినట్లు మాట్లాడుదామనుకొన్నాను. అయితే ఓసారి పబ్లిక్‌స్కూల్ వాతావరణం పరిశీలించి రావాలని బయలుదేరాను.

అది సాయంకాలం. పిల్లలంతా ఆడుకుంటున్నారు. ఇంకా ఆ స్కూల్ నిర్మాణం పూర్తికాలేదు. విశాలమైన ప్రాంతంలో ఆ స్కూల్ ఏర్పాటుచేశారు. పెద్ద భవనాలు రెండు నిర్మించారు. వాటిల్లోనే ప్రస్తుతం క్లాసులు నిర్వహిస్తున్నారు.

అవికాక మరో రెండు భవనాలు నిర్మాణంలో వున్నాయి. అవి దాటాక దూరంగా చెట్లు. ఆ ప్రాంత మంతా కొండప్రాంతం. అప్పటికే కొందరు ఫ్యాక్టరీలకు గాని, మరే ఇతర అవసరాలకుగాని ఆ స్థలాలు కొనేసి చుట్టూ ఫెన్సింగ్ నిర్మిస్తే, మరికొందరు యూకలిప్టస్ మొక్కల్ని నాటారు. ఇంకా ఇళ్ళప్లాటులు వేసినట్టుగా రాళ్ళు పాతబడి ఉన్నాయి.

ఇంతకంటే మంచి వాతావరణం కూడా లభించదు.

ఇప్పుడు నవీన్ని పలకరించి, మెల్లగా తీసుకెళ్ళగలిగితే, ఆ చెట్లతోపుల్లో వాడి గొంతు పిసికేసి రావచ్చు. ఆ

తర్వాత నవీన్ గురించి వాళ్ళు తెలుసుకొనే లోపు నే నెక్కడుంటానో!

ముందు వాళ్ళు నవీన్ కనపడటంలేదని గుర్తించాక రవికి ఫోన్ చేసి ఈ విషయం తెలియచేస్తారు. రవి 'ఇంటికి రాలే'దంటాడు. "మరి కనపడటం లేదుసార్" అని వారంటారు. "ఏమైపోయాడు" అంటూ వారి అజాగ్రత్తమీద కేకలేస్తాడు. గుండెలు జారిపోతుండగా పోలీస్ స్టేషన్లన్నింటికి ఫోన్ చేస్తాడు.

వెంటనే బయలుదేరి వస్తాడు.

యూకలిప్టస్ చెట్లనడుమ నవీన్ శవం వికృతంగా కనపడుతుంటే....బిగ్గరగా అరిచి....కుళ్ళు కుళ్ళి ఏడుస్తుంటే....ఇంకెక్కడి నవీన్! ఎవరుమాత్రం తీసుకు రాగలరు!

నా పెదవులమీద చిరునవ్వు మొదలయింది.

ఆ చుట్టుప్రక్కల ఎవరూ లేకుంటే ప్రకృతి అంతా ప్రతిధ్వనించేటట్లు కళ్ళలో నీళ్ళు సుడులు తిరిగేటట్లు వికటాట్టహాసం చేసేవాడ్ని.

ముందుకు నడిచాను.

పిల్లలు ఆడుకుంటున్నారు—ఈ లోకాన్ని మరిచిపోయి. వారంతా ఒకే డ్రస్‌లో ఉన్నారు. వారి నడుమ కుల, మత, ధనిక, పేద భావాలు లేవు. నిష్కల్మషంగా వారలా ఆడుకుంటుంటే ఎంతో చూడ ముచ్చటగా ఉంది. వారిలో ఎర్రటిపిల్లలు, నల్లగా ఉన్నవారు, బలంగా ఉన్నవారు, బలహీనంగా కనపడుతున్నవారూ ఉన్నారు. అయినా అందరిలోనూ ఏదో ఆకర్షణ. నా దృష్టిమాత్రం నవీన్ మీదే వుంది. 'నవీన్'— పేరుబాగా నే పెట్టాడు.

వీడు కూడా రవిలా తయారయితే ప్రపంచానికి భారంగా తయారవుతాడు. ఇప్పుడు నేను చేస్తున్నపని ఆ భారాన్ని తగ్గించటమే.

నవీన్ బుగ్గలు పాలుకారుతున్నాయా అన్నట్లున్నాయి. బహుశా తల్లి పోలికేమో! వాడెంత ముద్దొస్తున్నాడంటే పది నిముషాలనుండి చూస్తున్నాను కాని నాలో మరో ఆలోచన కలగటంలేదు. అలానే ముందుకు నడుచుకుంటూ వెళ్ళాను.

దూరంగా యూకలిప్టస్ చెట్లున్నాయి. వాటి మధ్యగా నడుస్తుంటే కాళ్ళక్రింద ఆకులు నలుగుతున్నాయి. దూసుకొస్తున్న గాలి చేస్తున్న శబ్దం వింతగా ఉంది. చేతికందిన ఓ ఆకును త్రుంచి దాన్ని నడుమకువంచి వాసనచూస్తే హాయిగా ఉందనిపించింది.

నాలో ఇప్పుడు ప్రతీకార జ్వాలలులేవు. నన్నెందుకో ఓ రకమైన ప్రశాంతత ఆవరించినట్లయింది. అందుకే నా అంతరాత్మ నాపై ఎదురు తిరిగి ప్రశ్నించింది.

"ముక్కుపచ్చలారని పిల్లవాడ్ని చంపబోవటానికి నీకు చేతులెలావచ్చాయి? నీ పగ వాడిమీదనా! ఎంత దారుణం? నీకు అన్యాయం చేసినవాడ్ని ఏమీ చెయ్యటం నీకు చేతకాకపోతే, ఈ ప్రపంచంలో ఏదో మూలకెళ్ళి బ్రతుకు. లేదంటావా వాడి అంతం చూడటానికి ప్రయత్నించు. అంతేగాని ఏ పాపం ఎరగనివాడ్ని, కేవలం రవి బిడ్డ అయిన నేరానికి బలిచేస్తే అంతకంటే అన్యాయం ఏముంటుంది? నీ చేతగానితనం, నీ రాక్షసత్వం కాదా ఇది?" అంటూ అంతరాత్మ నిలదీస్తూంటే నిజంగా నే కదిలిపోయాను.

ఎంతటి దారుణమైనపనికి పూనుకున్నాను. ఇంక

ప్పుడూ ఇలాంటి ఆలోచనలకు దారి తియ్యటం జరగ కూడదని బలంగా నిర్ణయించుకున్నాను. నా వైరం రవి తో నే. నాకు చేతనయితే వాణ్ణే ఏమయినా చెయ్యాలి. ఆ రకంగా నా ప్లాను రూపొందించుకోవాలి.

ఆ చెట్లనుండి మంచిగాలి పీల్చుకొని తిరిగి వచ్చేశాను.

నా కాళ్ళను తడిపేసి వెనక్కి వెళ్ళుతున్న నీళ్ళు నన్ను తిరిగి వాస్తవంలోకి తెచ్చాయి. చీకట్లు ముసురుకుంటు న్నాయి. సముద్రంఒడ్డున జనం పలచ పలచగా ఉన్నారు. ఘోష మాత్రం నాలో ఆందోళనలా వుంది. లేచి నిల బడ్డాను. ఇసుకలో నడుచుకుంటూ ముందుకు వెళుతు తున్నాను.

ఏం చేయాలి? ఎలా ఈ సమస్యను పరిష్కరించాలి.

# 2

ఆ రోజు....

చిట్టితల్లి - నా బంగారుచెల్లెలు నిద్రబిళ్ళలు మింగిందని, హాస్పిటల్లో చేర్పించారని తెలియగానే గాలితో సమా నంగా పరిగెత్తుకెళ్ళాను.

బెడ్ మీద ఈ ప్రపంచాన్ని మరిచిపోయి నిద్రపో తూంది. అమ్మ కళ్ళనుండి నీళ్ళు! ఆమె హృదయపులోతుల నుండి పొంగివస్తున్న దుఃఖం ఆపుకోవటానికి కొంగు నోట్లో పెట్టుకుంది. ఎన్నిబిళ్ళలు మింగిందో ఏమో?

అమ్మతో ఏం మాట్లాడలేకపోయాను.

నాకయితే ఎన్నెన్నో అడగాలనుంది. ఎందుకు చని పోవాలనుకుంది? ఇంట్లో గొడవలు ఏమైనా జరిగాయా? గొడవలు ఏం జరుగుతాయి! ఇంట్లో చిట్టితల్లికంత స్వేచ్ఛ ఉంది. నాన్నపోయాక మేం ఆయన్ని చెల్లిలో చూసు కుంటున్నాం.

అలాంటి చెల్లి ....మంచి సంబంధం చూసి పెళ్ళిచేసి పంపించాలనుకుంటున్న నా చిట్టితల్లి — ఈ ప్రపంచం గురించి స్పృహలేకుండా అలా మంచంలో పడిపోయిం దెందుకు? నా చిట్టితల్లి గుండెల్ని నిర్దాక్షిణ్యంగా బ్రద్దలు చేసిందెవ్వరెవ్వరు? ఈ జీవితంమీదే విరక్తి పెంచుకొని, మమ్మల్ని శోకసాగరంలో ముంచెత్తి వెళ్ళిపోవాలన్న దారుణ నిర్ణయానికి నా చిన్నారి రావటానికి ఏ పరిస్థితులు, ఏ దుర్మార్గులు కారణం?

నేను చెల్లి ప్రక్కన కూర్చుని ఆమె తల వెంట్రుకలు సరిచేస్తుంటే నా పెదవులు ప్రకంపిస్తున్నాయి. నా అంతరాంతరాల లోతుల్నుండి దుఃఖం వెల్లుబికి వస్తోంది.

అయిపోయింది.

చిట్టితల్లీ నీతో అనుబంధం ముగిసిపోయింది.

అప్పుడే నూరేళ్ళ జీవితం గడిచిపోయింది.

ఎందుకింత దారుణమైన నిర్ణయం తీసుకున్నావో మాతో రెండుముక్కలయినా చెప్పిపోయావా? ఎంత ఘోరం జరిగిపోయింది.

ఏమ్మా! మేం నీ పట్ల అంత నిర్దయగా ప్రవర్తించామా?

మాపట్ల నీకంత అనుమానం ఎందుకు కలిగిందమ్మా?

'నా బాధ ఇది' అని ఒక్కముక్క చెప్పగలిగితే ఎంత బాగుండేది!

అయ్యో ఇప్పుడేమిటి చెయ్యటం?

ఏమిటి తల్లీ ఏమిటీ ఘోరం. నిన్న నీవు పాడినపాట ఇంకా నా చెవుల్లో మారుమ్రోగుతుంది.

నీ నవ్వులు నా గుండెల్లో ఉన్నాయి.

అమ్మా! నీ నడకలు....నీ కళ్ళు... నీ ఆప్యాయత

అన్నీ నీలోనే దాచుకొని వెళ్ళిపోయావా.... వెళ్ళిపోయావా....

నీ మీద కూలిపోయిన అమ్మ అలానే ఉండేమిటి?

చిట్టి తల్లితో కన్నతల్లీ నువ్వు వెళ్ళిపోయావా?

మీరిద్దరూ కలిసి వెళ్ళిపోతే నేనెందుకు బ్రతకాలో చెప్పమ్మా.... చెప్పు....

నా గుండెలేనా అంత పాషాణం!

# 3

ఇదే నా చివరిప్రయత్నం. ఇదికూడా విఫలం అయితే మరే ప్రయత్నం చెయ్యను. దూరంగా వెళ్ళిపోతాను. ఎక్కడో బ్రతుకుతాను. లేకుంటే ఈ ప్రపంచం నుండే తప్పుకుంటాను. అంతకంటే ఏం చేయను మరి!

నా దగ్గర డబ్బులు అయిపోవచ్చాయి. కొన్నాళ్ళు రిక్షా నేర్చుకొని రాత్రంతా రిక్షా త్రొక్కాను. నా ఖర్చులుపోను కొంత నిలవచేయటంకోసం ఎంతగా కష్టపడ్డానో తలుచుకుంటే నాకే ఆశ్చర్యం కలుగుతుంది.

ఇదివరలా కాకుండా ఇప్పుడు నా శరీరం, మనసు దృఢంగా ఉన్నాయి. రగులుతున్న పగ మూలంగా నే ఎలాంటి కష్టాన్నయినా ఎదుర్కోవటానికి సిద్ధపడ్డాను.

నేను నరసయ్యను కలవాలని నిర్ణయించుకున్నాను.

నరసయ్య పాముల్ని పట్టుకుంటాడని, ఎలాంటి పామునయినా క్షణాల్లో లొంగదీసుకుంటాడని అతనికి చెందిన ప్రచారంలో ఉన్నాయి.

నరసయ్య పాముకు మంత్రం వేస్తాడని, మంత్రం వేయగానే కదలలేని స్థితిలో ఉంటుందని—అప్పుడు పట్టుకుంటాడని కొందరంటే, మరికొందరేమో అసలు నరసయ్యకు పాము విషం ఎక్కదని, పాము నరసయ్యను

కరిస్తే పామే చచ్చిపోతుందని చెప్పుకుంటారు.

చిన్నప్పటినుండి నరసయ్య పాముల నడుమే పెరిగాడట. అతనిదగ్గర ఏదో వేరుందట. అందుచేతనే ఎలాంటి పాము కూడా కరవదట.

ఏది ఏమయినా ఒక విషయం మాత్రం నిజం. నరసయ్య చాలా పాముల్ని పట్టాడు. చాలామంది తమ తమ ఇళ్ళలో దొడ్లలో పాములు కనపడితే, వాటిని కొట్టడానికి ధైర్యం చాలకుంటే వెంటనే నరసయ్యకు కబురు చెయ్యమని అంటారు. నరసయ్యను పాములు పట్టేవాడంటారు. మిగతా సమయాల్లో ఏం చేసినా అదే ఆయన ప్రధాన వృత్తిగా ప్రచారం అయింది. ప్రవృత్తి రీత్యా విపరీతంగా తాగి ఆ మత్తులో మునిగిపోయి వుంటాడు.

నేను నరసయ్యను కలుసుకున్నాను. ముందుగా ఊహించినంత భయంకరంగా మాత్రం లేడు.

“ఏంటి పంతులూ” అన్నాడు.

నేను విషయం పూర్తిగా చెప్పలేను.

“నాకో పాము కావాలి” అన్నాను.

“పామా, ఎందుకు?” అన్నాడు.

“పనుంది” అన్నాను.

“పాముతో ఏ పనేందయ్యా పంతులూ” అన్నాడు.

నేను వెంటనే మాట్లాడకపోయేసరికి “ఎన్ని పాములు కావాలేటి” అన్నాడు అనుమానంగా.

“ఒక్కటిచాలు. అయితే కరిస్తేమాత్రం మనిషి చావాలి” అన్నాను.

నరసయ్య ఆశ్చర్యంగా చూశాడు.

“నరసయ్యగారూ మనం కొంచెం ఏకాంతంగా

మాట్లాడుకోవాలి" అన్నాను.

అత నేమనుకున్నాడో లేచి వచ్చాడు.

నేను మొత్తం నా కథంతా చెప్పాను.

"ఇదే నా చివరి ప్రయత్నం. నా పగ చల్లారాలంటే నువ్వు సహాకరించాలి" అన్నాను.

"సర్లేపంతులూ" అన్నాడు నరసయ్య.

నాకూ చాలా ఆనందం కలిగింది. నరసయ్య వెంట నే అంగీకరించగలడని నేను భావించలేదు. చిట్టితల్లి మరణం గురించి నేను వర్ణించటం, నవీన్ విషయంలో నేను చూపిన దయ అతన్ని అంగీకరించేట్లు చేశాయనుకుంటాను.

"పాములు దొరకటం లేదయ్యాపంతులు....మంచి పాము కావాలంటే కానా ఖర్చయిపోద్ది" అన్నాడు ఖచ్చితంగా.

నరసయ్య ఆ విధంగా డిమాండ్ చెయ్యటంకూడా సరయిందే. మన దేశంలో ఉన్న పాముల రకాల్లో విష పూరితం అయినవి కేవలం అయిదారు రకాలకు మించి ఉండవు. వాటన్నింటిలోకి శక్తివంతమయినది త్రాచు. వాటిలో నల్లత్రాచు, గోధుమవర్ణత్రాచు ఉన్నాయి. వీటికంటే ప్రమాదకరమైన పాము "కోబ్రా". అది దక్షిణాఫ్రికా అడవుల్లో ఉంటుంది.

'కోబ్రా' కాటుకు గురయితే బ్రతకటం అసంభవం. మనిషి మరణించటానికి అవసరమయిందానికంటే మూడు రెట్లు ఎక్కువ విషం ప్రొడ్యూసవుతుంది.

భయంతోగాని, మరోకారణంతోగాని మానవుడు పాముల్ని నాశనం చేస్తున్నాడు. రాను రానూ వాటి సంఖ్య తరిగిపోతోంది. ప్రధానంగా పాము చర్మాల ఎగు మతి వివిధ మార్గాల్లో జరుగుతోంది. వాటికి విదేశాల్లో

విపరీతమైన గిరాకి ఉంది.

పాము విషానికి కూడా ఎంతో గిరాకీ ఉంది. కొన్ని ఔషధాల తయారు చేయటానికి ఈ విషయం వినియోగిస్తారు. పాము విషానికి విరుగుడుగా పాము విషాన్నే వినియోగిస్తున్నారు. ఏ రకంగా చూసినా పాము విలువయినదే.

పాముకు పగ ఉంటుందా, ఉండదా అని చర్చించబడుతున్న కాలంలో నేను పాము ద్వారా పగతీర్చుకోబోతున్నాను. నిజానికి నాకు పామంటే చచ్చేంతభయం. జర జర పాక్కుంటూ పోతుంటే దూరంనుండి చూస్తేనే నా శరీరం జలదరించేది.

అలాంటిది నా పగ తీర్చుకోవటం కోసం పాముల్నే ఆశ్రయించటం ఎంత విచిత్రం!

"రెండు రోజుల తర్వాతరా" అన్నాడు నరసయ్య.

"ఈ విషయం మూడోకంటికి తెలియకూడదు" అన్నాను.

"నీకా దిగులొద్దు" అంటూ అభయహస్తం ఇచ్చాడు.

నేను నరసయ్య చేతిలో వందరూపాయలుంచి వచ్చేశాను. నా మనసు ఓ ప్రక్కన పీకుతూనే ఉంది. ఈ వంద తీసుకొని త్రాగి పడుకుంటాడేమో, లేక ఏదో చెత్త పామును తెచ్చి తీసుకెళ్ళమంటే నేనేం చెయ్యాలి?

చిట్టితల్లీ .... నా నిరీక్షణ ఫలిస్తుందా?

నా పగ చల్లారుతుందా?

## 4

చిట్టితల్లి ఫొటోవంక తదేకంగా చూస్తూ పడుకున్నాను.... సంవత్సరాల క్రితం.... జ్ఞాపకాలు....రీలులా.

చిట్టితల్లి ఫొటోలోనుండి ఎంత హాయిగా నవ్వుతుందని.

ఎంత నిర్మలంగా చూస్తుందని. ఆ కళ్ళు పాపగా ఉన్నప్పుడు తీసిందది. అదంటే నాకెంతో ఇష్టం. అలాంటిది ఈ రోజు చిట్టితల్లి నా ముందు లేదు.

చిట్టితల్లి రాసిన చివరి లేఖ నా కళ్ళముందు మెదిలింది.

అన్నయ్యా,

నీకు నేను రాస్తున్న మొదటి - చివరి లేఖ ఇదే కావటం ఎంత దురదృష్టకరం. నా పెళ్లయ్యాక నిన్ను మా ఇంటికి ఆహ్వానిస్తూ లేఖ రాయాలని ఎంతో ఆశపడుతుండేదాన్ని. కానీ ఇలా రాస్తు న్నాను.

మీరిచ్చిన స్వేచ్ఛ నన్ను పతనం చేసింది. అంత మాత్రాన స్వేచ్ఛ ఇవ్వటం మీ తప్పని నేననను. ప్రతి మనిషికి కూడా స్వేచ్ఛ అవసరం. స్వేచ్ఛ లేని జీవితాలకంటే మరణమే మేలు. ఇది నా దృఢాభిప్రాయం. ఆ స్వేచ్ఛ ఇతరులకు ఇబ్బంది కలగకూడదు. ఇతరులకూ స్వేచ్ఛ వుంటుందనే భావాన్ని విస్మరించకూడదు.

నేను చాలా తర్కబద్ధంగా రాస్తున్నా ఈ లేఖ. నా చెల్లి తెలివిగలదని నీవు అనుకోవచ్చు. నువ్వనుకోవటం కాదు. నేనే చాలా తెలివిగల దాన్ననే భావం ఈ లేఖ రాస్తుండేక ముందు దాకా నాకుంది. నేను చాలా సినిమాలు చూశాను. అనేక ప్రేమ కథలు నవలలూ చది వాను. బహుశా నా జీవితంమీద వాటి ప్రభావం విపరీతంగా పడి ఉండవచ్చు. నేను ఎప్పటికప్పుడు నన్ను పరీక్షించుకుంటున్నా అగాధాల్లోకి జారి పోయాను. నా తెలివితేటలు యేమైపోయాయి!

అసలు తప్పెక్కడ జరిగింది?

రవితో నా పరిచయం ఓ కుట్రని నాకు ముందుగా తెలియదు. ఈ దేశంలో యువతుల్ని ఆకర్షించటానికి పురుషులు ఎన్నెన్ని పాట్లు పడతారో కొన్ని సినిమాల్లో చూసి వాస్తవానికి దూరంగా ఉండేవనుకునేదాన్ని. కానీ ఇప్పుడనిపిస్తోంది. సినిమాలు చూసి యువకులు ఇలా అవుతున్నారా? ఇలాంటి వారిని చూసి సినిమాలు తీస్తున్నారా అని.

రవిని నేను ఎందుకు ప్రేమించాను అని ఈ రోజు ప్రశ్నించుకుంటున్నాను. అతనిలో అందముంది - కళ్ళు తిరిగిపోయేంతగా. అదే నన్ను ఆకర్షణలోకి దింపలేదు. అతనిలో ఇంకా కొన్ని లక్షణాలున్నాయి. ఇవన్నీ అమాయకురైన, కానీ తెలివిగలవారైన ఆడవారిని సైతం మాయ చేయటానికని తెలుసుకుంటుంటే నాకు శరీరం కోపంతో, బాధతో దిగ్భ్రాంతితో జలదరిస్తోంది.

ఓ వ్యక్తిని బలిచేయటానికి తమలోని ఆకర్షణనూ, అందాన్ని, కళల్ని వినియోగించుకోవటం ఆధునికం కావచ్చుగాని, పతనమైపోతున్న జీవితపు విలువల్ని సూచిస్తున్నాయి. ప్రేమకు, కామానికీ నడుమ వున్న గీతను చెరిపేస్తున్న ఈ తరం ఇలానే వుంటే ఈ దేశానికి భవిష్యత్ ఉండదు.

నా సమస్య నేను పరిష్కరించుకోలేక మరో మార్గం వెతుక్కుంటున్న అతి తెలివిగల యువతిని నేను. అయినా నేను దేశ భవిష్యత్ గురించి

కూడా రాస్తున్నాను. ఇంత గొప్ప అవగాహన గల నీ చిట్టితల్లి ఓ పురుషుడి అందాల ఆకర్షణల గోతుల్లోపడి.... గర్భం తెచ్చుకుందంటే నువ్వెంతగా శోకిస్తావని .... అమ్మెంతగా తల్లడిల్లిపోతుందని నేనూహించనా....

కానీ నా ఓటమి నన్ను వెక్కిరిస్తోంది.

నాది కూడా పాత కధ.... చాలా పాత కధ. కనీసం సీసా కూడా కొత్తది కాదు. రవికి ప్రేమంటే పడక గదని, ఆడదంటే కామాన్ని పంచే వస్తువని చాలా తేలిక భావాలున్నాయని నాకు తెలిసేటప్పటికి యెంతో ఆలశ్యమైంది. ఇప్పటిదాకా నేనెంతో మధురంగా దాచుకున్న అతని జ్ఞాపకాలు.... నాటకాలు యెంత హేయమైనవో తెలుసుకొని వాటినుండి వెంటనే బయట పడాలనుకుంటున్నాను.

నాకు తెలుసు. రేపీలోకం నామీద వ్రేలెత్తి చూపిస్తుంది. ఈ రవిలాంటి సవాలక్ష మగవాళ్ళు నేరమంతా నాపైకే నెట్టేస్తారని. ఒక స్త్రీ పొందుకోసమే రకరకాల పద్ధతుల్ని అనుసరించే ఈ మగవాళ్ళను, ఏ పొందుకోసమైతే ఎంతగా దిగజారిపోతారో అవసరం తీరాక అంతగా అవహేళన చేసే ఈ జాతిని నా మరణంతో శపిస్తున్నా....

నేను తప్పుచేశాను. నిజమే. కాదనటంలేదు. కానీ ఓ గుడ్డి నమ్మకంతో ఓ అనుభూతితో, ఆ తీవ్రతలో నేను పొరబడ్డాను.

అయితే అనేక కధలలానే నా జీవితానికి

ముగింపు ఏమిటి? అమ్మను తలుచుకుంటే నేను కంపించిపోయాను. ఎక్కడికైనా దూరంగా వెళ్ళిపోయి బ్రతకాలనుకున్నాను. తిరిగి నా బిడ్డను ఈ సమాజం యెలా ట్రీట్ చేస్తుందో నాకు తెలుసు.

ఆత్మహత్య యెంత నేరమో నాకు తెలుసు. అయినా నాకీ పరిష్కారమే సరయిందనిపించింది. ఈ లేఖ ఇంతటితో ముగిస్తే నీకు అన్యాయం చేసిందాన్నవుతాను.

'రవి' అడ్రసు ఇస్తున్నాను. అయితే ఈ లేఖను ఆత్మహత్య తర్వాత 'రవి'ని ఏమైనా చేయటానికి ఉద్దేశించి రాయటంలేదు. నాకీ సమయంలో ప్రపంచాన్ని విడిచిపెట్టి వెళ్ళాలని తప్పించి మరే ఆలోచనాలేదు. ఈ విషయం తెలిస్తే రవి తనవల్ల ఓ స్త్రీతోపాటు ఈ ప్రపంచంలోకి సగర్వంగా స్వేచ్ఛా వాయువులు పీలుస్తూ రావలసిన ఓ బిడ్డ బలయిపోయినందుకు పశ్చాత్తాప పడితే....అతని కళ్ళ నుండి కన్నీటిబొట్లు రాలిస్తే నేను చేసింది తప్పేనని.. నేరమని అంగీకరిస్తున్నాను.

కానీ రవి నేరమంతా నాపై నెట్టి, నాతోపాటు ఈ స్త్రీ జాతిని అవహేళనచేస్తే తన తప్పును సమర్థించుకుంటానికి గంభీరమైన సమర్థనలు వెతికితే..మరోసారి సాహసిస్తున్నాను. క్షమించు.

ఈ దేశం తగలబడిపోతుంది.. స్త్రీల హత్యల్లో ఆత్మహత్యల్లో....దహనాల్లో....

నీ చిట్టి తల్లి చివరి కోర్కె అది!

రవి ఏడ్చినా....ఏడ్వకపోయినా

నువ్వు మాత్రం గుండెలు పగిలిపోయేలా యేడు

స్తావని నాకు తెలుసు........చాలా రాశాను....

అమ్మమ్మా .. నీకూ నేను అన్యాయంచేసి పోతు

న్నాను.

నీ చిట్టిచెల్లెలు,

జ్యోతి."

"జ్యోతీ" బిగ్గరగా అరిచాను.

గదంతా గాఢాంధకారం. కరెంట్ పోయింది

కాబోలు....నాకు చెమటలు పట్టేశాయి.

జ్యోతిని నా చెల్లెలుగా భావించటంలేదు. ఆమెను

దారుణంగా హత్యచేసిన రవిలాంటివారు ఈ మరణం పట్ల

యెలా ప్రవర్తిస్తారో నేనూ తెలుసుకోవాలి.

ఈ లేఖ చదివాక నాకు యేడుపు రావటంలేదు. నా

కళ్ళలో నీరు అప్పటికే ఇంకిపోయిందేమో!

వెంటనే రవి ఇంటికి వెళ్లాను.

బజర్ నొక్కాను. లోపల మ్రోగటం, వెంటనే

ఎవరో నడిచివస్తున్న సవ్వడి వినిపించింది. తలుపు తెరుచు

కుంది....

"ఎవరండి" అంది ఆమె.

"రవీంద్ర ఉన్నారా?"

"ఉన్నాడు."

"కాంచెం పిలుస్తారా?"

"స్నానం చేస్తున్నాడు. లోపలకు రండి" అందామె.

నేను లోపలకు వెళ్లాను. అక్కడ వున్న కుర్చీలు

చూపించి "కూర్చోండి" అని ఆమె లోపలకు వెళ్ళి

పోయింది. ఆమె బహుశా రవి తల్లి కావచ్చు.

పదినిమిషాల తర్వాత అతను వచ్చాడు.

"ఎవరు?" అన్నాడు.

చూట్టానికి చాలా చక్కగా ఉన్నాడు. చిట్టితల్లే కాదు. ఎవరయినా అతన్ని చూడగానే వెంటనే దృష్టి మరల్చుకోరు.

"నేను....కొంచెం బయటకెళ్దాం!"

"డెఫినెట్లీ....మీ రెవరో?" అన్నాడు రవీంద్ర సగంలో ఆపి.

"జ్యోతి అన్నయ్యని"

"జస్టేమినిట్" అంటూ రిస్పెనలోనికి వెళ్లాడు.

"కమాన్. లెట్స్‌గో" అంటూ ముందుకు నడిచాడు.

మరో నిముషంకల్లా అతను మోటారు సైకిల్ స్టార్ట్ చేశాడు.

"కూర్చోండి" అన్నాడు.

నేను మాట్లాడకుండా వెనక కూర్చున్నాను.

"ఎంత ధైర్యం" అనుకోకుండా ఉండలేకపోయాను.

దగ్గర్లో వున్న ఓ పార్కు దగ్గరికి తీసుకెళ్లాడు. బండి పార్క్ చేశాక చిన్న కొలనుదగ్గరకు తీసుకువెళ్లాడు. అక్కడ ఎవరూ లేరు.

నేను చిట్టితల్లి రాసిన లేఖ అతనికిచ్చాను.

మౌనంగా అందుకొని చదివాడు. చదువుతున్నప్పుడు అతని భృకుటి ముడిపడటం నేను గమనిస్తూనే ఉన్నాను. అంతకు మించి ఆ ముఖంలో తప్పుచేశానన్న భావంగానీ, పశ్చాత్తాపంగానీ రేఖా మాత్రంగానైనా లేదు.

"చిట్టితల్లికి మూడో నెల"

"చెప్పింది"

"ఆ బిడ్డకు తండ్రివి నువ్వు"

"అందుకే ఎబార్షన్ చేయించుకోమన్నాను"

"అది నేరం."

"ఎబార్షన్ చట్టసమ్మతమే" అన్నాడు రవీంద్ర.

"చిట్టితల్లి మందుబిళ్ళలు మింగింది"

రవీంద్ర మాట్లాడలేదు.

"చిట్టితల్లి చచ్చిపోయింది" కంఠం వణికింది.

నిశ్శబ్దం....!

"నువ్వే చంపావ్" అరిచాను.

రెస్పాన్స్ లేదు.

"నా చెల్లి నెందుకు మోసం చేశావ్?"

"నీ చెల్లే రాసిందిగా"

"నిన్నింత ఈజీగా వదలను"

"ఏం చేయాలని" సూటిగా అడిగాడు.

ఏం చేస్తానని చెప్పను? అతనంత సూటిగా అడిగే టప్పటికి షాక్ తిన్నాను.

"ఆ లేఖ పోలీసులకు ఇస్తాను. నిన్ను కటకటాల వెనక్కి పంపేదాకా నిద్రపోను" అన్నాను ఆవేశంగా.

మరుక్షణం నా మొఖం అదిరిపోయింది.

నా కళ్ళముందు మెరుపులు కనిపించాయి.

బలంగా మొఖం మీద చరిచేటప్పటికి నా ముక్కు అదిరిపోయి రక్తం బొటబొట కారటం మొదలయింది. ఆ విసురుకు క్రిందపడ్డాను. పడి అలానే చూస్తుండి పోయాను.

జేబులో నుండి లైటర్ తీశాడు.

చిట్టితల్లి లేఖ ఓ చేతిలో వుంది.

లైటర్ నుండి జ్వాల మాసుకొచ్చింది.

కాయితాలకు అంటుకున్న మంటలు ఎగబ్రాకుతున్నాయ్. నా 'జ్యోతి' స్వయంగా రవి చేతుల్లో తగలబడిపోతున్నట్లనిపించింది. క్రిందినుండి లేవకుండా ఆ దృశ్యాన్నే చూస్తున్నాను.

అప్పుడప్పుడు గాలి వీస్తోంది.

దాంతోపాటు ఆ కాగితాల బూడిద కొట్టుకోపోతోంది.

నేను కేవలం బెదిరించటానికన్నాను.

అప్పటిదాకా కూడా నా చెల్లి మరణంపట్ల దుఃఖం తప్పించి నాలో ప్రతీకారభావం లేదు.

మొదటిసారిగా నాలోని దానవుడు నిద్రలేచాడు!

రవి నడుముకు కట్టుకున్న చైన్ తీశాడు.

“దీంతో నీ తలమీద కొడితే ఏమవుతుందో తెలుసా? రెండు ముక్కలవుతుంది. అప్పుడు ఛస్తావ్. ఇప్పుడు నిన్ను ఈ కొలనులో గొంతుపిసికి పారేస్తాను. దిక్కెవరు? నాకు ప్రేమించటం, వాడుకొని విసిరేయటం, కాలరెత్తుకు తిరగటం ఎలాగో కూడా తెలుసు. నువ్వు నీ చెల్లెలికి పాఠాలు నేర్పుకుంటే నీకీ స్థితి వచ్చేదికాదు. ఆడది వస్తానంటే నువ్వు కాదంటావా? ఈ కవిత్వం నీ చెల్లికి ముందే వుండాల్సింది. నేను మీ చెల్లిని చావమనలేదు. కడుపు తీయించుకోమని చెప్పా....ఆ తర్వాత ఎవడో ఒకడ్ని కట్టుకోమని చెప్పా. నేను పరిచయమయిన వారందరినీ కట్టుకోవాలంటే నాకు సాధ్యం కాదు. అర్థమయిందా.”

నా గుండెలు వేగంగా కొట్టుకొంటున్నాయి.

“ఈసారెప్పుడైనా నాకు కనపడ్డా. పిచ్చివేషాలు వేసినా జాగ్రత్త. నా మోటార్ సైకిల్ తో గుద్ది చంపే

స్తాను. నువ్వు పోలీసుల దగ్గరకు వెళదా మనుకుంటున్నా వేమో. మీ చెల్లి ఆత్మహత్య చేసుకోనిటాకి నువ్వే కారణం అని నేను రుజావు చేయిస్తా....జాగ్రత్తగా ఉండు" అనేసి వెళ్ళిపోయాడు.

నేలమీద మసిమరకలు!

'చిట్టికల్లీ దారుణంగా మోసపోయావమ్మా!'

# 5

రవి చెప్పింది కూడా నిజమే. నాకున్న ఒకేఒక ఆధారం ఆ లేఖ. అది కాలి బూడిదయిపోయాక నేనేం చేయగలను. నా చెల్లిని చంపిన హంతకుడు నా కళ్ళ ముందే తిరగటం కాకుండా నన్ను బెదిరించి మరీ వెళ్ళాడు.

నా చెల్లి మరణానికి నేను కారణమని రుజావు చేస్తాడట. ఎంతటి నీచమైన ఆరోపణ!

నాకు వెంటనే రంగారావు మదిలో మెదిలాడు.

రంగారావు గురించి వినటమేగాని నాకు పరిచయం లేదు.

రంగారావు ఆ పట్టణంలో పేరున్న రౌడి. అతన్ని అలా పిలవటం కూడా సరయింది కాదేమో. అతను తన కంటూ ఓ వర్గాన్ని నిర్మించుకున్నాడు. అతినికి రాజకీయ పార్టీలో సంబంధాలున్నాయి. అత్యంత విలాసవంతమైన జీవితాన్ని గడుపుతుంటాడని చెప్పుకుంటారు.

రంగారావు తన బృందంతో బయలుదేరితే వ్యాపారస్థులు వేలాది రూపాయలు చందాగా ఇస్తుంటారట. సంవత్సరాని కింతని చెప్పి ఆయనకు వాటాలు వెళుతుంటాయి. ఇలాంటిదే మరో గ్రూపు పట్టణాలో వుంది. అవి రెండూ అస్తిత్వం కోసం పోరాడుతుంటాయి.

అందుకే తరచుగా పట్టణంలో కొట్లాటలు, హత్యలు కూడా జరుగుతుంటాయి. ఆయా సందర్భాలలో రంగారావు పేరు వినిపిస్తుంది తప్ప అతనేనాడు అరెస్ట్ కాలేదు. అయినా చాలామంది నాకో విషయం చెప్పారు.

రంగారావుకు స్త్రీపట్ల గౌరవం వుందట.

ఆడపిల్లల పట్ల అసభ్యంగా ప్రవర్తించేవారిని అంత తేలిగ్గా విడిచిపెట్టడట. కట్నం చాల్లేదని పీటలమీద ఆగిన పెళ్ళిళ్ళు ఆయన చేయించాడని, అలాగే కట్నం కోసం హింసించేవారిని కఠినంగా హెచ్చరించేవాడని చెప్పటంతో నాకు రంగారావును కలుసుకోవాలనిపించింది.

మొత్తంమీద ఎలాగో రంగారావును కలిశాను.

నా కథంతా చెప్పాను. విన్నాడు. ఆ తర్వాత రవి గురించి చెప్పాను.

"నా చెల్లి చచ్చిపోయింది. అదిచూసి భరించలేక నా తల్లి గుండాగిపోయింది. నేను ఏకాకినయ్యాను. ఒక స్త్రీకి జరిగిన అన్యాయం ఇది. కానీ అతనిలో ఏ కోశాన పశ్చాత్తాపం లేదు. అతను ఇంతటితో తన పద్ధతిమార్చుకోవటం లేదు. అంటే ఇంకెంత మంది జీవితాల్లోనో అతను ఆడుకోబోతున్నాడు. నా చెల్లికి జరిగిన అన్యాయం మరో స్త్రీకి జరగకూడదు" అని చెప్పాను.

రంగారావు తలూపాడు.

నేను బయటకు వచ్చేశాను. రంగారావ్ అనుచరులకు గట్టిగా చెప్పాను.

"మీరెలా అయినా ఆయన్ని ఒప్పించండి. రవికి బుద్ధి చెప్పండి."

"సర్లే" అన్నారు వారంతా.

వారికి నేను పార్టీ చేశాను. జీవితంలో అంతగా త్రాగేవాళ్ళను చూడటం అదే మొదటిసారి. ఎంత త్రాగారో, ఎంత తిన్నారో నేను పరిశీలించలేదు. బిల్లు చూసేసరికి నాకు మతిపోయింది. అయినా ఫర్వాలేదు. ఈ దెబ్బతో రవికి బుద్ధి వస్తుంది.

ఓ రకంగా కిరాయి ఇచ్చి రవితో తలపడుతున్నానని పించింది. ఆ విషయంలో నా అసమర్థత స్పష్టంగా కన పడుతూంది.

రెండు రోజుల తర్వాత రవి కనపడ్డాడు.

అదే చిరునవ్వుతో, అదే అహంకారంతో.

"ఏరా....రంగారావుతో చెప్పావట. అసలు రంగా రావెవరో ముందు తెలుసుకొని వెళ్లాల్సింది. నీకంత తెలివితేటలు వుంటే బాగానే ఉండేది. నువ్వు నన్నేం చెయ్యలేవు. నీ చేతికి కత్తిస్తాను, పొడిచి చూడు" అన్నాడు జేబులోనుండి బటన్ నైఫ్ తీస్తూ.

నాకు తిరిగి వెర్రిగా చూడటం మినహాయించి అవ యవాలు కదలటంలేదు

"ఇంత వెర్రి వెధవకి కోపమెందుకురా. నువ్వు రక్తం చూస్తేనే గుండాగి చచ్చిపోయేటట్లున్నావు. ఇంక నా ప్రాణం ఏం తీస్తావు? మర్యాదగా చెబుతున్నాను. మరో రెండు వారాల్లో నువ్వీ వూర్లో యెక్కడ కనబడ్డా నీ శవం మాత్రమే మిగులుతుంది."

రవీంద్ర వెళ్ళిపోయాడు.

నాకు విస్మయం, దుఃఖం, కసి, బేలతనం, అన్ని భావాలు ఒకే సమయంలో కలిగాయి.

పరిగెత్తుతుంటూ రంగారావు దగ్గరకెళ్ళాను.

అతను నొసలు చిట్లించి నా వంక చూశాడు.

"సార్" అన్నాను యేమనాలో తెలీక.

నాకయితే ఎన్నెన్నో మాటలు జలపాతంలా వర్షించాలనుంది.

"వాడు మనకు కావల్సినవాడయ్యా" అన్నాడు రంగారావు.

"మనకు కావాల్సిన వాళ్ళు నేరాలు చెయ్యొచ్చా" నా కళ్ళు ప్రశ్నించాయి.

"అయిపోయిందేదో అయిపోయింది. ఇప్పుడు ఎవరూ చేయగలిగింది లేదు. వాడికి చెప్పాలే" అన్నాడు రంగారావు.

ఆ తర్వాత అతను మాట్లాడలేదు.

నేను గుటకలు మ్రింగుతూ నిలబడ్డాను.

ఆ నిశ్శబ్దం నన్ను వెళ్ళవచ్చని శాసించింది.

వెనక్కి తిరిగి వచ్చేశాను.

మరో ప్రక్క రవి చేసిన హెచ్చరిక వినపడుతోంది.

నేనెంత అసమర్థుడిగా ఉండిపోయాను. నా చెల్లి, తల్లి మరణానికి కారణమయిన వ్యక్తిని అటు చట్టానికి లొంగేలా చేయలేకపోయాను. నేనూ ఏమీ చేయలేక పోతున్నాను.పగతీర్చుకోవటం ఆ నేవిషయంలో మొదట్లో నాకంత పట్టుదల లేదు. రవీంద్ర నన్ను రెచ్చగొట్టాడు. అతని అహంకారం నన్ను ఉన్మాదిగా మార్చాయి.

ఏడు సంవత్సరాలు గడిచిపోయాయి—

ఈ నడుమ కాలంలో నా జీవితానికి చెందిన ప్రధాన మార్పులన్నీ ఈ సంఘటనతోనే ముడిపడ్డాయి. ఈ సంవత్సరాలన్నింటా నేను మౌనం పాటించాను. అదెంత కష్టతరమైన విషయమో. అయినా నేను పగనుండి యే

మాత్రం దూరం కాలేదు.

మాకున్న ఒకే యిల్లు అమ్మి ముందు ఆ వూరు విడిచి పెట్టాను. రవి నా విషయం పూర్తిగా మరిచిపోయాడు. నాకదే కావాలి. నన్ను గురించిన యెలాంటి అనుమానం లేని రోజున నేను కార్యక్రమం మొదలు పెడతాను.

రవి దృష్టిలో నేను అర్భకుడ్ని. ఏమీ చెయ్యలేని వాడిని. పగ తీర్చుకుంటానని నేనంటే విరగబడి నవ్వు తాడు కూడా. రవికి నాలాంటి శత్రువులు అనేకమంది వున్నారు. నేనేం చేసినా వెంటనే అనుమానం రాదు.

నేను ఊరినుండి వెళ్ళిపోయినా నా దృష్టి అంతా రవిమీదే. అతనికి చెందిన వివరాల్ని సేకరించాను. అతనికి పెళ్ళికావటం, పిల్లలు పుట్టడం తెలుస్తూనే వుంది.

నేను పగతీర్చుకునే మార్గంలో మొదట ఎన్నుకొంది డైరక్టుగా దాడిచేసే పద్ధతి. టైం బాంబులు రెండు సేకరించి వాళ్ళింటిలో పెట్టాలనుకున్నాను. కానీ ఎందుకో ఆ పద్ధతి నాకు నచ్చలేదు. చివరి క్షణంలో విరమించు కున్నాను.

నాలో మానవత్వపు భావాలు యెక్కువగా వుండ టంతోపాటు జీవితంమీద తీపి ఎక్కువగా వుంది. నేను ఈ విషయంలో ఇప్పటిదాకా ఓడిపోతుండటానికి కారణం అదే. నాకీ ప్రపంచంలో ఎవరూ లేకపోయినా, నా జీవితంలో ప్రధాన భాగం, ఆవేశంలో ఖర్చయి పోతున్నా నాకు బ్రతకాలనుంది. అందుకే సాధ్యమై నంతవరకూ చట్టానికి దొరకకుండా నే బయటపడాలి.

ఒకటి మాత్రం ఒప్పుకుంటాను.

ఇదో రకమైన విచిత్రమైన ఆత్మహత్య.

# 6

నరసయ్య దగ్గరకు రెండు రోజుల తర్వాత వెళ్లాను.

నన్ను చూసి నరసయ్య నవ్వాడు.

"దొరికిందా" అన్నాను ఎక్సైట్ మెంట్ లో.

"ఎందుకయ్యా అంత తొందర" అన్నాడు.

నేను మాట్లాడలేదు.

"రాజాలాంటి పాము దొరికింది."

నా కళ్ళు సంతోషంతో వికృతంగా తళతళలాడాయి.

"ఏం చేస్తావయ్యా....బుట్టతో తీసుకెళ్ళి ఆ గదిలో జారవిడుస్తావా" అన్నాడు నరసయ్య.

"నీకు చెప్పటం మరిచిపోయాను. ఈ పామును పార్శిల్ చేయాలి" అన్నాను.

"పార్శిలా...."

"అవును. రెండు రోజులు బ్రతుకుతుందా?"

"రెండు రోజులా."

"అవును. ఈ రోజు పోస్టు చేసినా చేరేనాటికి రెండు లేక మూడు రోజులు పట్టవచ్చు."

"సర్లే ఆ ఏర్పాటు నేను చూస్తాలే" అన్నాడు నరసయ్య.

గాలివచ్చే యేర్పాట్లతో పార్శిల్ చేయగలడని అన్నాను.

అయితే వెంటనే నాకు మరో అనుమానం వచ్చింది. పార్శిల్ చేశాక అది లేచి బుసలు కొడుతుంటే, పెట్టంతా కదులుతుంటే అనుమానం కలుగుతుందేమో!

ఆ విషయం కూడా నరసయ్యతో చెప్పాను.

నరసయ్య కూడా కొంచెంసేపు ఆలోచించాడు.

"సరే. ఆ విషయం కూడా నేను చూస్తాను. నువ్వేం అనుమాన పడకు" అన్నాడు.

ఇప్పుడు నాకు సంతోషం కలిగింది.

ఈసారి విజయం సాధించటం ఖాయం.

నా ప్రయత్నానికి నరసయ్య సహకారం లభించటం అదృష్టం. రెండు గంటలు నేను ఆలోచిస్తుండిపోయాను.

సరిగ్గా రెండు గంటల తర్వాత నరసయ్య పెట్టెతో వచ్చాడు.

అంతకుముందే నరసయ్య నన్ను పిలిచాడు. "పామును చూడవయ్యా పంతులూ" అన్నాడు.

నా జీవితంలో అంత వేగమయిన పామును, అంత దగ్గరనుండి చూడటం అదే మొదటిసారి.

సర్రున లేచి నిలబడింది.

నాకు అరికాళ్ళనుండి చెమటలు పుట్టుకొచ్చాయి.

నల్లగా నిగనిగలాడుతోంది.

దాని పడగ చూశాక అనుకున్నాను.

'నల్లత్రాచు.'

వయసులో వుందనుకుంటాను. అది కాటువేస్తే నిస్సం దేహంగా మనిషి చచ్చిపోతాడు.

'బుస' అంటే వినటమే గాని నేను విని ఎరగను.

మొదటిసారి విన్నాను. ఆ 'బుస'ను జీవితంలో మరిచి పోలేను.

నరసయ్య చెయ్యి మరింత వేగంగా కదిలింది.

నల్లత్రాచును వడిసి పట్టుకొని మూతవేశాడు.

నాకింకా గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి.

అలాంటి పాము పెట్టెలో పడుకుని ఉంటుందా అనే అనుమానం పీడిస్తూనే వుంది.

నరసయ్య మాత్రం ధైర్యం చెప్పాడు.

'నీకెందుకు చూసుండు' అన్నాడు.

మరేం చేశాడో తెలియదుగాని నరసయ్య నా చేతి లోకి ప్యాకెట్ ఇచ్చేటప్పటికి లోపల ఎలాంటి అలికిడి లేదు.

"ఇంకేం కారు. మరీ ఆలస్యమయితే అది చచ్చిపో గలదు" అన్నాడు నరసయ్య.

"మరీ ఆలస్యం కాదులే. అడ్రసు కరక్టుగా వుంది కాబట్టి జాగ్రత్తగానే వెళుతుంది" అన్నాను.

"నీ పనయితే ఫర్వాలేదయ్యా పంతులూ.... రెండు జిల్లాలవతలనుండి వచ్చావు" అన్నాడు.

నేను నరసయ్య చేతిలో అరువందలు వుంచాను.

తృప్తిపడినట్లే కనిపించాడు.

"నిజంగానే నా దగ్గర అంతకంటే లేవు. పనయితే సంతోషంగా కలుసుకుంటాను" అని చెప్పాను.

"దాందేముందిలే" అన్నాడు నరసయ్య.

నరసయ్య దగ్గర సెలవు తీసుకొని బయలుదేరాను.

ఆ పార్శిల్ నా చేత్తో పట్టుకోవటానికే భయంగా ఉంది.

అయినా తప్పదు కదా!

బస్సు త్వరగానే దొరికింది. ఎక్కాక కాళ్ళదగ్గర పెట్టుకున్నాను. అప్పుడుగాని నా గుండెదడ తగ్గలేదు.

నరసయ్యపట్ల నాకు కృతజ్ఞతాభావం మరింతగా పెరి గింది.

అతనే కారణంలో నాకు సహాయం చేసినా ఒక విష యంలో మాత్రం నేను నరసయ్యకా నిజం చెప్పలేదు.

నా పగకు చెందిన విషయాలన్నీ వాస్తవాలే. నా

ఊరి వివరాలే కల్పించినవి. ఆ మాత్రం జాగ్రత్త ఉండటం అవసరం అనుకున్నాను. ఇప్పుడు వెళ్ళి మెయిన్ పోస్టాఫీస్‌లో బుక్ చెయ్యాలి. అక్కడ ఎనిమిది గంటలదాకా వుంటారు. బస్సు ఏడుగంటలకు చేరుతుంది. రిక్షాలో వెళ్ళాలి.

ఆ పార్సిల్ రవి పేరుమీద బుక్ చేస్తున్నాను. అది రిజిస్టర్డు పార్సిల్. రవి సంతకం పెట్టి తీరాలి. సంతకం పెట్టి పార్సల్ అందుకుంటాడు.

ఫ్రమ్ అడ్రస్ ఏదో సృష్టించి రాశాను. ఈ పని పూర్తవటంతో నా రూపం పూర్తిగా మారిపోతుంది. నా మీసాలు, గడ్డం, తల వెంట్రుకలు ఏవీ వుండవు. నా దుస్తుల విషయంలో కూడా పూర్తి మార్పులొస్తాయి. ఆ తర్వాత నన్ను గుర్తుపట్టడం కూడా కష్టమే.

మామూలుగా అన్నీ నేననుకున్నట్లు జరిగి, రవి నల్ల త్రాచు కాటుకు బలయితే, అది ఎక్కడ పోస్టు చేయబడిందో ఎన్ని గంటలకు పోస్టు చేయబడిందో వివరాలు సేకరిస్తారు. అప్పుడు బుక్ చేయటానికి వచ్చినవారి రూపం గురించి కూడా పరిశోధన ప్రారంభమవుతుంది.

అందుకే అన్నివిధాలా జాగ్రత్తలు తీసుకుంటున్నాను. ఆ పార్శిల్ మీద నా వేలిముద్రలుగాని, నరసయ్య వేలిముద్రలుగాని పడకుండా తుడిచెయ్యాలి.

బస్సు స్టేషన్‌లో ఆగింది.

వెంటనే దిగాను. చేతిలో పార్శిల్‌తో చకచక నడుస్తుంటే రిక్షావాళ్ళు చుట్టుముట్టారు.

"రామ్‌నగర్" అన్నాను.

"మూడు రూపాయలిప్పించండి"

బేరం మాట్లాడే సమయం లేదు.

వెంటనే ఎక్కేశాను.

"తొందరగా పోనీ"

"అయ్యా"

రిక్షా వేగంగా నే తొక్కుతున్నాడు.

రామ్‌నగర్ వచ్చింది.

నాలుగు రూపాయలు చేతిలో వుంచాను.

"చిల్లర లేదండయ్యా"

"ఉంచుకో"

చక, చక రూంలోకి నడిచాను.

వేలిముద్రలు లేకుండా జాగ్రత్తగా తుడిచాను.

పార్శిల్ కోసం ముందే సేకరించిన స్టాంపులంటించాను. ఆ తర్వాత ఓ పేపర్ చుట్టి బయటకు వచ్చాను.

"రిక్షా....రిక్షా...."

"ఎక్కడికండి"

"పోస్టాఫీస్‌కు పోనీ"

రిక్షా కదిలింది.

నా ముఖంలో టెంక్షన్ కనపడకుండా వుండాలని విశ్వ ప్రయత్నం.

పోస్టాఫీసు ముందాగింది.

అయిదు రూపాయల కాయితం అతని చేతిలో పెట్టాను.

"ఉండు వస్తాను" అనేసి లోపలికెళ్ళాను.

ఆ క్యూలో నలుగురయిదుగురున్నారు.

నేను వెళ్ళి వారి వెనక నిలబడ్డాను.

క్లర్కు చకచక తీసుకుంటున్నాడు.

నావంతు వచ్చింది.

పార్శిల్ అందిస్తుంటే నా చేతులు స్వల్పంగా కంపిస్తున్నాయి.

అక్కడ కూర్చున్న వ్యక్తి రొటీన్‌గా వర్క్ చేసుకుపోతున్నాడు కాబట్టి సరిపోయింది. లేకుంటే నామీద అనుమానం వచ్చివుండేది. వేమెంట్ పూర్తయింది.

స్టాంపులు చూశాడు.

సరిపోయాయనుకుంటాను.

స్టాంప్ వేశాడు.

రశీదు కూడా నాకు ఇచ్చాడు.

ఆ పార్శిల్ తీసి ప్రక్కన పెట్టాడు.

అప్పటిదాక నా గుండె దడదడలాడుతూనే వుంది.

నా కార్యక్రమంలో ఓ అంకం ముగిసింది.

మెమ్మదిగా బయటకు వచ్చాను.

ఒకవేళ రవి ఊర్లో లేకపోతే?

అతను తిరిగి వచ్చేదాకా ఆ పాము బ్రతుకుతుందా?

అది వెళ్ళే వాహనాలు జాగ్రత్తగా వెళతాయా?

మామూలుగానే అయితే ఒక్కరోజులో చేరాలి.

రిజిస్టర్డు పార్శిల్ కాబట్టి రెండు రోజులు—

అంతకంటే ఎక్కువ అవసరం లేదు.

ఆలోచనలతో రెండురోజులు గడిచిపోయాయి.

తెల్లవారింది—

నాకు ప్రకంపనాలు మొదలయ్యాయి.

సరిగ్గా పదిగంటల తర్వాత పోస్టుమాన్ బయలుదేరుతాడు.

నేను ఫ్రమ్ అడ్రస్‌గా రాసింది వాళ్ళ బంధువులది.

రవి ఆశ్చర్యంగా పార్శిల్ తీస్తాడు.

ప్రచండ వేగంతో లేచిన నాగు అందుకొన్న కాటుకు చావుకేక ప్రతిధ్వనించగా....

భయంతో కొయ్యబారిపోతుంటే ....

నోటినుండి నురగలు కక్కుతుంటే....

జర, జర పాక్కుంటూ వెళుతుంది.

సంవత్సరాలుగా ఎదురుచూస్తున్న ఆ క్షణాలు ఈ రోజుతో సమాప్తం అవుతున్నాయి.

"అమరజీవి జోహార్"

నాకు సంతోషంగా వుంది.

వెంటనే ఆ ఊరెళ్ళి దూరంగా నిలబడి రవి ఇంటి ముందు గుమికూడిన ప్రజానీకాన్ని చూడాలని ఉబలాటంగా వుంది. ఆ కోర్కెను బలవంతంగా అణుచుకొంటున్నాను.

అత్యంత సంతృప్తిగా ఈరోజు గడిచిపోయింది.

ఎందుకో నాకు ఆ నల్లత్రాచుమీద విపరీతమైన నమ్మకం పెరిగిపోయింది.

తనను రెండురోజులుగా బంధించారన్న ఆవేశంతో వుంటుంది.

పార్శిల్ తియ్యటం ఆలశ్యం....

ఆ వేగం నా కళ్ళముందు ఇంకా కన్పిస్తూనే వుంది.

## 7

వెంటనే ఈ వార్త పేపర్లో రాగలదని నేను భావించక పోయినా, మరుసటి రోజునుండే అన్ని పేపర్లూ చదువుతున్నాను. సాయంకాలందాకా లైబ్రరీలో వుండి అన్ని పేపర్లనూ మొదటినుండే చివరిదాకా చదివాక లేచే వాడ్ని కాదు.

ఇలాంటి వార్తలు ముందు అన్ని పేపర్లలో రావు. ఓ పత్రిక ముందు ప్రచురిస్తే, ఆ తర్వాత అందరూ ప్రచురించటం చేస్తారు.

రెండు రోజుల తర్వాత....

ఎదురు చూస్తున్న ఆ వార్త రానే వచ్చింది.

"రిజిస్టర్ పార్శిల్లో నల్లత్రాచు!
ఒకరి మరణం!!"

నా చేతిలో పేపర్ వణకటం నాకు స్పష్టంగా తెలుస్తోంది.

"ఇక్కడకు బి. రవీంద్ర అనే పేరుతో బుక్ చేయబడ్డ రిజిస్టరు పార్శిల్ అనుమానాస్పదంగా కనిపించటంతో తెరుస్తుండగా, అందులోని నల్లత్రాచు కాటుకు పోస్టల్ ఉద్యోగి ఒకరు మరణించారని తెలుస్తోంది. వెంటనే ఆ పామును చంపివేయటం జరిగింది. ఈ విషయం మీద దర్యాప్తు జరుగుతోంది...."

నా కళ్ళను నేను నమ్మలేకపోయాను!

ఆ క్రింద ఈ వాక్యంతో ఆ వార్త ముగిసింది.

"అయితే ఏ ఉద్దేశ్యంతో ఈ పార్శిల్ పంపబడిందో అది యాదృచ్ఛికంగా నిరవేరటం గమనార్హం. ఈరోజు ఉదయం జరిగిన రోడ్డు ప్రమాదంలో రవీంద్ర మరణించారు!"

ఒక్కటి మాత్రం నిజం.

పోస్టల్ వారు అనుమానంతో కాదు తీసింది.

కక్కురితో....

అనుమానంతో నే తీసుంటే__

**153**

ఒకరి మరణం సంభవించేది కాదు....

దర్యాప్తు జరగవలసింది——

పార్శిల్లో పాముగురించి కాదు!

పోస్టల్ వారికి ఇతరుల వస్తువులమీద ప్రేమెందుకనే విషయం మీద!

——: అయిపోయింది :——

సీరియల్

# అగ్ని [illegible]

## ప్రతాప రవిశంకర్

(గత సంచిక తరువాయి)

అరుపులు — కేకలు — ఆర్తనాదాలు....

కసికొద్దీ నరుకుతున్నారు టకారాజాతి మనుషులు. ఎవర్నీ ప్రాణాలతో బందీలను చేసే ఆలోచనే వాళ్ళకు వున్నట్టుగా తోచలేదు.

తమ కపాచీ దేవత మెళ్లో వున్న మణినే నాగరికులు కాజెయ్యబోతున్నారనేసరికి వాళ్ళ ఆగ్రహానికి అంతు లేకుండాపోయింది.

నాయకుడు ఏవో ఆజ్ఞలను జారీచేస్తున్నాడు.

తన చేతికి దొరికిన మనుషులను బల్లెంతో కసికొద్దీ పొడుస్తున్నాడు.

పులి గురించిన భయం వాళ్ళలో యే ఒక్కరికీ లేదు. దాని గురించి వాళ్ళకు బాగానే తెలుసు. అది ఆహారం కోసమే దాడిచేసింది. ఆహారం దొరకగానే దాన్ని

అక్కడినించి దాని నివాసం దగ్గరకు లాక్కు వెళు తుంది.

వాళ్ళు అనుకున్నట్టుగానే ఓ మనిషిని గొంతు పట్టుకుని ఈడ్చుకుంటూ చెట్లమధ్యనించి చీకట్లోకి పరుగుదీసింది.

చీకట్లో ఎవరు ఎవరో టకారాలకు తెలీటంలేదు. అందుకే అంతా దొరికారనే అనుకుంటున్నారు. పులి రాకుండా వున్నట్లయితే నాగరికులు అంతమందీ టకారాలకు దొరికేవాళ్ళు కాదేమో!

• • •

వెనుకనించి చావుకేకలు ముందు పరుగుదీస్తున్న భారత్ కి—సెల్లాకు లీలగా వినపడుతున్నాయి. అప్పటికే వాళ్ళు చాలా దూరం పరుగుదీశారు. వాళ్ళ వెనుకగా ఇంకెవరూ పరుగెత్తుతున్న అడుగుల చప్పుడు వినపడక పోవటంతో—

"దురదృష్టం .... అంతా ఆ నరరూప రాక్షసులకు దొరికినట్టున్నారు" అన్నాడు భారత్.

"అవును. పులి గురించి భయపడి ఆగిపోయారు. ఇంత లోనే వాళ్ళు వచ్చేశారు. చివరకు మనిద్దరమే వాళ్ళ నించి తప్పించుకు రాగలిగాం" అన్నది సెల్లా.

"చావైనా, బతుకైనా అంతా కలిసికట్టుగానే అను కున్నాం. ఐనా అలా జరగలేదు. చివరకు వాళ్ళు భయ పడినంతా జరిగింది. ప్రాణాలు పోగొట్టుకున్నారు. మిజర బుల్. ఆ టకారాలు ఒక్క మనిషిని కూడా ప్రాణా లతో వదలరు. వాళ్ళకు జాలిలేదు."

పరిగెత్తుతూనే మాట్లాడుకుంటున్నారు.

ఇంకొంచెందూరం పరుగుదీస్తే ఆ పొడుగాటి చెట్లు అంతం అయిపోతాయి.

"బుస్....స్....స్."

తక్కున ఆగిపోయాడు భారత్ —

"స్టెల్లా....ఆగిపో" అరిచాడు రెండు చేతులను పక్కకు చాపుతూ.

వేగాన్ని కంట్రోల్ చేసుకుంటూనే వెంటనే ఆగిపోయింది స్టెల్లా — అతని చేతిదగ్గర.

ఎండుటాకులమీద కొద్ది దూరంలోనే కొరడాతో టపటప మంటూ కొడుతూన్న చప్పుడు వినపడుతోంది. అప్పటికే టకారాలకు బాగానే దూరంగా వచ్చామని అనుకున్న తర్వాత భారత్ గాస్‌లైటర్ తీసి వెలిగించి అదిరిపడ్డాడు.

ఎదురుగా తక్కువ దూరంలోనే పడగవిప్పి బుసకొడుతోంది నీలిరంగు పాము. బుస కొడుతూనే తోకతో ఆకులమీద కొరడాలా కొడుతోంది.

దాన్ని చూడగానే స్టెల్లా కూడా భయం వేసింది.

దగ్గరలోనే వుంది పాము. తలమీది బుడిపె — దాంట్లో ముల్లుతో అసహ్యానిగా, భయం కలిగించేలా వుంది.

లైటర్ వెలుగుతూనే వుంది. ఆ వెలుగులో దాని కళ్ళు మెరుస్తున్నాయి. అది వాళ్ళిద్దర్నీ నిర్లక్ష్యంగా చూసింది.

"స్టెల్లా....క్విక్....ఆలస్యం చెయ్యటానికి వీల్లేదు. టకారాలు రావచ్చు. షూట్ ది స్నేక్" చిన్నగా అన్నాడు భారత్ కంగారుగా.

అంతే — విసురుగా స్టెల్లా చెయ్యి రివాల్వర్‌ను బయటకు లాగింది.

గాలికి కదులుతోంది లైటర్ వెలుగు.

గురిచూసి ట్రిగ్గర్ నొక్కింది సెల్లా.

"ఢాం!"

దెబ్బతో నీలిరంగు పాము పడగ చిన్నాభిన్నమై పోయింది. ఎగిరి దూరంగా పడిపోయింది.

"క్విక్ .... పరిగెత్తు .... సముద్ర తీరానికి దగ్గరికి వచ్చేశాం."

రివాల్వర్ పేలిన చప్పుడు టకారాలకు వినిపించలేదు. ఎందుకంటే వాళ్ళదృష్టి చేతికి దొరికిన ఆ మనుషుల మీద నే వుంది. కసికొద్దీ ప్రాణాలు పోయిన మనుషులను కూడా ముక్కలు ముక్కలుగా నరుకుతున్నారు—వంకీ కత్తులతో. తమకు అంతా దొరికిపోయారనే అనుకున్నారు. ఆ చీకట్లో యెవరెవరో గుర్తుపట్టే అవకాశం లేక.

ఓ యిద్దరు నాగరిక మనుషులు—ఆ మణిని కాజెయ్యటంలో ముఖ్యమైన వాళ్ళు తమ బల్లేలకు, వంకీ కత్తులకు దొరక్కుండా పారిపోయారని టకారాజాతి మనుషులకు తెలీలేదు.

కాగడాలు వెలిగించటానికి వీల్లేకపోవటంవల్ల చీకటిగా వుండటం కారణంగానే వాళ్ళకు ఆ విషయం తెలిసే అవకాశం లేకుండా పోయింది.

అప్పటికే ఆ ఇద్దరు సముద్రతీరానికి తెప్పలను దాచిన పొదల దగ్గరకు వెళ్ళారు.

వెళ్ళటంతోనే కొంచెం పెద్దదిగా వున్న ఓ తెప్ప మీద యిద్దరూ చేతులు వేశారు బయటకు లాగటానికి.

అంతే—వాళ్ళ వేళ్ళమీద ఒక్కసారే సూదితో గుచ్చినట్టుగా చురుక్కుమన్నది. బాధతో అరుస్తూ తెప్పలను వదిలారు. భరించలేని బాధ కలిగింది.

గాస్ లైటర్ వెలిగించాడు భారత్.

ఆ వెలుతుర్లో—పరుగుతీస్తున్న కొన్ని ఎర్రటి తేళ్ళు కనిపించాయి.

"మైగాడ్! ఎర్ర తేళ్ళు....ఇక ఈ బాధను భరించటం అసాధ్యం. ఈ దీవుల్లో వుండే తేళ్ళ గురించి మనకు తెలీదు" అన్నది సెల్లా.

భారత్ లైటర్ ఆర్పేశాడు.

తేళ్ళు పూర్తిగా వెళ్ళిపోయాయని నిర్ధారణ చేసుకున్న తర్వాత తెప్పను పొదలోనించి బయటకు లాగారు.

కొంచెం సేపట్లో దాన్ని ఇసుకలో ఈడ్చుకుంటూ సముద్రం దగ్గరకు లాక్కెళ్ళారు. ఇద్దరికీ లాక్కెళుతుంటే వేళ్ళు మరింతగా నొప్పి పుట్టాయి. చెయ్యంతా లాగేస్తున్నట్టుగా అనిపించింది.

హోరు పెడుతోంది సముద్రం.

నక్షత్రాల వెలుగులో తెల్లగా వుంది.

తెప్పతో కొంతదూరం నీళ్ళలోకి వెళ్ళారు. చల్లటి నీళ్ళు శరీరానికి తగలగానే వణుకు పుట్టినట్లయింది.

తెప్పను వదిలి దానిమీద యెక్కి కూర్చున్నారు. సెల్లా జారి పడబోయింది. చటుక్కున భారత్ ఆమెను పట్టుకున్నాడు.

ఒకసారి అటూ యిటూ కదిలి తర్వాత నెమ్మదిగా నీటిమీద తేలుతూ సముద్రం లోపలకు వెళుతోంది తెప్ప....

తేలు కుట్టిన వేళ్ళను యిద్దరూ గట్టిగా బిగించి పట్టుకున్నారు. బాధను భరిస్తూ "కొన్ని క్షణాల క్రితం జరిగింది తల్చుకుంటే నాకు యెంతో బాధగా, విచారంగా

వుంది. మనవాళ్ళంతా ఆ మొరటు మనుషుల కత్తులకు బల్లేలకు బలై పోయారు కదా" అన్నాడు భారత్.

"అవును. నేనూ అందుకే బాధ పడుతున్నాను భారత్. ముఖ్యంగా షాక్ తిన్న ఆ లేడీని నాతో లాక్కురావాలని శతవిధాలా ప్రయత్నించాను. ఐనా సాధ్యం కాలేదు. పరిగెత్తలేనని మొండికెత్తింది. కింద పడిపోయింది. ఇంతలోనే మనవాళ్ళే ఆమెను తోక్కు కుంటూ వెళ్ళిపోయారు. వెనుకనించి టకారాలు దగ్గరకు వచ్చేశారు. అందుకే నా ప్రాణాలను రక్షించుకోటానికి ఆమెను వదిలిరాక తప్పలేదు" స్టెల్లా అంది విచారంగా.

"చివరకు మనిద్దరమే మిగిలాం.... యెప్పటికప్పుడు కరోన్ శాపం నిజమవుతుందేమోనని ఎంతగానో భయ పడుతూ వచ్చాను. కాని ఆశ్చర్యం! ప్రతిసారీ చావు మనల్ని వదిలి యింకొకర్ని వెతుక్కుంటూ వెళ్ళి పోయింది."

"ఆ డర్టీ కరోన్ గురించి నువ్వు యింకా మరచి పోలేదా? కరోన్ శాపం యేమిటి? మనుషులు చావ బోయే ముందు అనే మాటలన్నీ నిజమవుతాయా? నీవన్నీ ఫూలిష్ సెంటిమెంట్స్.... నే నెప్పుడూ యిలా అనుకో లేదు" అన్నది కోపంగా స్టెల్లా.

అప్పటికి తెప్ప తీరాన్ని వదిలి కొంత దూరం వచ్చే సింది.

టకారా దీవి క్రమంగా దూరమవుతోంది. ఆ జాతి మనుషులు తీరంకేసి వస్తున్న జాడలేవీ కనిపించలేదు. తేలిగ్గా గాలి పీల్చుకున్నారు భారత్ — స్టెల్లా.

మిగిలినవాళ్ళు కూడా అలాగే రాగలిగివుంటే బావుం డేది అనుకున్నారు.

తేళ్ళు కుట్టిన బాధ నిముష నిముషానికీ ఇద్దరికీ కాగా పెరిగిపోయింది. దాన్ని ఓర్చుకోవటం కష్టంగానే వుంది. ఐనా భరించక తప్పదనుకున్నారు.

భారత్ — సెల్లాతో ఇలా అన్నాడు:

"నాకు ఒక్కటే విషయం ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. ఈ రాత్రికి మనం కపాచీదేవత మెళ్ళోవున్న మణిని కాజెయ్యటానికి పథకం వేశామని టకారా జాతిమనుషులకు ఎలా తెలిసింది? యెవరు చెప్పి వుంటారు?"

సెల్లా అన్నది: "నా ముక్కుపుటాలకు ఆ వెగటు వాసన తగలటంతోనే ఉలిక్కిపడ్డాను—వెంటనే తెలిసిపోయింది టకారా జాతివాళ్ళు మన దగ్గరలోనే వున్నారని. వాళ్ళకు మన గురించి యెలా తెలిసిందో నాకూ అర్థంకాలేదు. ఆయితే నా అనుమానం చటుక్కున ఆండ్రూస్ మీదకు వెళ్ళింది."

"యూ ఆర్ రైట్! నా దృష్టిలో కూడా ఆండ్రూస్ మన పథకం గురించి వాళ్ళకు చెప్పివుంటాడని. లేకపోతే యెలాంటి పంసితులలోనూ తెలిసే అవకాశం లేదు. ఆండ్రూస్ మన గురించి, మన పథకం గురించి చెప్పి వుండకపోతే అమావాస్య రాత్రి కపాచీదేవత దీవిలో సంచరిస్తుందని తెలిసి కూడా వాళ్ళు బయటకు యెందుకు వస్తారు? కాబట్టి, వాళ్ళకు ఆండ్రూస్ అంతా చెప్పివుంటాడు."

"నిజమే భారత్....ఆండ్రూస్‌ను తప్పించి మరో మనిషి ఎవరికీ వాళ్ళతో ఈ విషయాన్ని చెప్పే అవకాశం లేదు. ఎందుకంటే మనవాళ్ళెవరికీ టకారా భాష రాదు. వచ్చినా చెప్పరు. అది తమకే ప్రమాదమని తెలుసు. కాబట్టి, ఒక్క ఆండ్రూస్‌కే మన పథకం

గురించి వాళ్ళతో చెప్పే అవకాశం వుంది. ఐనా మనతో చేతులు కలిపినట్టునటించి, తనకీ టకారాలమీద శత్రుత్వం వుందనీ ఆ మణిని కాజేసి టకారాలను కోలుకోలేని దెబ్బను కొట్టమనీ ఎందుకు చెప్పినట్టు?"

నవ్వాడు భారత్.

ఈ సంఘటనతో అంద్రూస్ మన సత్యం ఏమిటో అర్థమైపోయింది. ఆయనొక శాడిస్టు. జీవచ్ఛవంలా ఈ దీవిలో బతుకుతున్న అంద్రూస్‌కు ప్రాణాలతో ఇక ఈ దీవినించి బయటపడి తన భార్య, పిల్లలను కలుసుకోవటం అసాధ్యమనే ఆలోచన ఒకటి వుంది. ఈ దీవిలో ఆ టకారాజాతి మొరటు మనుషుల మధ్యత నొక్కడే నాగరికుడు. ఆయనలాగే విధివశాత్తూ మనంకూడా ఈ దీవికి వచ్చి పడ్డాము. ఇక్కడనించి బయటకు వెళ్ళటానికి మార్గం చెప్పమని అంద్రూస్‌ను అడిగాము. కాని ఆయన మార్గమే లేదన్నాడు. అందుక్కారణం యేమిటంటే మనం ఈ దీవి వదిలి వెళ్ళిపోవటం ఆయనకు యిష్టంలేదు.

అట్లాగని మనం ఈ దీవిలోనే శాశ్వతంగా వుండిపోవటం కూడా ఇష్టంలేదు. ఉంటే కొన్నాళ్ళకు మనం కూడా టకారాల భాష నేర్చుకొని నాయకుడి అనుగ్రహం సంపాదిస్తే నాయకుడి దగ్గర తన ఆధిక్యత నశించిపోవచ్చు. ఎందుకంటే అంద్రూస్‌కు నాయకుడి దగ్గర కొంచెం పరపతి వుంది. ఆయనకు తన పక్కనే ఒక సింహాసనం వేయించటంలోనే ఆ విషయం తెలిసిపోయింది. దీన్ని ఆసరాగా తీసుకుని ఆలోచిస్తే అంద్రూస్ ప్రాయశ్చిత్తం విషయంలో మనకు కావాలనే ద్రోహం చేశాడు. నాయకుడికి టకారా భాషలో పాంకీల్

శవాన్ని పాతిపెట్టటం గురించి ఏం చెప్పాడో మనకు తెలీదు. ఇప్పుడు ఇక అంద్రూస్ ఉద్దేశం మనల్ని ఆ దీవిలోనే టూకారాలతో చంపించటం.

అంద్రూస్ మార్గంలేదని చెప్పినా మనం ఇక్కడి నించి బయటపడటానికి ప్రయత్నాలు చేస్తామని తెలుసు. అందుకే మనకు పగతీర్చుకోటానికన్నట్టు ఈ పథకం చెప్పాడు. తీరా మనం ఆ ప్రయత్నంలో వున్నప్పుడు మన గురించి నాయకుడికీ మిగిలిన వాళ్ళకీ తెలియబరిచాడు. నీచుడు. ఇంతకీ ఆ కోట్లరూపాయల విలువచేసే ఆ మణిని స్వాధీనపరచుకోకముందే వీళ్ళు వచ్చారు. పథకం అంతా చెడిపోయింది. ఐనా—జీవించి వుంటే యెలాగైనా ఆ దివ్యమైన మణిని సంపాదించి తీరాలి. అదే నా జీవిత ధ్యేయం" అన్నాడు భారత్....

"డర్టీ డెవిల్ అంద్రూస్. ఇంతకీ ఈ తెప్ప యెటు వైపుకు వెళుతుందో, మనం ఎక్కడికి చేరుకుంటామో... తెలీటంలేదు" అన్నది స్టెల్లా కళ్ళు మూసుకుంటూ.

"నిద్ర వస్తోందా?" అడిగాడు భారత్. అతనికీ అప్రయత్నంగానే కళ్ళు మూసుకు పోతున్నాయి.

"నిద్ర కాదనుకుంటాను. వళ్ళంతా యేదోలా వుంది. తేలు విషం శరీరంలోకి యెక్కుతుందేమో! మత్తుగా వుంది" బాధపడుతూనే అన్నది మరింతగా కళ్ళు మూసుకుంటూ.

అప్పటికే తెప్ప తీరాన్ని వదిలి సముద్రంలో చాలా దూరం వచ్చేసింది.

భారత్ కళ్ళు తెరవాలని ప్రయత్నించాడు. కాని సాధ్యం కాలేదు. తేలు విషం శరీరంలోకి ఎక్కుతోంది.

ఎక్కడో తేలిపోతున్నట్టుగానే వుంది.

ఇంకొంచెం సేపట్లోనే ఇద్దరికీ స్పృహ తప్పింది. ఒకరిమీద ఒకరు పడిపోయారు.

తెప్ప నీళ్ళమీద తేలుతూ ప్రయాణం చేస్తోంది. అప్పటికి టకారా దీవిలో సందడి సద్దు మణగలేదు.

* * *

సెల్లాకంటే ముందు భారత్ కే స్పృహ వచ్చింది. కళ్ళు తెరిచాడు. ఒక్క క్షణం అతడికేమీ వెంటనే అర్థంకాలేదు. కాని—తర్వాత ఉలికిపడుతూ బెడ్ మీద లేచి కూర్చోబోయాడు.

అతడికి వెంటనే చిన్న నవ్వు వినపడింది. భారత్ పక్కనే ఓ యాభై యేళ్ళ మనిషి కుర్చీలో కూర్చున్నాడు.

"గుడ్. మెలకువ వచ్చిందన్నమాట" అన్నాడు సిగరెట్టు వెలిగించుకుంటూ—

"ఇప్పుడు నేనెక్కడ వున్నాను?"

అలా అడుగుతూనే పక్కకు చూశాడు. పక్కనే వున్న బెడ్ మీద సెల్లా నిద్రపోతోంది.

"సురక్షితమైన ప్రదేశంలోనే వున్నావు....హాసీనా అనే ఓడలో వున్నావు" అన్నాడాయన పొగవదులుతూ.

"ఇక్కడికి మేమెలా వచ్చాం?"

"మీరు రాలేదు. సముద్రంలో స్పృహలేని స్థితిలో ఒక తెప్పమీద పడి కొట్టుకు వెళుతుంటే చూసి ఇందులోకి చేర్చాం."

"థాంక్ గాడ్" అనుకున్నాడు భారత్.

తమని రక్షించినందుకు ఆయనకు మరీ మరీ కృతజ్ఞతలు తెలియజేసుకున్నాడు.

ఆయన నవ్వి "నిజంగా మీరు మాకు కనపడటం మీ

అదృష్టమే. లేకపోతే ఈ అనంతమైన సముద్రంలో మీరు యే వైపుకు కొట్టుకుపోయేవాళ్ళో తెలీదు" అన్నాడు.

"ఇంతకీ ఈ ఓడ యే దేశానికి వెళుతోంది" భారత్ ఆత్రంగా అడిగాడు.

"భారతదేశానికి వెళుతోంది."

భారత్ సంతోషానికి అవధులు లేవు....అతడి సంతోషాన్ని ఆయనకు యెలా వ్యక్తపరచాలో అర్థం కావటం లేదు.

"నిజంగా మీరు మా పాలిట దేవుడు. ఎన్ని జన్మలెత్తినా మేము మీ ఋణం తీర్చుకోలేం."

మళ్ళీ నవ్వాడాయన.

నవ్వి "ఇటువంటి సంఘటనలు చాలా అరుదుగా జరుగుతూ వుంటాయి. ఇంతకీ మీరెవరు? సముద్రంలో ఆ తెప్పమీద మీరు యెక్కడినించి వస్తున్నారు?" అనడిగాడు.

కంపూచియాలో ప్లేన్ యెక్కిన దగ్గర్నించీ చివరి వరకూ జరిగినదంతా ఆయనతో చెప్పాడు భారత్. ఐతే టకార దీవిలో కపాచీ దేవత హారంలో వున్న విలువైన మణి గురించి ఆయనతో చెప్పలేదు. తామంతా పారిపోయి వస్తుంటే టకారాలు వెంటపడి మిగిలిన వాళ్ళందరినీ హతమార్చారని చెప్పాడు.

భారత్ చెప్పిన కథ విని ఆయన చలించిపోయాడు.

"వాళ్ళంతా అలా హతమైపోవటం విచారకరం. మీరిద్దరూ గొప్ప అదృష్టవంతులు. ప్రాణాలతో బయటపడ్డారు నిజమే. ఈ దీవుల్లో వుండే అనాగరికుల ఆచారాలు—నమ్మకాలు చాలా దారుణంగా వుంటాయి."

వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటూ వున్నప్పుడు స్టెల్లాకు కూడా స్పృహ వచ్చింది. ఆమెకూడా మొదట్లో కళ్ళు తెరవగానే ఆశ్చర్యపోయింది.

ఆమె బెడ్ మీద లేచి కూర్చున్న తర్వాత భారత్ ఆమెకు జరిగిందంతా చెప్పాడు—ఆయన్ని ఆమెకు పరిచయం చేసి.

స్టెల్లా ఆయనకు కృతజ్ఞతలు తెలియజేసుకుంది.

ఓడలో పనిచేసే మరి కొంతమంది ఉద్యోగులు ఆ గదిలోకి వచ్చారు. భారత్—స్టెల్లాల కథ విని ఆశ్చర్య పడ్డారు.

టకారా దీవి గురించి వాళ్ళు అసలు వినలేదని చెప్పారు భారత్ అడిగిన తర్వాత.

మృత్యుముఖం నుంచి ప్రాణాలతో బయటపడినందుకు ఆ ఇద్దరినీ వాళ్ళంతా అభినందించారు. తమని ఓడలోకి చేరవేసినందుకు ఆ ఇద్దరూ వాళ్ళందరికీ కృతజ్ఞతలు చెప్పుకున్నారు.

స్టెల్లా అందం వాళ్ళందరినీ బాగా ఆకర్షించింది.
వాళ్ళు యొక్కువ సేపు ఆమెతో మాట్లాడటానికి ఆసక్తిని చూపడం భారత్ గమనించి నవ్వుకున్నాడు.
భారత్ ఆయన్నడిగి ఇండియా చేరటానికి ఇంకో రోజు పడుతుందని తెలుసుకున్నాడు. అది రాత్రి అనీ ఇంకో రెండు గంటల్లో తెల్లారబోతుందనీ తెలిసింది. అంటే యిద్దరూ దాదాపుగా ఒకరోజంతా స్పృహ లేకుండా గడిపారన్నమాట.

ఒక్క రోజులో ఆ తెప్పమీద సముద్రంలో యెంత దూరం ప్రయాణంచేసి వుంటారు? ఏమో తెలీదు. ఆయన్ని

అడిగాడు.

"మీరు ప్రవాహానికి వాలుగా ప్రయాణం చేశారు కాబట్టి చాలా దూరం వచ్చి వుంటారు."

"భారతదేశం ఇక్కడికి యింకా యెంతదూరంలో వుంది" వెయ్యి కిలోమీటర్లపైనే ఉండొచ్చునని చెప్పాడాయన.

ఇంకా దీవుల గురించిన అనేక విషయాల గురించి ఆయన్ని అడిగాడు భారత్....ఆయన అన్ని ప్రశ్నలకీ యెంతో ఓపికగా జవాబులు ఇచ్చాడు.

భారత్ కోరికమీద చివరగా దీవుల గురించి పరిశోధన చేసిన ఓ ప్రొఫెసర్ గురించి చెప్పాడు.

ఆయనే ప్రొఫెసర్ బలదేవ. ఆయన మద్రాసులో ఉంటున్నారు. మద్రాసు వెళ్ళగానే ఆయన్ని కలుసుకోవాలనుకున్నాడు భారత్.

భారత్ ఈ వివరాలన్నీ యెందుకు అడుగుతున్నాడో స్టెల్లా గ్రహించింది—టకారా దీవిలో వున్న కపాచీ దేవత హారంలో వున్న కోట్లు విలువచేసే మణి గురించే—

మళ్ళీ ఆ మృత్యు దీవికి వెళ్ళటం గురించి భారత్ ఇప్పుడే ఆలోచనలు చేస్తున్నాడా?

ఉలిక్కిపడింది స్టెల్లా.

అక్కడ అనుభవించిన నరకమంతా కళ్ళముందు గిర్రున తిరుగుతోంది.

"భారత్" పిల్చిందతన్ని.

అతను పలకలేదు. ఆలోచిస్తూ వుండిపోయాడు. అతని ఆలోచనలన్నీ ఆ మణి గురించే—తప్పదు. తన జీవిత ధ్యేయం ఒక్కటే—టకారాల మణిని సంపాదించాలి.

కొంచెం సేపట్లో తెల్లవారబోతున్నదని చెప్పాడాయన చేతిపన్న వాచీ చూసుకుని.

* * *

మద్రాసు—

'భారత్ నిలయం' లోనించి అంబాసిడర్ కారు బయటకు వచ్చింది.

రోడ్డుమీద రివ్వున దూసుకు వెళ్ళింది. అందులో భారత్ అతని తమ్ముడు రంజిత్ — స్టెల్లా కూర్చుని ఉన్నారు.

రంజిత్ కారును డ్రయివ్ చేస్తున్నాడు. అతడి నోట్లో సిగరెట్టు వెలుగుతోంది.

భారత్‌ను ఆనుకొని కూర్చుంది స్టెల్లా.

"మళ్ళీ ఇలా నాగరిక ప్రపంచాన్ని చూస్తామని యే మాత్రం వూహించలేదు. అదంతా ఓ పీడకలగా గడిచి పోయింది" అన్నాడు భారత్ దాటిపోతున్న ఎత్తయిన భవనాలను—పరుగులు దీస్తున్న వాహనాలను, షాపులను జనసందోహాన్ని చూస్తూ.

నవ్వింది స్టెల్లా.

"కాని మనిషి తల్చుకుంటే సాధ్యంకానిది యేదీ లేదనిపిస్తోంది నాకు. ఆండ్రూస్ మనందరికీ ద్రోహం చెయ్యకుండా వున్నట్లయితే మిగిలిన వాళ్ళు కూడా ఆ దీవినించి మనలాగే బయటపడేవాళ్ళు. కాని బాడ్ లక్. టకారాల క్రూరత్వానికి బలై పోయారు"

"అవును స్టెల్లా నిజంగా దురదృష్టమే. ఆండ్రూస్ మనకు తీరని అన్యాయం చేశాడు. తన శాడిజంతో యెంతోమంది నాగరికుల ప్రాణాలను పొట్టన పెట్టుకున్నాడు."

కారు వేగంగా వెళుతోంది.

రంజిత్ ఎంతో తాపీగా సిగరెట్టు కాలుస్తూ కారును డ్రయివ్ చేస్తున్నాడు. మైలాపూర్ లోనించి వెళుతోంది కారు.

మద్రాసు నగర అంద చందాలను చూస్తోంది స్టెల్లా. ముత్తానికి భారతదేశం రావాలనే తన కోరిక తీరకుండానే ఆ టకారా దీవిలోనే తన జీవితం అంతమయి పోతుందేమోనని భయపడింది. కాని తన అదృష్టం, ఆ బందిఖానానించి భారత్ తోనే బయటపడింది. భారత దేశం చేరుకోగలిగింది.

రంజిత్—ఆ ఇద్దరి మాటలు వింటున్నాడు. రంజిత్-భారత్ కి సొంత తమ్ముడు కాదు. బాబాయి కొడుకు. చిన్నతనంనించీ భారత్ తోనే కలిసి పెరిగాడు. ఇద్దరికీ వయసులో ఒకే ఒక్క యేడాది తేడా వుంది. భారత్ అతనికంటే పెద్ద.

భారత్ సూచనల ప్రకారం కారు ఓ పెద్ద భవనం ముందు ఆగింది.

రెండంతస్తుల భవనం. ముందు పెద్ద ఇనుపగేటు. అక్కడే గూర్ఖా కూర్చుని వున్నాడు. కారును చూడగానే గేటు తెరిచాడు.

లోపలకు వెళ్ళింది కారు.

బాటకిరువైపులా రంగు రంగుల పువ్వుల మొక్కలు వున్నాయి.

పోర్టికోలో అంబాసిడర్ ఆగింది.

అందులోనించి ముగ్గురూ దిగారు.

లోపలకు నడిచారు.

నడవలో ఎవ్వరూ కనపడలేదు. విజటర్స్ రూములోకి

వెళ్ళి కూర్చున్నారు.

భారత్ అటుగా వచ్చిన నౌకర్ని పిలిచి యేదో చెప్పాడు. వాడు పైకి వెళ్ళి ఐదు నిమిషాల తర్వాత తిరిగివచ్చి ప్రొఫెసర్ బలదేవ వాళ్ళందరినీ పైకి రమ్మంటున్నాడని చెప్పాడు.

ముగ్గురూ పైకి వెళ్ళారు.

గది తలుపులు నెట్టుకొని లోపలకు అడుగుపెట్టారు.

ఎదురుగా—

కుర్చీలో అరవై యేళ్ళాయన కూర్చుని వున్నాడు. తెల్లగా వున్నాడు. ముడతలుపడిన శరీరం. కళ్ళు లోపలకు పీక్కుపోయాయి. పొడుగ్గా ఉన్న ముక్కు—తెల్లని బట్టలు ధరించాడు. జుట్టు పూర్తిగా నెరిసిపోయింది. పొట్టిగా కత్తిరించినట్టున్న నెరిసిపోయిన గడ్డం.

తనని పరిచయం చేసుకొని సెల్లానూ—రంజిత్ నీ బలదేవకు పరిచయం చేశాడు.

ఓ గంట క్రితమే భారత్—బలదేవకు ఫోన్ చేసి అపాయింట్ మెంట్ ఫిక్స్ చేసుకున్నాడు.

ప్రొఫెసర్ ని చూడటంతో నే నిరుత్సాహపడిపోయాడు భారత్. ఆయన శరీరమంతా ముడతలు పడిపోయి మరీ అంత ముసలివాడిగా కనపడతాడని అనుకోలేదు.

"చెప్పండి .... మీరు యే విషయమై నన్ను కలుసుకోవాలని అనుకున్నారు?" చిరునవ్వుతో అడిగాడు బలదేవ.

అప్పుడే ఓ స్త్రీ ట్రేలో హార్లిక్స్ కప్పులను తీసుకు వచ్చి వారిముందు వుంచింది.

"తీసుకోండి" అన్నాడాయన.

హార్లిక్స్ సిప్ చేస్తూ అన్నాడు భారత్—

"మీరు దీవుల గురించి పరిశోధనలు చేశారని విన్నాను. టకారా దీవి గురించి తెలుసుకుందామని మిమ్మల్ని కలుసుకున్నాను."

బలదేవ మొహం చూస్తూనే ఆయనకు ఆ దీవి గురించి తెలీదని, దాని పేరు కూడా యెప్పుడూ వినలేదని గ్రహించాడు భారత్.

"సారీ....టకారా దీవి గురించి నేను ఇంతవరకూ వినలేదు. ఇదే మొదటిసారి ఆ పేరు వినటం" అన్నాడు.

భారత్ కప్పును తిరిగి ట్రేలో వుంచుతూ "స్మోక్ చేయవచ్చా?" అనడిగాడు.

తల వూపాడు బలదేవ.

రంజిత్—భారత్ సిగరెట్లు ముట్టించారు. ప్రొఫెసర్ కూడా సిగరెట్టు వెలిగించాడు.

స్టెల్లా ఆ గదిలో ఓ మూలగా రేక్‌లలో వున్న రంగు రంగుల బొమ్మలను చూస్తోంది.

"ముఖ్యంగా మీకు టకారా దీవి గురించి తెలిసి వుంటుందని అనుకుని వచ్చాను" మళ్ళీ అన్నాడు భారత్.

"ఇంతకీ మీకు ఆ దీవితో సంబంధం యేమిటి? ఎందుకు మీరు ఆ టకారా దీవి గురించి తెలుసుకోవాలని అనుకుంటున్నారు?" ప్రొఫెసర్ అడిగాడు.

"చెబుతాను. ఆ విషయం చెప్పటానికి ముందు జరిగిన కథంతా చెప్పాలి మీకు" అని జరిగినదంతా ప్రొఫెసర్‌తో చెప్పాడు.

అంతా విని ఆయన "రియల్లీ యు ఆర్ లక్కీ.... అలాంటి దీవినుండి, ఆ మనుషులనుంచీ బయటపడగలిగారంటే మీరు గొప్ప సాహసం చేశారు. ఇంతకీ మీరు మళ్ళీ ఆ దీవి గురించి తెలుసుకోవాలని యెందుకు అను

కుంటున్నారు? ఆ దీవి గురించి నా కంటే మీకు అన్ని విషయాలూ తెలుసుకదా? ఇక ఆ దీవితో పనేమిటి?" అనడిగాడు.

భారత్ నవ్వాడు.

"టకారా దీవినుంచి బయట పడటం వరకు మమ్మల్ని అదృష్టం వెంటాడింది. కాని ఏం లాభం? ఒక్క విషయం లోనే నన్ను దురదృష్టం వెంటాడింది. అందుకే మళ్ళీ నేను ఆ ప్రమాదాలతో నిండి వున్న టకారా దీవికి వెళ్ళక తప్పదు."

"ఎందుకు?"

భారత్ ఆ మణి గురించి ప్రొఫెసర్‌తో చెప్పదలుచుకున్నాడా?...అనుకుంది స్టెల్లా.

కాని ఆమె ఆలోచనను తలక్రిందులు చేస్తూ-"చెప్పాను కదా! నేను వజ్రాల వ్యాపారిని. ప్రపంచంలో వున్న మేలురకం వజ్రాలను సంపాదించి బిజినెస్ చేస్తూ వుంటాను. అలాగే కంపూచియానించి లక్షలు విలువచేసే వజ్రాలతో బయల్దేరాను. వాటిని టకారా దీవిలోనే వదిలి వచ్చేశాను ఆ రాత్రి. దీవి వదిలి వచ్చిన తర్వాత గుర్తుకు వచ్చింది. ఇప్పుడు ఆ వజ్రాలకోసం మళ్ళా ఆ దీవికి వెళ్ళక తప్పదు" అని చెప్పాడు.

మనసులోనే నవ్వుకుంది స్టెల్లా—

బలదేవ అంతా విని "లక్షల విలువచేసే ఆ వజ్రాల కోసం తిరిగి అపాయాలతో నిండివున్న ఆ మృత్యు దీవి లోకి మళ్ళీ అడుగు పెట్టాలని అనుకుంటున్నారా? మీ ప్రాణాలతో మీరే చెలగాటమాడటానికి సిద్ధపడుతున్నారా?" అన్నాడు.

"అవును. ఒకోసారి ఎన్నో ప్రమాదాలను ఎదుర్కొని

ఆ దీవినించి బయటపడిన తర్వాత సాహసాలు చెయ్యాలనే కోరిక నాలో బలంగా కలుగుతోంది. ప్రాణం గురించిన భయం నాలో లేదు. అందువల్లనే నేను తిరిగి ఆ దీవికి వెళ్ళాలని అనుకుంటున్నాను. లక్షల విలువైన ఆ మేలురకం వజ్రాలను ఆ దీవిలో వదలదల్చుకోలేను."

ప్రొఫెసర్ కు భారత్ మనస్తత్వం చాలా చిత్రమైనదిగా అనిపించింది. కేవలం లక్షలు విలువచేసే వజ్రాలకోసం ప్రాణాలకు తెగించి అన్ని కష్టాలను అనుభవించిన ఆ దీవికి వెళ్ళాలని అనుకుంటున్నాడా?

ఏమిటీ మనిషి?

"మిమ్మల్ని చూస్తుంటే నాకు ఆశ్చర్యంగా వుంది. కాని ఒక్క విషయం — మీరు ఆ దీవినించి బయటపడటానికి చేసే ప్రయత్నం సాహసమనిపించుకుంటుంది కాని తిరిగి కేవలం గాజు ముక్కల్లాంటి వజ్రాలకోసం తిరిగి ఆ దీవిలోకి అడుగుపెట్టాలనుకోవటం దుస్సాహసమే అవుతుందనుకుంటాను. బాగా ఆలోచించండి. ఆ వజ్రాలు విలువైనవే కావచ్చు. కానీ మీరు తల్చుకుంటే అంతకంటే విలువైన వజ్రాలను సంపాదించలేరా?" అనడిగాడు.

"సంపాదించగలను. కాని అంత ఖరీదైన ఆ వజ్రాలను వాటి విలువ తెలియని ఆ మొరటు మనుషులు నివసించే దీవిలో ఎందుకు వదలాలి? ఐతే నా మనసులో ఒక ఆలోచన వుంది. ఆ దీవి ఎక్కడ వుందో క్లియర్ గా తెలిస్తే యెక్కువ శ్రమపడకుండా ఆ దీవికి హెలికాప్టర్లో చేరుకోవచ్చు. ఆ దీవికి వెళ్ళిన తర్వాత రహస్యంగా ప్రయత్నించి ఆ వజ్రాలను తిరిగి పొంద

వచ్చు. అందుకోసమే నాకు ఆ టకారా దీవి సరిగ్గా యెక్కడ వున్నదో చెప్పగల మనిషి కావాలి. అందుకే నేను మిమ్మల్ని కలుసుకున్నాను."

రంజిత్ మరో సిగరెట్ వెలిగించాడు. అతనికి ఎక్కువసేపు అక్కడ కూర్చోవటం అసహ్యంగా వుంది. ఇక ఎంత సంభాషణ జరిగినా ప్రొఫెసర్ బలదేవకు టకారా దీవి గురించి తెలియనప్పుడు ఆయనతో యెక్కువ సమయం గడపటం వృధా—

ఇదీ రంజిత్ ఉద్దేశం.

"మీ నిర్ణయంలో మార్పు వుండదా?" ప్రొఫెసర్ అడిగాడు.

నవ్వాడు భారత్ ....నవ్వుతూనే "నా నిర్ణయం అంత సులభంగా మారేదికాదు ప్రొఫెసర్, నేను చాలా మొండివాడ్ని..టకారా దీవికి వెళ్ళక తప్పదు. దయచేసి ఆ దీవి గురించి తెలియజేయగల మనిషి ఎవరైనా వుంటే మాకు సూచించండి" అన్నాడు.

బలదేవ రెండు నిముషాలు ఏదో ఆలోచించాడు.

తర్వాత ఏదో గుర్తుకు వచ్చి "యు ఆర్ లక్కీ.... ప్రొఫెసర్ అనంత్ ఇంకా సిటీలోనే వున్నాడు. ఇంకో రెండు నెలల్లో అతను స్టేట్స్‌కు వెళ్ళాలని అనుకున్నాడు. అతనుకూడా ఈ మధ్య నాలాగే కొన్ని దీవుల గురించి పరిశోధనచేసి కొత్త దీవులను కొన్నింటిని కనుగొన్నట్టు ఓసారి నాతో చెప్పాడు. అప్పట్లో నా ఆరోగ్యం అంత సరిగా వుండకపోవటంవల్ల నేను ఆ విషయంలో ఎక్కువ ఇంట్రస్టు చూపలేకపోయాను. నా అంచనా నిజమయితే అనంత్ మీకు కావలసిన ఇన్ఫర్మేషన్ ఇవ్వగలడను కుంటాను. అతన్ని కలుసుకోండి" అంటూ ఓ చిన్న

డైరీ తీసి అందులో కొన్ని పేజీలు తిప్పి ప్రొఫెసర్ అనంత్ అడ్రసు చెప్పాడు.

భారత్ ముఖం తిరిగి వికసించింది.

"థాంక్ యూ ప్రొఫెసర్....అనంత్‌ను ఇప్పుడే కలుసుకుంటాను. మరోసారి కలుస్తాం.... వెళ్ళొస్తాం" అని బలదేవకు మరీ మరీ కృతజ్ఞతలు తెలియచేసుకుని బయటకు వచ్చాడు.

తిరిగి ముగ్గురూ కార్లో బయలుదేరారు.

• • •

సరిగ్గా పదినిమిషాల తర్వాత కారు ప్రొఫెసర్ అనంత్ భవనం ముందాగింది.

బయట నేమ్ బోర్డు కనపడింది.

భారత్ తన విజిటింగ్ కార్డును జవానుకు ఇచ్చాడు.

జవాను కొంచెం సేపటి తర్వాత వచ్చి వాళ్ళను లోపలకు తీసుకు వెళ్ళాడు.

ప్రొఫెసర్ అనంత్ ప్రైవేటు రూంలో కూర్చుని వున్నాడు. అతన్ని చూడటంతోనే భారత్‌తోపాటు స్టెల్లా—రంజిత్ కూడా ఆశ్చర్యపోయారు.

అతనికి ముప్పయ్ అయిదేళ్ళకు మించి వుండవు. హీరో పర్సనాలిటీ. చూడగానే యెదుటి మనుషులను ఆకట్టుకునేలా వున్నాడు. బలంగా — దృఢంగా వున్నాడు.

చిరునవ్వుతో అందరినీ ఆహ్వానించాడు.

అతిడి దృష్టిని తొలిచూపులోనే స్టెల్లా అమితంగా ఆకర్షించింది.

ప్రొఫెసర్ బలదేవను కలిసి వస్తున్నట్టుగా చెప్పాడు భారత్....

"ఆయన నాకు గురువులాంటి మనిషి....ఆయన్ని చూసిన తర్వాత నే నాకు దీవులగురించి పరిశోధనలు జరపాలని, కొత్త దీవులను తెలుసుకోవాలని అనిపించింది" అన్నాడు అనంత్.

భారత్ తను అనంత్ ను కలుసుకోవటానికి వచ్చిన కారణాన్ని వివరంగా చెప్పాడు.

అంతా విని ఆనందంతో నోరు తెరిచాడు అనంత్.

"మైగాడ్....టకారాదీవిలో మీరు ఏడురోజులు గడిపారా? ఆ దీవి పేరును నేను ఒకటి రెండుసార్లు విన్నాను. ఆ దీవి దాదాపుగా ఏ ప్రాంతంలో వున్నదో నాకు తెలుసు. ఎగ్జాక్ట్ గా ఎక్కడ వున్నదో నాకు తెలీదు. కాని కొంత ప్రయత్నంచేస్తే దాన్ని మనం తెలుసుకోగలమనే నమ్మకం నాకు వుంది. ఎందుకంటే ఒకసారి మీరు ఆ దీవినంతా క్షుణ్ణంగా తిరిగి వచ్చారు కాబట్టి దాన్ని మీరు సులభంగానే గుర్తించగలరు."

ఆ మాటలు భారత్ కీ, స్టెల్లాకు, రంజిత్ కీ సంతోషాన్ని కలిగించాయి. ముఖ్యంగా అనంత్ చూపుతున్న ఉత్సాహాన్ని వాళ్ళు అభినందించారు మనసులోనే.

"థాంక్ యూ మిస్టర్ అనంత్.... నేను ఆ టకారా దీవికి తిరిగి ఎందుకు వెళ్ళాలనుకుంటున్నానో మీకు చెప్పాను కదా! మీరు మాతో ఆ దీవికి రావటానికి అంగీకరిస్తే మనం ఈ టకారా దీవి ప్రయాణం గురించిన అన్ని విషయాలను చర్చించుకోవచ్చు... మీ అంగీకారాన్ని తెలియజేయండి" అని అడిగాడు భారత్.

వెంటనే అనంత్ మాట్లాడలేదు.

తర్వాత అతను సిగరెట్టు వెలిగించి ఏదో మాట్లాడబోయేంతలో బల్లమీద వున్న టెలిఫోన్ మోగింది.

రిసీవర్ ఎత్తి "హల్లో" అన్నాడు.

అవతలి వైపునించి వినిపించిన కోమల కంఠాన్ని వినగానే అతడి ముఖం మరింత వికసించింది. నవ్వుతూ రెండు నిముషాలు మాట్లాడి "తర్వాత ఫోన్ చేస్తాను" అని పెట్టేశాడు.

అతడి మొహంలోని వెలుగును గమనించి ఆ ఫోన్ చేసిన యువతి అనంత్ కు ఏమై వుంటుందో అర్థం చేసుకుంది స్టెల్లా.

వాళ్ళతో మాట్లాడుతూనే అప్పుడప్పుడు అనంత్ ఆమె కళ్ళలోకి చూస్తుంటే అతడి కళ్ళలోని ఆకర్షణ నించి తప్పుకోలేక కలవరపడింది స్టెల్లా.

"మిస్టర్ భారత్....మీరడిగిన దానికి నేను వెంటనే ఏమీ చెప్పలేను. నన్ను కొంచెం ఆలోచించుకోనివ్వండి. ఈ విషయం గురించి నేను మరో మనిషితో కూడా సంప్రదించాలి. అందువల్ల మీరు రేపు ఉదయం ఎనిమిది గంటలకు రండి. మీకు నా నిర్ణయాన్ని తెలియజేస్తాను."

"థాంక్ యూ....మీరు తప్పకుండా ఈ ప్రయాణానికి ఒప్పుకుంటారనే నమ్మకం నాకు వుంది. మీ నిర్ణయం మాకు సంతోషాన్నే కలగజేస్తుందని ఆశిస్తాను. రేపు ఉదయం సరిగ్గా ఎనిమిది గంటలకు ఇక్కడ వుంటాను."

అక్కడినుంచి లేచారు.

* * *

రాత్రి—పదిగంటలు దాటుతోంది.

అంతటా నిశ్శబ్దంగా వుంది. ఆ భవనంలో ఒకే ఒక్క గదిలో ఇంకా దీపాలు వెలుగుతున్నాయి.

ఆ గదిలోనే భారత్—స్టెల్లా—రంజిత్ కూర్చుని వున్నారు. వాళ్ళు టకారాదీవి యాత్రగురించే మాట్లాడు

కుంటున్నారు. ఊరికే కాదు—తాగుతూ, తింటూ మాట్లాడుకుంటున్నారు.

ఆ ముగ్గురి ఎదురుగా వున్న టేబిల్ మీద మూడు విస్కీ సీసాలు—చాలా ఖరీదైనవి—కల్తీలేని ఫారెన్ సరుకు వుంది. ఖరీదైన ఫుడ్ కూడా వుంది.

రెండో రవుండ్ కూడా పూర్తయిన తర్వాత మళ్ళీ గ్లాసుల్లోకి విస్కీని వంచింది స్టెల్లా—మిగిలిన ఇద్దరి ముందూ గ్లాసులను పెట్టింది.

ఆమె కళ్ళు ఎర్రగా వున్నాయి. ఆమె కళ్ళే కాదు. మిగిలిన ఇద్దరికళ్ళూ ఎర్రగానే వున్నాయి.

స్టెల్లా చాలా ఈజీగా తమతో సమానంగా తాగుతున్నందుకు భారత్ అంతగా ఆశ్చర్యపడలేదు కానీ రంజిత్ గొప్ప ఆశ్చర్యానికి లోనయ్యాడు.

ఆమెగురించి, ఆమె ధైర్యసాహసాల గురించి—ఆమె తాగుడు గురించి కూడా రంజిత్కు పూర్తిగా తెలీదు.

అప్పటివరకూ ఆ గదిలో గ్లాసుల్లోకి ద్రవాన్ని వంచుతున్న చప్పుడు, గ్లాసులు ఎత్తి తాగుతున్న చప్పుడు—పింగాణీ ప్లేట్ల చప్పుడు తప్పించి కొంచెంసేపటివరకు అంతా నిశ్శబ్దంగానే వుంది.

ఆ నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ పొగలు వదులుతున్న సిగరెట్టును యాష్ట్రేలో నొక్కుతూ భారత్—

“ప్రొఫెసర్ అనంత్ మనతో రావటానికి అంగీకరించినట్టుగానే మనం అనుకుందాం. అప్పుడు మన మిగిలిన ఏర్పాట్లగురించి ఆలోచించుకోవాలి. మనం టకారాలతో పోరాటానికి సిద్ధపడే వెళ్ళాలి. అందువల్ల మనం అవసరమైనన్ని రివాల్వర్లు, తుపాకులు తీసుకు వెళ్ళాలి. ఒక

హెలికాప్టర్ని హైర్‌కు తీసుకోవాలి. ఇంకా కొన్ని పరికరాలు తీసుకెళ్ళాలి. అన్నిటినీ మించి మంచి ధైర్య సాహసాలు కలిగిన ఓ మొరటుమనిషిని కూడా మనతో తీసుకుపోవాలి” అన్నాడు.

“మొరటు మనిషి ఎందుకు?” అడిగింది స్టెల్లా.

రంజిత్‌కు ఆశ్చర్యం కలిగింది. అంతగా తాగినా ఆమె మాటల్లో ఎటువంటి తొట్రుపాటు కనిపించలేదు.

“ఒక రకంగా ఎదురు చూడకుండా ముందుకుదూకే ప్రమాదాలను ఎదుర్కోటానికి.”

“మనిద్దరం సరిపోమా భారత్.”

నవ్వాడు భారత్.

“సరిపోమని కాదు. ఐనా మనకు తోడుగా ప్రాణాలకు తెగించి ప్రమాదంలోకి దూసుకుపోయే మనిషి తోడు మనకు ఆ దీవిలో ఎంతయినా అవసరం. నిజానికి టకారాల శారీరక బలం ముందు మన బలం ఎందుకూ పనికిరాదు. కేవలం శారీరక బలంతోనే తలపడవలసి వచ్చినప్పుడు మనకు అలాంటి మనిషి తప్పకుండా అవసరమవుతాడు.”

స్టెల్లా మాట్లాడలేదు. అతడి మాటలు నిజమే అనిపించాయి. అవును, తమకు తోడుగా సాహసవంతుడైన ఓ మనిషి వుండటం అన్నివిధాలా మంచిది.

రంజిత్ సిగరెట్టును వెలిగించి “భారత్....నువ్వు చెప్పిన ఆ మొరటు మనిషి గురించి నాకు వదిలెయ్యి. నాకు తెలిసి అలాంటి మనిషి ఒకడున్నాడు. అతని పేరు జాన్సన్. ప్రమాదాలంటే అతనికి లక్ష్యం లేదు. చావుకు తెగించి ఎలాంటి సాహసాన్నైనా చేస్తాడు. డబ్బు కోసం ఎంతటి ఘోరాన్నయినా చెయ్యటానికి వెనుకా

డదు" అన్నాడు.

"గుడ్. అయితే రేపు ఉదయం నేను ప్రొఫెసర్ అనంత్‌ను కలిసివచ్చిన తర్వాత నువ్వు జాన్సన్‌తో మాట్లాడు. హెలికాప్టర్ హైర్‌కు తీసుకునే విషయాన్ని నేను చూసుకుంటాను."

అప్పటికి భారత్—రంజిత్‌లు శక్తికిమించే తాగారు. వాళ్ళ మాటల్లో తొట్రుపాటు వస్తోంది. స్టెల్లా మాత్రం తాపీగా కూర్చున్నది.

వాళ్ళిద్దరి అవస్థనూ చూసి నవ్వుతూ "ఏమైనా ఇండియన్స్ ఎక్కువ తాగలేరు. ఆడదాన్నైన్నా వుండీ మీకంటే ఎక్కువ తాగి ఎంతో తాపీగా కూర్చున్నాను" అన్నది.

"నువ్వు ఆడదానివా?" పరిహాసంగా అడిగాడు భారత్.

"ఏం.... కాదా? ఆ అనుమానం ఎప్పుడొచ్చింది?" నవ్వుతూనే అడిగింది.

"కాదు. నువ్వు ఆడపులివి స్టెల్లా. నీ సాహసం అమోఘం. నువ్వు నాదానివి కావటం నా అదృష్టం. నువ్వు నాకు తోడుగా లేకుండా వున్నట్లయితే టకారా దీవినించి ఒంటరిగా నేను ప్రాణాలతో బయటపడి వుండే వాడిని కాదు. అందుకే నువ్వు నా దృష్టిలో మామూలు ఆడదానివి కాదు."

"నీకోసం ఎంతటి సాహసానికైనా సిద్ధమే భారత్. నాకు నువ్వు కావాలి. నీకోసమే నేను భారతదేశానికి వచ్చాను. నా జీవితం నీకోసమే" అన్నది స్టెల్లా ప్రేమగా అతడిని చూస్తూ.

"థాంక్ యూ.... ఆ ధైర్యంతోనే ఇప్పుడు మళ్ళీ టకారాకి వెళ్ళి ఆ కపాలీదేవత హారంలో వున్న మణిని

తీసుకురావటానికి ఈ సాహస యాత్రకు పూనుకుంటున్నాను. నా జీవిత ధ్యేయం అదొక్కటే. కోట్ల విలువ చేసే ఆ మణిని మనం ఎలాగైనా సాధించి తీరాలి. అందుకు నాకు మీ ఇద్దరూ సహకరించాలి."

రంజిత్ కళ్ళు ఎక్కువగా తాగటం వల్ల మూతలు పడుతున్నాయి.

సెల్లా అన్నది: "ఇక పడుకుందాం. రంజిత్ కు నిద్ర వస్తోంది."

రంజిత్ బలవంతంగా కళ్ళు తెరుస్తూ "రేపు మాట్లాడుకుందాం....గుడ్ నైట్" అని అక్కడినించి పక్కనే వున్న గదిలోకి వెళ్ళిపోయాడు.

ఇంకొన్ని క్షణాల తర్వాత భారత్ — సెల్లా భారత్ పడక గదిలో వెళ్ళిపోయారు.

తలుపులు మూసి లైటార్పి బెడ్ మీద పడుకున్న తర్వాత సెల్లా — భారత్ పెదవుల మీద బలంగా ముద్దు పెట్టుకుంది.

అతడు ఆమెను బలంగా తన ఛాతీకేసి అదుముకున్నాడు. ఆమె అతడిని చుట్టుకుపోయింది.

"భారత్" పిల్చింది.

"ఏమిటి?" అడిగాడు.

"నాకు ఈ క్షణాలు శాశ్వతం కావాలని వుంది. నీతో స్వర్గాన్ని, నాజీవితాన్ని అనుభవించటానికే నేను కరోన్ ను కూడా చంపి ఇక్కడకు వచ్చాను."

"ఇప్పుడేమయ్యింది సెల్లా?"

"ఎలాగో అతి కష్టంమీద చావును తప్పించుకుని ఆ టకారాల చేతుల్లోనించి తప్పించుకుని బయటపడ్డాం. కాని ఇప్పుడు నువ్వు మళ్ళీ ఆ దీవిలోని ప్రమాదాన్ని

ఆహ్వానిస్తూ వెళ్ళబోతున్నావు. ఇప్పుడు మన పరిస్థితి ఇంతకు ముందులా వుండదు. కనిపిస్తే బల్లేలతో పొడిచి చంపుతారు. ఎందుకో ఈసారి మనం టకారాలను జయించి ఆ మణితో తిరిగి రాగలమా అనిపిస్తోంది."

అదిరిపడ్డాడు భారత్ — స్టెల్లా మాటలకు. అతడికి ఫారెన్ విస్కీ మత్తంతా ఒక్కసారిగా దిగిపోయినట్లనిపించింది.

స్టెల్లాయేనా ఇలా మాట్లాడుతున్నది!

ఆశ్చర్యంగా "స్టెల్లా!" అన్నాడు.

అతడి మాటలోని ఆశ్చర్యాన్ని గమనించి నవ్వుతూ "అవును భారత్" ఎందుకో నాకు అలా అనిపిస్తోంది. ఆ దీవిలో వున్నన్ని రోజులూ అక్కడినించి బయటపడటం గురించే మనం నిరంతరం ఆలోచిస్తూ వుండిపోయాం..... ఇప్పుడు తిరిగి మళ్ళీ అదే దీవికి వెళ్ళబోతున్నాం.... ఈ సారి ఎలాంటి పరిణామాలను ఎదుర్కొవలసి వస్తుందో తెలీదు. ఒకవేళ మనిద్దరం ప్రాణాలతో ఆ దీవి వదలి రాలేకపోయామనుకో....అప్పుడు మనకు మిగిలేదేమిటి? శూన్యం. అందుకే అంటున్నాను. నాకు ఈ క్షణాలు నీతో శాశ్వతం కావాలి....అందుకోసం నువ్వు మరోసారి ఈ టకారాదీవి ప్రయాణం గురించి ఆలోచించు" అన్నది.

"నిజంగా నమ్మలేకుండా వున్నాను స్టెల్లా నువ్విలా మాట్లాడుతున్నావంటే. నువ్వు నాలో పిరికితనాన్ని ప్రవేశపెడుతున్నావు. నీ ధైర్యమంతా ఏమయ్యింది? నువ్వెందుకిలా మాట్లాడుతున్నావు? ఎందుకిలా ఆ దీవికి వెళితే మనం తిరిగి రాలేమని భయపడుతున్నావు?" అనడిగాడు భారత్ లేచి కూర్చుని.

నిజంగానే స్టెల్లా మాటలతో అతడి మత్తంతా వదిలి

పోయింది.

సెల్లా పడుకునే వుంది. ఆమె కళ్ళల్లో అతడిపట్ల ఆరాధన, ఏదో అర్థింపు ఎంతో క్లియర్ గా అతడికి కనిపించాయి.

"నేను భయపడటం లేదు భారత్ ...కాని శత్రువుల బలం గురించి కూడా మనం ఆలోచించాలి కదా! అంతేకాదు. మనుషుల వల్ల ఎదురయ్యే ప్రమాదాలే కాకుండా ఆ దీవిలో క్రూరమృగాలనించి కూడా మనకు ప్రమాదాలు తప్పవు. ఈ రిస్కంతా తీసుకోవటం ఎందుకు? ఆ మణికోసమే కదా! పోనీ, దాన్ని ఆ టకారాలకు వదిలెయ్యరాదా?"

భారత్ కి ఏం మాట్లాడాలో తెలీలేదు. సెల్లాలో ఇండియాకు వచ్చిన తర్వాత అటువంటి మార్పు వస్తుందని అసలు వూహించనే లేదు.

అయితే ఆమె అంతర్యాన్ని కొంతవరకు అర్థం చేసుకోగలిగాడు. ఎంతటి ధైర్యం, సాహసం కలిగినదైనా ఆమె ఒక ఆడదే.

స్త్రీగా ఆమె హృదయంలో తనపట్ల ప్రేమ, ఆరాధన వున్నాయి. అందుకే తనకోసం ఇంతదూరం ఎన్నో కష్టాలను ఎదుర్కొనికూడా వచ్చింది.

ఎంతగా ఆత్మవిశ్వాసం, ఆయుధబలం వున్నాయనుకున్నా ఆ టకారా దీవిలో ఆ జాతివాళ్ళదే ఎప్పుడూ పైచెయ్యిగా వుంటుంది. స్థానబలం అటువంటిది. ఆ దీవిలో యే దారి ఎటువెళుతుందో, ఏవైపుకు వెళితే ఎలాంటి ప్రమాదం ఎదురవుతుందో వాళ్ళకి బాగా తెలుసు. అలాంటి మనుషులను ఎదిరించి వాళ్ళు ఎంతో ప్రాణప్రదంగా చూసుకునే ఆ మణిని తీసుకురావాలంటే అంత సులభం కాదు. ఆ విషయం తనకీ తెలుసు. ఐనా

దానికోసం ఎంతటి సాహసానికైనా వెనుకాడకుండా ఆ దీవిలోకి తిరిగి అడుగు పెట్టాలనుకుంటున్నాడంటే ఎందుకోసం?

కోట్ల రూపాయలు విలువ చేసే ఆ అపురూపమైన మణి కోసమే! ఆ మణి తన సొంతం కావాలి. అదృష్టమో— దురదృష్టమో ఆ మణి తనకు కనిపించింది. అలాంటి మణి ఆ దీవిలో వుందనే నిజం తనకీ, స్టెల్లాకే తెలుసు.

ప్రపంచంలో అరుదైన ఆ మణితో తను ప్రపంచంలో అందరికంటే గొప్పవాడై పోవాలి! తన ధ్యేయం అదే. అందుకోసం తను ఎంత సాహసాన్నయినా చెయ్యటానికి సిద్ధమే—

చివరగా అన్నాడు "సారీ స్టెల్లా....ఎంత ప్రయత్నం చేసినా, ఎంతగా ఆలోచించినా నేను నా మనసును, నా ధ్యేయాన్ని ఆ అపురూపమైన మణిమీదనించి మళ్ళించుకోలేక పోతున్నాను. ఎందుకో మనం జయిస్తామనే నమ్మకం నాకుంది. నువ్వు నాకు తోడుగా వుంటేచాలు. ఇక ఈ విషయంలో నా నిర్ణయం మారదు. దయచేసి నా నిర్ణయాన్ని మార్చే ప్రయత్నం చెయ్యకు."

స్టెల్లా ఆ తర్వాత ఏమీ మాట్లాడలేదు. ఆ మణిగురించి భారత్ ఎంత పట్టుదలతో వున్నాడో ఆమెకు బాగా అర్థమయ్యింది. ఇక తన మాటలవల్ల అతడి నిర్ణయంలో ఎలాంటి మార్పూ రాదని ఆమె నిర్ణయించుకుంది.

* • *

ఉదయం—

సరిగ్గా ఎనిమిది గంటలకు భారత్—స్టెల్లా కార్లో వెళ్ళి ప్రొఫెసర్ అనంత్‌ను కలుసుకున్నారు.

ప్రొఫెసర్ అనంత్ నవ్వుతూ వాళ్ళను ఆహ్వానిం

చాడు. ఆతడి పక్కనే ఓ అందమైన యువతి కూర్చుని వుంది. ఆమె కొంచెం అనూయగా చూసింది స్టెల్లాను. ఎందుకంటే ఆమె స్టెల్లా కంటే అందంగా లేదు.

ఆమెను పరిచయం చేశాడు అనంత్.

ఆమె పేరు లీల....అనంత్ ప్రియురాలు. కొద్ది రోజుల్లో వాళ్ళిద్దరూ వివాహం చేసుకోబోతున్నారు.

"మిస్టర్ భారత్ ...నిన్న నేను మరో మనిషితో మన ప్రయాణం గురించి సంప్రదించాలని చెప్పాను కదా. ఆ మనిషి ఎవరో కాదు. ఈ లీల....లీల మన ప్రయాణానికి ఒప్పుకుంది."

"థాంక్ యూ మిస్ లీల....మీరు ఒప్పుకున్నందుకు కృతజ్ఞతలు" అన్నాడు భారత్.

"అయితే లీల ఒక షరతుమీద ఈ ప్రయాణానికి ఒప్పుకుంది. ఆ షరతు యేమిటంటే లీలకూడా మనతో టకారాదీవికి వస్తోంది."

"ఈజిట్!' ఆశ్చర్యమో, సంతోషమో తెలీకుండా అన్నాడు భారత్.

"అవును. లీల మనతో రావాలని అనుకోవటంలోని ముఖ్యమైన కారణం ఏమిటంటే ఆమె నన్ను చూడకుండా ఒక్కరోజుకూడా వుండలేదు. రెండో కారణం—ఆమెకు దీవుల పట్ల సహజంగానే కొంత ఆసక్తి వుండటం. ఇంతకు ముందు ఒకసారి నేను దీవుల గురించి పరిశోధన చేస్తున్నప్పుడు నాతో పాటు ఒక దీవికి కూడా వచ్చింది."

స్టెల్లా అన్నది: "మిగిలిన దీవుల గురించి నాకు తెలీదు కాని టకారా దీవి అనుక్షణం ప్రమాదాలతో నిండి వున్నది. అక్కడ ఎదురయ్యే నీలిరంగు పాములు చాలా

ప్రమాదకరమైనవి. ఐనా టకారా జాతి మనుషులగురించి మాకు పూర్తిగా తెలీదు. టకారాదీవికి లీల రావటం అంత మంచిది కాదని నా ఉద్దేశం."

"మీరు వస్తున్నారా?" వెంటనే కొంచెం కోపంగా అడిగింది లీల.

"నేను వెళుతున్నాను. ఎందుకంటే ఆ దీవిలో నేను కూడా ఏడురోజులు ఎన్నో ప్రమాదాలను ఎదుర్కొంటూ గడిపాను. అందువల్ల నాకు యెలాంటి భయం లేదు" అన్నది.

"మీరంతా వుంటారు కదా! ఇక నాకు భయమెందుకు? ఏదైనా ప్రమాదం ఎదురైనప్పుడు మీరంతా వుండి నన్నొక్కదాన్ని కాపాడకుండా వుంటారా?" అన్నది లీల.

స్టెల్లా నవ్వింది.

నవ్వి "ఒక్కొక్కసారి ఎవర్ని వాళ్ళు కాపాడుకోవటమే కష్టమవుతుంది. అలాంటిది మరో మనిషి ప్రాణాన్ని కాపాడే అవకాశం సహజంగా వుండదు. ఎవరిని వాళ్లు కాపాడుకునే శక్తి సామర్థ్యాలు వున్నప్పుడే ఆ దీవిలోకి రావటం మంచిది" అన్నది.

ఆ మాటలతో లీల మొహం ముడుచుకున్నది.

ఆమె మొహాన్ని చూసి బాధపడ్డాడు భారత్. స్టెల్లా మరీ అంత గట్టిగా చెప్పటం బావుండలేదేమో అనిపించింది. మనసులో భారత్ కు లీలకూడా తమతో వస్తే బావుండును అని వుంది.

"ఆల్ రైట్. మిస్ లీల అంతగా ఇంట్రస్టు చూపుతుంది కాబట్టి ఆమెకూడా మనతో వస్తుంది. ఇందుకు మాకు యెటువంటి అభ్యంతరం లేదు" అన్నాడు

భారత్.

ఆ మాటలతో సెల్లా అదోలా అతడికేసి చూసింది. అతడి కళ్ళలో ఆమెకు యెటువంటి భావమూ కనిపించ లేదు. అతడు తన మగబుద్ధిని చూపించుకున్నాడని అను కుంది.

భారత్ అలా అనగానే లీల ముఖం విప్పారింది సంతోషంతో.

"థాంక్ యూ" అన్నది నవ్వుతూ—

"సో....మన టకారా దీవి ప్రయాణం ఫిక్స్ అయి నట్లే...." అన్నాడు అనంత్.

"అవును. మీ ఇద్దరికీ నేను మరోసారి కృతజ్ఞతలు తెల్లడించుకుంటున్నాను" అన్నాడు భారత్.

"అవసరం లేదు....నాకూ కొంత ఇంట్రస్టు వుంది కాబట్టి వస్తానని అన్నాను. ఇంకో రెండు నెలల్లో నేను స్టేట్స్‌కు వెళతాను. అక్కడ నా తమ్ముడు వున్నాడు.. అన్నట్టు రాత్రి మీరు వెళ్ళిన తర్వాత దీవుల గురించి నేను తయారుచేసిన నోట్సును తీసి దాన్ని రెఫర్ చేశాను. అందులో టకారా దీవి పేరు గురించిన ప్రస్తావన ఒకచోట వుంది. ఇక్కడికి రెండువేల కిలోమీటర్ల దూరంలో సాబూజా—ముంకాసా అనే దీవులు వున్నాయి. ఆ దీవు లకు నేను ఒకసారి వెళ్ళినప్పుడు సాబూజా దీవిలోని ఆట వికులు కొంతమంది ఏదో మాటల సందర్భంలో అక్కడే యెక్కడో టకారా అనే దీవికూడా వున్నట్టు నాకు చెప్పారు.

అప్పుడు ఆ దీవిగురించి నేను వాళ్ళను అడిగాను. అందుకు వాళ్ళు యెప్పుడూ ఆ దీవిని చూడలేదని ఎన్నో యేళ్ళక్రితం వాళ్ళ పూర్వీకులు తమకు ఆ దీవి పేరు చెబితే

విన్నామని చెప్పారు. ఐతే సాబూజా—ముంకాసా దీవుల్లో వున్న మనుషులకు నాగరికులమీద ద్వేషం పగ అనేవి లేనేలేవు. ఎందుకంటే నాగరికులు ఎప్పుడు ఆ దీవులకు వెళ్ళినా వాళ్ళకు కావలసిన సిగరెట్లు—మత్తు పానీయాలూ తీసుకెళుతూ వుంటారు" చెప్పాడు అనంత్.

"నాగరికులకు ఆ దీవులకు వెళ్ళవలసిన అవసరం యేముంటుంది?" భారత్ అడిగాడు.

"ఆ దీవుల్లో మందులలోకి ఉపయోగించే యెన్నో రకాల దివ్యమైన ఔషధాల మొక్కలు, మూలికలు వున్నాయి.... వాటికోసం నాగరికులు అక్కడకు వెళుతూ వుంటారు."

ఇంకా చెంసేపు వాళ్ళిద్దరూ, తమ ప్రయాణాన్ని ఎలా యెక్కడినించి మొదలుపెట్టవలసి వుంటుందో మాట్లాడుకున్నారు.

భారత్—అనంత్‌కు మెరటు మనిషి జాన్సన్ గురించి కూడా చెప్పాడు,

"గుడ్. అటువంటి మనిషి మనవెంట తప్పకుండా వుండి తీరాలి" అన్నాడు అనంత్.

తర్వాత తమతో టకారా దీవికి వస్తున్నందుకు ప్రొఫెసర్ అనంత్‌కు తను ఇవ్వదలచిన డబ్బుగురించి కూడా చెప్పేశాడు భారత్. అందుకు అనంత్ ఒప్పుకున్నాడు.

మళ్ళీ కలుస్తానని చెప్పి భారత్ లేచి నిల్చున్నాడు. సెలాకూడా నిలబడింది. వెళ్ళబోయే ముందు అనంత్ ఆమె కళ్ళలోకి సూటిగా చూశాడు. ఆమె కలవరపడింది.

"లీల మనతో రావటానికి యెందుకు ఒప్పుకున్నావు?

ఆమె అందం చూస్తూ తిరగటానికా?" తీక్షణంగా అడిగింది స్టెల్లా కారు డ్రయివ్ చేస్తూ—

"అమెరికా ఆడదానికి కూడా ఇంత అసూయ వుండటం అంత మంచిది కాదు స్టెల్లా.... నేనెందుకు ఒప్పుకున్నానో నీకు అర్థంకాలేదు. ఆమెను బ్లంట్‌గా రెఫ్యూజ్ చేశామనుకో ఆమె రావటం మానేస్తుంది. అంతేకాదు. ప్రొఫెసర్ అనంత్‌ను కూడా మనతో రానివ్వదు. ఆమె లేకుండా అనంత్ మనతో రావటానికి ఒప్పుకోడు. అందుకే లీల రావటానికి నేను ఒప్పుకోక తప్పలేదు."

"నువ్విలా చెబుతావని నాకు తెలుసు. నీ మనసులో ఏముందో నాకు తెలుసు. కొంచెం అందంగా వున్న ఆడదాన్ని చూస్తే నీ మనసు ఎగిరిపోతూ వుంటుంది. నువ్వు లీలను కళ్ళతోనే తినెయ్యటాన్ని నేను గమనించలేదనుకున్నావా? ఏమో! నువ్వెన్ని చెప్పినా లీల మనతో రావటం నాకు ఇష్టంలేదు భారత్....ఇప్పుడు బాగానే వున్నా తర్వాత ఆమె మనకు భారంగా తయారౌతుంది. మనంత చురుగ్గా ఆమె ఆ దీవిలో సంచరించగలదా? అక్కడ లీలకు ఏదైనా ప్రమాదం జరిగితే అందుకారణం యెవరౌతారు? ఒప్పుకున్నందుకు నువ్వే అవుతావు" అన్నది.

భారత్ ఆమెతో ఏమీ మాట్లాడలేదు.

స్టెల్లా జెలసీ ఫీలవుతోందని అతనికి తెలిసిపోయింది. అంతేకాకుండా తన గుణం గురించి కూడా ఆమెకు బాగా తెలుసు.

ఇంటికి వెళ్ళేసరికి రంజిత్ వాళ్ళకోసమే యెదురు చూస్తున్నాడు. అనంత్ ఒప్పుకున్నాడని చెప్పాడు.

# "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 5 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము

# "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. పూర్తి వివరాలకు పత్రిక చూడండి.

అయితే, ఈ స్కీము అపవ ఏజంట్లు వున్న ప్రాంతాలకు వర్తించదు. మీరు హోమ్ డెలివరీ సభ్యత్వము పంపే ముందు మీ వూరిలో మా ఏజంటు లేడనే విషయం నిర్ధారణ చేసుకోండి.

నేడే మీరూ 'హోమ్ డెలివరీ'లో చేరండి!

భారత్ అతనితో.

“నాకు తెలుసు ఒప్పుకుంటాడని. అందుకే జాన్సన్‌ను తీసుకువచ్చాను” అన్నాడు రంజిత్.

జాన్సన్ భయంకరంగా నాగరిక దుస్తుల్లో వున్న మొరటు మనిషిలా వున్నాడు—సన్నటి గుండుతో లావుగా — అతడి కళ్ళుకూడా భయంకరంగానే వున్నాయి గాజు గోళాల్లా—

* * *

హెలికాప్టర్ చప్పుడు చేస్తూ గాల్లోకి లేచింది భారంగా-ఆ సమయంలో భారత్ మనసుకూడా గాల్లో తేలిపోతున్నట్టుగానే అనిపించింది. అతని పక్కనే స్టెల్లా—రంజిత్—జాన్సన్—ప్రొఫెసర్ అనంత్—లీల కూర్చుని వున్నారు.

కొన్ని క్షణాల్లోనే హెలికాప్టర్ సముద్రం మీదికి వచ్చేసింది.

ఎందుకో స్టెల్లా అంత ఉత్సాహంగా వుండలేక పోయింది. ఆమె హృదయాన్ని ఏదో తెలియని ఆందోళన ఆక్రమించుకున్నది. ఎంత ఉత్సాహం తెచ్చుకుందామని అనుకున్నా సాధ్యం కాలేదు.

స్టెల్లాలో కలిగిన మార్పును భారత్ గుర్తించాడు. ఆమెకు కోట్లు విలువచేసే ఆ మణిమీద యెలాంటి వ్యామోహం లేదని పూర్తిగా తనమీదనే ఆమె మనసంతా వుందనీ అతడికి తెలుసు.

ఐనా ఆ టకారాదీవి ప్రయాణాన్ని కొనసాగించక తప్పలేదు.

సముద్రం మీద యెగురుతున్న హెలికాప్టర్‌లోనించి కిందికి చూస్తూ నవ్వుతూ ప్రొఫెసర్ అనంత్‌తో యేదో

చెబుతోంది లీల.

ఆమె మాటలు తీయగా వున్నాయి. ఆమె గొంతు ఎంతో కోమలంగా వుంది. కాని ఆమె అప్పుడప్పుడు అడవి జంతువులా చూస్తున్న జాన్సన్ ని చూసి భయంతో మాటలను ఆపు చేస్తోంది.

సెల్లాకు జాన్సన్ ను చూస్తే భయం కలగలేదు. ఆమె అలాంటి మనుషులను కంపూచియాలో యెంతో మందిని చూసింది. అంతేకాదు. రెండు మూడు సార్లు అటువంటి మనుషులతో పోరాటానికి తలపడి వాళ్ళను చిత్తు చేసింది. పినా టకారా దీవిలో ఆ జాతి ఆటవికులను చూసిన తర్వాత ఇటువంటి జాన్సన్ లను చూస్తే యేమీ అనిపించదు.

కొంచెం సేపటి తర్వాత అనంత్ వాళ్ళందరికీ దీవుల గురించి ఆ దీవుల్లో జీవించే రకరకాల జాతుల మనుషుల గురించి చెప్పటం మొదలు పెట్టాడు.

అంతా శ్రద్ధగా వింటున్నారు — ఒక్క సెల్లా తప్పించి.

ఎండలో హెలికాప్టర్ నీడ సముద్రంమీద పడుతోంది.

నిమిషాలు — గంటలు గడిచిపోయాయి.

వాచీకేసి చూసుకొన్నాడు అనంత్. "ఇంకో గంటలో మనం సాబూజా దీవిని చేరుకుంటాం" అన్నాడు.

అప్పటికే సాయంత్రమవుతోంది. ఇంకో గంటలో నే చీకటి పడేలా వుంది.

మళ్ళీ కబుర్లు మొదలైనాయి. ఈసారి సెల్లా కూడా వాళ్ళ కబుర్లలో భాగం పంచుకుంది. (సశేషం)

